# అంకితము

భావౌన్నత్యముఁ గాంచి సత్కవులు సం ♦ భావింపగా మున్ను, 'వాఁ
డే వీఁ' డన్నవలన్ రచించి కృతిగా ♦ నే నిచ్చితిన్ దండ్రి, కా
పై, వాక్యార్థ రసప్రసిద్ధికి బుధ ♦ వ్రాతంబు మెప్పొంద 'నే
నే' వాసింగను గ్రంథమొండు గృతిగా నే ♦ నిచ్చితిన్ దల్లి, కా
ళీవిన్ చిత్రవిచిత్ర కావ్యరసపుష్టిన్ ♦ మీఱె సం చెల్లఱుల్
లోపహ్నా! యనినన్ను మెచ్చుకొనఁ 'గా ♦ లూరాయి' భాషాసతీ
గ్రీవాలంకృతిగా రచించి, సుజనుల్ ♦ ప్రీతిన్ విలోకించి, సం
భావింపన్ గృతిగా నొసంగఁదగదే ♦ మాయత్తకున్ మామకున్.

చ. కరము సురక్తి మీ యనుఁగు ♦ గన్నియ నే సుభరించినాఁడ; నా
కరణినె నేఁడు నాదుకృతి ♦ కన్యక మీరు భరింపఁబోలు; మీ
కరుణవహించి నాదుకృతి ♦ కన్యక మీదరకీర్తి కన్యతో
వఱలుచు, మీ సహాయమున ♦ వర్ధిలుఁగాక జగత్ప్రసిద్ధిగన్.

దేవరాజు వేంకట కృష్ణారావు

# కాలూరాయి

## సూచన

'అన్నా! ఆరంభం అయినదే!'

'ఓహో! ఎంతగుండె నిబ్బరము!'

'సంతకము కూడా చేసినాడే!'

"జమీలియా పూల్ సాహేబులు ఏలాగో గతించి నారుకదా! ఇక దొంగ నాణెములు తయారు చేయుచున్న ఒక్క కాలూరాయి మాత్రమే మిగిలి యున్నాడు. వీనిని పట్టెడు పని నా నెత్తిమీఁద నొక భారమై యున్న దనుకుంటే వీ డొకడా? ఇప్పటికి ఉన్నవాళ్లు చాలకనా? అంతా దోపిడి గాండ్ర మయమైన ట్లున్నదే!" అని అరిందమ్ సాశ్చర్యముగా బలికెను.

ఆనాటి సాయంకాల మైదుగంటలకు పోలీసు స్టేషనులో తన యభిమాన పత్రికయగు కేసరి చదువుకొనుచు నిష్ఠా గోష్ఠిగా నరిందమ్ సర్కిల్ ఇన్‌స్పెక్టరుతో మాట్లాడుచుండగా ఇన్‌స్పెక్టరుగారి పేర విలాసము వేయబడి యుండిన యొక కవరు ఉత్తరము దీసికొని యొక పోష్టు బంట్రోతు వచ్చి సర్కిల్ ఇన్‌స్పెక్టరు గారి కీయ వారది చదువుకొని అరిందమ్ బాబున కీయ నాయనయు నద్దానిని చదువుకొని "* * *

వంతకము కూడా చేసినాడే—ఇది యింగ్లీషు దెబ్బలాగుందే ఈ మాటలు రవజ్ఞులతో గాబోలు నరసయ్య! ఐనా యిది దొంగపేరేమో" యని సాశ్చర్యముగ బలికెను.

"కావచ్చును. అదేదో నేను కనుకోగలను. ప్రస్తుతం మీరు చెయ్యవలసిన పనులు రెండు—అందు మొదటిది; యిప్పుడు మన యెదుట నిలచియున్న ఈ ప్రయాణీకుల దోపిడీ కేసు; రెండవది; దొంగనాణెములు తయారు చేయుచున్న కాలూరాయిని పట్టుట; ఇవి ముఖ్యమైన పనులు" అని సర్కిల్ ఇన్‌స్పెక్టరుగా రనిరి.

"మీరు చెప్పినది సరిగానే ఉన్నది; కాని చాలదు. ప్రస్తుతము మీ పేర వచ్చిన యీ జాబునుగూర్చి మీరు ఆలో చిస్తూ మీనమేషాలు లెక్కిస్తూ కూర్చుంటే కాదు. చూ చారా, ఉత్తరంలో ఏమి వ్రాసినాడో చూచినారా? ఈ రాత్రేనట."

"ఔనండీ అయితే యిందును గూర్చి మీ సలహా యేమిటి?"

"ముందుగా యిప్పుడీపుత్తరం ప్రకారం చోరీ కాబోయే లాల్ చంద్ గారి యిల్లు కాపలాకి తెలివైన ఘాటు వుంచి, మంగళ్సేనునూ, మరొక సబ్‌యిన్‌స్పెక్టరునూ ఉంటే, నేనునూ సుమారు 12 గంటలకు అక్కడికి వెళ్ళి సబ్‌యిన్

స్పెక్టర్లను రిలీవు చేస్తాను. ఈప్రకారం అరేంజి చేయండి. ప్రస్తుతం చేయవలసిన పని యింతే.”

ఆ సమీపమున నున్న 778 నెంబరు కాన్‌స్టేబిల్ వీరిరువ్వురి వద్దనున్నా శెలవుగైకొని పోబోవుచుండ 'నీవు మాత్రము వేగం భోజనం చేసుకుని త్వరగా రావాలి సుమా' అని సర్కిల్ ఇన్‌స్పెక్టరుగారు చెప్పిరి.

'చిత్తం—తమరు కటాక్షించి ఈరాత్రికి మాత్రము నాకు శెలవు యిప్పించమని నా ప్రార్థన. నా భార్యకు ఒంట్లో బాగులేదు. కొంచెం మందూ మాకూ చూడాలి. ఇంతకీ నా కీరాత్రి బీటుకూడా లేదు. నా కీరాత్రి ఆఫ్ డ్యూటీ కూడాను' అని 778 సవినయముగ బలికెను.

'సరే' యని ఇన్‌స్పెక్టరుగారు పలుక, 778 శెలవుగైకొని యచటనుండి వెడలిపోయెను.

# కాలహారాయి

## ప్రథమ ఖండము

### మొదటి ప్రకరణము

#### తప్పుల తమాషా

లాల్‌చంద్‌గారింట 10-30 అయినది. వ్యవహార సంబంధమయిన ఖజానాధికారియు తన కార్యాలయము మూసివేసి 10 గంటలకే తన బసకు పోవు నపుడు తన మామూలు ప్రకారము, ఆఫీసు కావలి వారికిని, ఖజానా కావలి వారికిని, పెట్టెలు, తాళములు వేసినకప్పలు, శీళ్ళు మొదలగునవి యన్ని తనిఖీయిచ్చి మరీ వెడలి పోయెను. లాల్‌చంద్ గారును 10-30 తరువాత బయటకు వచ్చి కావలి వారికి హుషారు చెప్పి, 'మీరు నేటిరాత్రి మిక్కిలి జాగ్రత్తగా నుండవలె' నని తానును లోనికి వరుండబోయెను. ఎలెక్ట్రిక్ దీపము లార్పి వేయబడినవి. ఎలెక్ట్రిక్ ఫాన్సు (విద్యుద్వీవనలు) మాత్రము ఎంతయో యోపికగల నౌఖరుల కన్న నేను మదుంగు లధిక భయభక్తులతో వినుగులేక విసరుచున్నవి. లాల్‌చంద్‌గారు

## రెండవ ప్రకరణము

---

'ఏ దేలాగున్నను లాల్‌చంద్‌గారి యింటివద్దతగిన బందోబస్తు చేసుకున్నాము కనుక్కున్నాము, కనుక మిప్పుడు వీరిని గూర్చి తగినంత భోగట్టా తీసుకున్నాము గనుక యిన్నాళ్ళు, వీరిని ఇప్పటిమట్టుకు పంపివేసి, మనము కేసరీ లాల్‌రోడ్డు విచిత్రములను గూర్చి ఆలోచించడము చాలా జరూరు అని తలంచుచున్నాను' అనుచు సర్కిల్ యిన్‌స్పెక్టరుగారు ఆ ప్రయాణస్థుల నంపివేసిరి.

'ఔను, సరే గాని, కేసరీలాల్ రోడ్డుమీద యెండలో నడిచేవాళ్లు చాలామంది ఒక మేడ సమీపానికి వచ్చేసరికి వాళ్ళ శరీరం యావత్తున్నూ కాలిపోయిన ట్లుంటుం దని చాలా మంది అనుకుంటున్నారు. ఆసంగతి విన్నారా?'

'ఔను. విన్నాను గాని; అన్నీ చిత్రాలే. ఏదిచూచినా తలా తోకా అందకుండానే వుందిగాని, సామాన్యంగా ఏదీ కనపడదు. కారణం ఆలోచించినారా?'

'ఆలోచించడమా: వెళ్ళిచూచి, పరీక్షించి, పోల్చి, సంశయనివారణ చేసుకున్నాను. ఏస్థలంలో అలాంటి మంటలు వుడుతున్నాయో, ఆస్థలము, ఆప్రాంతము, ఆచుట్టుప్రక్కల, అంతా చూచి, రోడ్డుమీద సరిగా యెంతమేల యీమంటలు కలుగుచున్నవో ఆమండల మంతా పరీక్షించి, ఆమండలాంత

ర్మధ్య రేఖస్థిత కోణీకృత ప్రాంతమున, బింబానులోమవిలోమ ములననుసరించి Lenses arranged in an angular direction ] యుంచిన యేర్పాటులవలన కలుగుచున్న దీఘాతి యని పోల్చినాను. ఆ మండలాంతి ర్మధ్యరేఖను చిరకాలము నుండి నివాసానర్హమైన కేసరీలాల్ భవన మంతయు పరీక్షించి చూచితిని. ఆయింట నెవరును లేరు. ఆ యిల్లు చాలకాలము నుండియు పాడుపడి యుండుటచేతను, జనసంచారము లేక యుండుట చేతను, ద్రోహజనమునకు పర్యాయమున తావై యున్నది. సరిగా ఆ మంటలు పుట్టినవేళకే ఆ భవనము ప్రవేశించి అన్ని గదులును, సునిశితముగా పరీక్షించితిని. ప్రయోజనము లేకపోయెను. విషయము, కారణము, స్థలము, పోల్చి ద్రోహియొక్క బుద్ధికుశలతకు మెచ్చుకున్నాను; కాని ఇందులో వానియొక్క అభిప్రాయమును, ఈప్సితమును తెలుసుకొనలేక పోయినాను. అదియును కొలదిలోనే నిర్ణయించగల ననుకుంటూయున్నాను.'

'చాలాదుర్నయములు చేస్తూవున్న ఈద్రోహి మిక్కిలి చతురుడయి యుండవలెను.'

'ద్రోహియో, ద్రోహులో అది మన మిపు డేలాగు నిర్ణయించగలము?' అని అరిందమ్ పలుకుచు తన పోచీ వాచీ చూచుకుని 'అబ్బా! చాలా వేళయైనది. నేను లాల్‌చంద్‌గారి యింటికి వెళ్ళవలెను.' అని యనెను.

'ఉండండి తొందరేమిటి? అక్కడ బ్రాకెట్ మంగళ్సేనులు వున్నారుగదా ఒక చీటీవ్రాసి పంపండి. ఇదేదో ఆలోచించి మరీవెళ్ళవచ్చును.' అని సర్కిల్ యిన్స్పెక్టరనెను.

పెద్దవాడుగదా యనియో, ఇప్పుడు మాట్లాడవలసిన విషయపు ప్రాముఖ్యత నెరింగియుంటచేతనోగాని, అరిందమ్ యొక చీటీవ్రాసి షెల్లాక్ ద్వారా పంపివేసి, మరల, 'మీరెరుగరుగాని, ఈరకం ద్రోహులతో నాకు బాగా పరిచయంవుంది. వీళ్ళతో చాలాపాట్లు పడ్డాను' అని యనుచు వీరిరువురును స్టేషనులో నొక గదిలోనికిబోయి యేమేమో రహస్యములు గాబోలు మాట్లాడుకొను చుండిరి

చదువరులారా, వారు మాట్లాడుకొన బోవుచున్నది. రహస్యవిషయ మేదోయయి యుండవచ్చును కానిచో నెవరిని గూడ రానీయవలదని చెప్పి, తామేల ప్రత్యేకముగ నొక గది లోనికి బోవలెను? ఎవరినిగూడ రావల దనినప్పుడు మనము మాత్రమెటుల నచటికి పోగలము? పోనిచో వారివారి ప్రసంగవిషయముల దెలిసికొనుటెటుల? కావున వారి నిట విడచి, వారి ప్రసంగానంతరముననైనను, మనకు దెలియరాకుండ నేమియు జేయజాలరు కావున, నావిషయము వారివారి చేతలవలననైన దెలిసికొనగలము గనుక ఇప్పటికి వీరి నిటవీడి మనము లాల్‌చంద్ గారి యింటికి పోవుదమా?

---

# మూడవ ప్రకరణము

---

ఇప్పటికి రాత్రి సుమారు గం॥ 1 ని॥ 30 అయియుండును. పట్టణ మంతయు మాటుమణిగి నిశ్శబ్దముగా నున్నది; కాని ప్రాణావసర కారణములు గల కార్యములవల్ల దిరుగు నార్త జనములును, విషయవ్యసనలోలు రగు మహానీయులును, దిండికి లేకనో, పరధనాపేక్షయే వృత్తి గాగలుగుటనో, చరించు చోరజనములును, దప్ప తదితరుల కంతరాత్రి యపు డోటకు బోవుటకును సర్వసామాన్యముగ నవసర ముండదు గదా! ఇంతకును నెంతేని పనిబూని పోవునారు దక్క తదితరులు సంచరించరుగదా!

అప్పట్టున నొక పోలీసు యుద్యోగస్థుడు బైసికిలుపై నెక్కి వచ్చి లాల్‌చంద్‌గారి యింటి వీధిదెస పహరా యిచ్చుచున్న బ్రాకేట్ దొరగారిపేర విలాసము వేయబడిన యుత్తర మొకదానిని గొనివచ్చి, యాయనకిచ్చెను. ఆయనయు నా యుత్తరము జదువుకొని, నివ్వెరజెంది, రెండుమూడు నిముసములవరకును మాటాడజాలక మిన్నకుండి తుదకు, 'ఏమిదీ, వింత! మంగళ్సేన్, ఇప్పుడు నావద్దకు వచ్చి, మాటలాడి, దక్షిణ ద్వారము యొద్ద కాచియుండు మని చెప్పిపోయిన అరిందమ్‌బాబుగా రిప్పుడు అనగా సుమారు ఒక గంట విరామ

కాలములోనే యీలాగునని యుత్తరము వ్రాయుట కేమికారణము? చూడుము, మంగల్సేన్—ఇది చూడుము' అని యాయుత్తర మాతనికి జదువ నిచ్చెను.

(నోటు) రుక్కా—

" డియర్ మిస్టర్ బ్రాకేట్,

అనుకున్న సమయమునకు నేను మీవద్దకువచ్చి మిమ్మల్ని రిలీవు చేయలేకపోయినాను. ఇక్కడఠాణాలో సర్కిల్ యిన్‌స్పెక్టరుగారితో అత్యంత అగత్యమగు విషయములను గూర్చి చర్చించుచున్నాను. ఇంకొక గంటలోగా రాగలను. కనుక ఈ షెల్లాక్‌గారిని మీవద్దనుండుమని చెప్పి, మీరలో నొక్కొక్కరే విశ్రాంతి పొందవచ్చును. మీరు మిక్కిలి జాగరూకులై యుండవలెను.

కలంతాజా:—ఇతంలో నేనును రాగలను.

ఇట్లు,
విశ్వాసనీయుడు,
అరిందమ్"

మంగల్సేన్ ఆ యుత్తరముచదువుకొని 'మిస్టర్ షెల్లాక్, చాలా వింతగానేయున్నది. అరిందమ్‌బాబుగారు సుమారు 12 గంటలకు యిక్కడికి వచ్చి, తాము దక్షిణ ద్వారమువద్ద కాచియుండుమనిన్నీ, మమ్ములను యిక్కడే జాగ్రత్తగానుండు

మనినీన్ని చెప్పి, ఆయన దక్షిణ ద్వారముదెస పోయియుంటిరి గదా! ఇప్పుడు మరల నీయుత్తర మేమిటి? ' అని యనెను.

'ఇప్పుడు అరీందమ్‌బాబుగా రెక్కడ నున్నారు?' అని బ్రాకేట్, షెల్లాక్‌గారిని ప్రశ్నించెను.

'స్టేషనులోనే ఉన్నారు సర్కిల్ ఇన్‌స్పెక్టరుగారును అరీందమ్‌బాబుగారు మాట్లాడుచున్నారు. కొందరు ప్రయాణస్తులు ఒక దోపిడీకేసు రిపోర్టుచేసినారు. అందును గూర్చియే వా రాలోచించుచున్నారు.' అని షెల్లాక్ భోగట్టా యిచ్చెను.

'ఏమిటోగాని యిదంతా యేదో గోల్మాల్‌గావుంది మీరూ మేమూ కూడా కలిసి, దక్షిణద్వారమువద్దకు వెళ్ళి చూచివద్దాము. ఇక్కడ ఘాట్ వుండనేవుంటుంది గదా. నాకేమో చాలా సంశయంగానే ఉన్నది' అని చెప్పి మంగల్సేను వచ్చుటనే యుండు మని యని, బ్రాకేట్‌దొరగారును షెల్లాక్ గారును దక్షిణద్వారపు దెస బోయి అక్కడ కార్‌నుగాని, అరీందమ్ బాబుగారిని గాని, గానక,

బ్రా—అలో!

షె—ఏమి వింత!

బ్రా—మేము పెద్దఫూల్సుమే!

షె—కాలిక్రింద కన్నం అంటే ఇదే.

బ్రా—అవును గాని మోటారు ఆగినచోట చూదాం. మోటారు అక్కడ నాగినటులనున్నా, కొంత కెర్స

నాయిలు అక్కడ పడియున్న జాడలున్నూ వారు చూచిరి. ఎందుకైనను మంచిదని, లాల్ చంద్ గారిని లేపుటకు సింహద్వారముకడకు మరల పిరువురును పోవుసరికి, అదివరకే లాల్ చంద్ గారు నిదురలేచి, తలుపులు దెరచికొని సింహద్వారము కడనున్న పోలీసువారితో మాట్లాడుచుండ, నింతలో షెర్లాక్ బ్రాకెట్లు పెరటిత్రోవను రాజూచి, లాల్ చందు 'ఏమండో! కొంపముంచారు! అనుకున్నంతా అయిపోయింది. మీరింత మంది వుండిన్నీ ఏమీ కార్యం లేకపోయింది. ఇందుకోనం ఇవాళ సాయంత్రంనుండిన్నీ పెన్నుప్రశ్నంకొనంత ప్రయత్నం చేసిన్నీ, కొనకి తొమ్మండుగురూకూడి డోలు చిరగ్గొట్టినట్లయింది. ఇహమీరెందుకు?——'అనుచు నింకేమో చెప్పబోవుచుండగా బ్రాకెట్ ఆయనమాటలకడ్డువచ్చి 'జొన్లెండి ఏం దేమో మాకుకొంచెం బోధపడనివ్వండి.' అని యనెను.

'ఇంకా యేం కావాలి? కొంపే మునిగింది. నేను మామూలుగా యింతవేళకు లేవడం నాకు అలవాటు అదే ప్రకారంగా నేను లేచి పెరట్లోకి వెళ్ళేటప్పటికి పెరటితలుపులు యావత్తున్నూ తీసేవున్నాయి ఇదేమిరా అని నేను అన్ని తలుపులూ చూసేసరికీ అన్ని తలుపులూ పెరటిద్వారందాకా తీసే వున్నాయి. ఖజానాకొట్టుతాళంకూడా తీసేవుంది. అదిచూచి, ఏమీతోచక, కాళ్ళూచేతులూ ఆడక, మీరందరూ యేంచేస్తున్నారో చూదామని యిటొచ్చేవరికీ మీరిద్దరూ అత్రోవనే వస్తూవుండడం కూడా చూచినాను.'

బ్రా—నకే—లోపలికి పదండి చూదాము.

షైలాక్ బ్రాకేట్లను మరికొంతమంది రక్షకభటులను, దీసికొని, లాలుచంద్ లోపలికి వెళ్ళెను. దక్షిణద్వారము కడ గూడ, నెందుకైనను మంచిదని గాబోలు, కొంతమంది జవానుల నుంచిరి. భవనాంతరము ప్రవేశించినది మొదలు బ్రాకేట్ ప్రతిష్ఠలమును స్థానశల్యపరీక్షగా జూచుచుండెను లాలుచంద్ వీరిని ధనాగారమునకు దోడ్కొనిపోయి చూడ, నాగదితలుపులు తెరచియేయున్నవి అది చూచి అందరకును ననుమాన మినుమడించెను. లాలుచంద్ తన ఐరన్ సేఫ్ సేఫ్‌గానున్నదో లేదో చూచెదనని, దాని హాండీలు (పిడి) లాగిచూడ నది సులభముగా తెరువబడెను అది డబుల్ లాక్ ఐరన్ సేఫ్. ఒక తాళము తన మొలలోనున్నది రెండవది తన ఖజానాగుమాస్తా వద్ద నున్నది. వీ రిరువురును కలిసి యొకకాలమందు దానితాళము తీయవలెను; వేయవలెను అట్టిది యిప్పు డెవరి యవసరమును లేకుండగనే తలుపులు తెరువబడియున్నవి. తలుపులు తెరువబడిన తోడనే చంద్ ఆ యినుపమందసములో నేమియు లేకుండుట చూచి, తెలివితప్పి మూర్ఛిల్లెను.

అయ్యో! లాల్ చంద్, నీవు మూర్ఛిల్లుట న్యాయమే; నీవెంత శ్రమపడి యార్జించితివో! ఈ యార్జనయంతయు నీదియేగాని, నీతండ్రిదిగాదు. ఏమందువో, నీతండ్రి మేమెరుగనివాడుగాడు. స్వల్ప వేతనమునుండి, జీవించుచు, దన

యవసానకాలమున, నీకొరకు మూడువేలు నిలువజేసి యీ యిలాతలమ్మున జీవనమ్మే పాపభూయిష్టమ్మని యెంచి గాబోలన శాశ్వతనిర్వాణము బొందినాడు గదా! కావున నింతవిత్తమింత స్వల్పకాలములో న్యాయమార్గమున కష్టపడి, చెమ్మటలూర్చి, గడించుట యసమంజసము. కాక గాని నీయార్జన, నీయాస్తియు నెట్టిదైన మాకేమి; ఏదియెట్లు లున్నను, పాపము నీవిపుడు దైవోపహతుండవు గదా! నీకొకింత నేదదేర్చవలసినదే.

షైల్లాక్ బ్రాకేట్లు కొంత శైత్యోపచారములుసేయ, వాతండును తెలివిదెచ్చుకొననే గాని పిచ్చియెత్తినవానివలె వాపోవుచుండ, బ్రాకేట్ ఆ యినుపమందసములోనుండి ఒక కాగితము దీయుచుండగా చంద్ ఆకాగితము నందుకొని, 'అయ్యా, ఇదేమిటో చూడుండి; ఇదికూడా దొంగచేపిన వనేగాబోలు!' నని యనుచు నాకాగితమును పురల బ్రాకేట్ దొరగారి కీయ నాయనయు నల దిట్లుండుట చూచెను:—
రూ 89,865— 4— లకు రశీదు.

రాల్‌చంద్‌గారి వద్దనుండి నాకురావలసిన రు 50,000 ల మింజుమలె, యీరోజున చంద్‌గారి యినుప మందసము ద్వారా నాకు ముట్టిన మొత్తము ముప్పది తొమ్మిదివేల ఎనిమిది వందల అరువదియైదు రూపాయల పదునాల్గణాల ఆరు పైసలు మాత్రమే; గాక బాకీ రూ 10,134—1—6 వది

వేల నూటాముప్పదినాల్గు రూపాయల ఒక అణా ఆరు పైన లును, రేపటిదినం వేగంగా పోలీసు సబ్ ఇన్‌స్పెక్టరు షెల్లాక్ ద్వారా పంపినయెడల నాకు క్షేమంగా అందిపోతుంది. ఇంమలో నేమాత్రము అనడ్డజరిగినా, ప్రమాదం ప్రత్యక్షము.

మకాం : ఇక్కడ ఇట్లు
తేదీ—నేడు జి గో మా ర్

ఈచీటినిజూచి, బ్రాకేట్ షెల్లాకులు అపరిమిత మగు నాశ్చర్యమును, భయమును పొందిరి. చంద్‌గారును సంశయాన్వితమనస్కులై, స్తంభించి నిలువబడిపోయిరి. షెల్లాక్‌గారి మోమున నెత్తురు లేదు. రక్షకభటులుగదా యని, బ్రాకేట్ షెల్లాక్ గార్లతో విస్పష్టముగా, సహాయమునుగోరు నభిమతముతో, చంద్‌గారును మాటాడ లేకుండిరి. బ్రాకేట్‌గారికిదియంతయును మాయవలె గాన్పించుచుండ, షెల్లాక్‌తోగాని చంద్‌తోగాని నిరాఘాటముగా మాటలాడలేక యుండెను. కొంతతడ వటుల వీరు ముగ్గురును తమతమ మనముల వితర్కించుచు తుదకు చోరీవిషయము అరింద‌మ్ బాబుగారికిని పర్కిలు ఇన్‌స్పెక్టరుగారికిని తెలియజేయుటయే కర్తవ్యమని వీరి ముగ్గురకును దోచినందున పోలీసు స్టేషనునకు చంద్‌గారు బయలుదేరుచుండ, "అయ్యో, ఈగదికి తాళము వేయవలసిన" దని బ్రాకేట్‌గారు పలుకు నీయ, "బాకీ గదికి యింకా తాళమెందుకు ? ఇకముందుకు పోలీసువారు జాగ్రత్తచేస్తారు

గాబోలు!" అని గొణుగుకొనుచు తనకుగా నిష్టములేకున్నను, ఎట్టటులనో తాళముపేసి వీరు ఇద్దరును స్టేషనుకు బోయిరి.

పోలీసుస్టేషనులో కొందరు ప్రయాణస్థులు సర్కిలు ఇన్ స్పెక్టరుగారితో తిమత త్రోవలో సంఘటించిన చోరీ విషయమయి చేసిన ఫిర్యాదునుగూర్చి యాలోచించుచుండగా చంద్ నేరుగా సర్కిలు ఇన్ స్పెక్టరుగారిని సమీపించి తనయింట జరిగిన చోరీసంగతి చెప్పి, తనతో వచ్చిన బ్రాకెట్ షెల్లాక్ గార్లుకూడ తన ఖజానాగది చూచిరనిచెప్పి బ్రాకెట్ చేతిలోనున్న ఆ రసీదుచీటిని దీసికొని ఇన్ స్పెక్టరుగారి కొసంగెను, ఇన్ స్పెక్టరుగా రది చూచి నవ్వి, అరిందమ్ బాబుగారి కొసంగ నాయనదానిని జూసిచూచి, ఆశ్చర్యమునొంది— "మన మొకసారి చంద్ గారి యింటికి పోవలె" నని యన, వీరందరును చంద్గారి యింటిలోనికి పోయిరి. దాదాపు మూడుగంటల సమయ మైనది. పాపము పోలీసువా రింకను బహు జాగరూకులై పహారా యిచ్చుచునే యున్నారు!

లాలుచంద్ వీరందరిని లోనికి దీసుకొనిపోయి, తన ఖజానాగది తాళముదీసి తలుపు తెరచి, ఇనుపసందనము తెరచి చూపించెను. ఉత్తదంటుగు నా యినుపసందనమున నిప్పుడు వీరేమి చూడగలరు!

పోలీసు ముఖ్యులు తమలో తాము వితర్కించుచుండ, లాలుచంద్, తత్తరపాటుతో, "ఆఁ—జ్ఞాపకము వచ్చినది;

అయ్యా, ఆ యినుపసంద నము తలుపు ప్రక్కమీాట నొక్కి చూడండి—" అన, నామీాట నరేంద్రబాబు నొక్కగా అం దిమిడియున్న ఫొటోగ్రాఫ్ కెమేరాలో నున్న చిన్నఫొటో గ్రాఫును దీసి, చందు విద్యుద్దీపకాంతిలో పరీక్షించిచూచి, గుండెలు బాదుకొనుచు—"అబ్బా! ఇదంతా పోలీసు పితలాట కమే—ఇదంతా పోలీసుకుట్రే—నుకేమీా సందేహం లేదు— అయ్యా, ఇది మీారుచూడండి!" అని ఫొటోగ్రాఫ్ సర్కి లిన్స్పెక్టరుగారి చేతికిచ్చి, అరిందమ్ షెల్లాకులనైపు క్రోధైక దృష్టులతో లాలు చూచుచుండెను ఇన్స్పెక్టరుగారును ఆ ఫొటోగ్రాఫును పరీక్షించి, మిక్కిలి ఆశ్చర్యమును సూచించు నవ్వు నవ్వెను.

చందు—అయ్యా, చెప్పకేమి; మీారొక్కరుమాత్రము యిందులో లేరని అనుకుంటున్నాను—మీారెందులో తగినపని చెయ్యకుంటే ఇక న్యాయం యిచ్చేవాళ్ళెవరు—?

ఇన్స్పె—సరే బాగుంది. మీారు తొందరపడకండి. ఇందులో యింకా చాలాతమాషాలు వుంటాయిలెండి. మిస్టర్ బ్రాకేట్, ముందుగా సుమారు ౧౦ ||౨ కు అరిందమ్ బాబు గారు వచ్చి రన్నారుగదా! ఎవ రెవరు వచ్చారు? ఎలాగు వచ్చారు?

బ్రా—టూసీటర్ కార్; అందులో ఈయన, డ్రైవరు మాత్రమే యుండిరి.

ఇ—మీతో యేమైనా మాట్లాడినారా?

బ్రౌ—మాటలకేమున్నది? మమ్మల్ని సింహద్వారం దగ్గిరజాగ్రత్తగావుండుమని చెప్పి, తాను దక్షిణద్వారం దగ్గిర కాపు వుంటానని చెప్పి, కారుతో వెళ్ళినారు

ఇ—కార్ దక్షిణద్వారమునకు వెళ్ళిన యెంతసేపటికి మీరు వెళ్ళియుంటిరి—అక్కడికి?

బ్రౌ—మీవద్దనుంచి షెల్లాకువచ్చి నాకు చీటి చూపించగనే సంశయం కలిగి, దక్షిణద్వారమునకు వెళ్ళిచూచినాము.

లా—ఇంకా యెందుకండీ ఈ సంశయాలు? కారులో అరిందమ్‌బాబు వచ్చారని యీయన చెప్పుచునే యున్నారు. ఆయన దక్షిణద్వారమునకు కాపలా వుంటానని వెళ్ళినట్టు కూడా చెప్పుచున్నారు. చోరీకూడా పెరటిత్రోవనే జరిగింది. నేనులేచి వీధివైపు వచ్చేసరికి వీరిద్దరూ పెరటిత్రోవనుంచే వస్తూయుండిరి. అన్నిటికిన్ని మించిన సోదాగా యీ ఇనప మందసంలో అమర్చబడియున్న ఫొటోగ్రాఫ్ కెమేరావల్ల చోరీచేసిన మన అరిందమ్‌బాబుగారి ఫొటోగ్రాఫే ఇందులో తయారై యుందిగదా! ఇంకా యింతకన్న యెక్కువ నిదర్శనాలు ఏమికావలెనండీ? సొమ్మంతా దోచుకొని ఆమందసంలో దొంగవుంచిన రసీదువల్ల, దొంగకు బాగా పరిచయస్థుడున్నూ, స్నేహితుడున్నూ, అయిన షెల్లాకుగారికి కూడా యిందులో కొంతవొంతు వుండనేవుంది. ఇంత అన్యాయమా!

ఇంతఘోరమా! ఎక్కడా చూడలేదండీ— పోలీసువాళ్ళే యింతంతపనులు చెయ్యడము!

కాని నేను ఇనపపెట్టెందగ్గరలో ఆ కెమేరా అమర్చి యుండకపోతే, యీ కేసులో నాకేమిన్నీ భోగట్టాయే దొరకక నానాఅవస్థలూ పడిపోయివుందును కదా పాపం—కళ్ళుమూసుకొని పాలుతాగి తన నెవరున్నూ చూడలేదుగదాయని యనుకొనుచున్న పిల్లివలె రాము—రాము—అరీందమ్ ఎంతపని చేసినాడు! ఇంత ఘోరమైన కార్యంచేస్తాడని అరీందంగూర్చి ఒక్కనాడైనా అనుకోలేదు రక్షింపవలసిన మనిషే భక్షిస్తే ఇక మావంటివాళ్ళం బ్రతకడం యెలాగు?

ఇ—సరే లెండి ఇప్పుడీమాటలతో నేమికార్యం? ఇంకా మనకు కావలసినభోగట్టా చాలావుంది. తొందరపడకండి. ఫొటోగ్రాఫు, రసీదు మాత్రం జాగ్రత్తగావుంచండి. మిస్టర్ బ్రాకెట్, మీరు దక్షిణద్వారానికి వెళ్ళితి మంటిరే! అక్కడ మోటారు లేకుండే పోనీగాని, మోటారు జాడలేమైనా మీరు చూచినారా?

బ్రా—ఏదీ, ఏది చూదామన్నా, తొందరేగదూ—మీరువచ్చి యిదంతా చూచేవరకున్నూ మాకు తహాతహా తప్ప మరేమీ లేదు ఇప్పుడు చూదాము పదండి.

బ్రాకెట్, షెల్లాక్, అరీందమ్, లాలుచంద్, సర్కిలు ఇన్స్పెక్టరు, కొందరు పోలీసుజవానులును కలిసి చంద్ గారి భవ

నను దక్షిణద్వారమువైపు పోయి, యాప్రాంతమంతయు కల
యజూచుచుండ, అరిందమ్ బాబుగారు ద్వారసమీపమున నేల
బాగుగా పరీక్షించి చూడ, అచ్చటచ్చట కొనగాయిలు డాగు
లును, స్పష్టముగా మోటారుజాడలును, కానవచ్చెను. ఆమూన
వాట్నిజూచి, యిన్స్పెక్టరుగారు తృప్తినొంది, 'లాలుచంద్,
యీగురుతులు యెక్కడిదాకా ప్రస్ఫుటమో చూదాము రా
గలరా ?' అని యన, నాతడును వల్లెయని వీరందరును చేతి
లాంతర్ల వెలుగున నా మోటారుజాడల ననుసరించి, ఎన్నెన్నో
సందులు, గొందులు, రాచబాటలు దాటిదాటి తుద కెక్కడికి
తీసుకపోయినవి ? అయ్యో ! ఏమని వ్రాయను' ఏమి వ్రాయు
టకును చేతు లాడవే ! కలము నడువదే ! సరే—ఏమైతేనేమి?
తుదకు అరిందంబాబుగారి యింటికే !

లాలు—అయ్యా ! చూచారా, ఇన్స్పెక్టరుగారూ !

సర్కిలిన్స్పెక్టరుగారు మాత్రము చిరునగవుతో, 'ఏ
మండీ చంద్ గారూ, ఏమిలా ఆశ్చర్యపడుతున్నారు ?' అని
ప్రశ్నించెను.

'ఏమిటీ ! ఆశ్చర్యాని కేముంది ? అంతా జరిగింది
జరిగినట్టు, పట్టిచ్చినట్టు, ఎంతవద్దన్నా తనకు దానుగా అనా
హూయుంగా, వస్తూవున్న భోగట్టాయావత్తున్నూ చూచి,
విని, తెలుసుకునిన్నీ, నేరస్తులను నిర్ణయించి, నిరూపించి, పట్టు
కోకుండా మీరింతా యిలాగ ఆలోచిస్తూ వూరుకోవడం

అంతాచూస్తే, చెప్పకేం మీరు నాకు న్యాయం ఇస్తారా, యియ్యరా, అని అనుమానం కలుగుతూవున్నది. మీరు నిజమైన రక్షకభటశాఖవారని మనిపించుకొని, మావంటి కుటుంబస్థులను రక్షించి, పేరుప్రఖ్యాతులు పొంది, మావల్ల తగిన యినాములు పుచ్చుకోవాలిగాని, మీవాళ్ళకే, ఇదివరకెప్పుడో, యెక్కడో, యేలాగో, పేరుపొందినవాళ్ళకే, ఆలోచిస్తూ, కాలహరణం చేస్తే యేమీ న్యాయంకాదు. అది మీవంటి అధికార్లకు తగదు. ఇంతంత ఘోరాలు చెప్పిచెప్పి, చేస్తూ, అన్నిదాఖలాలూ కనపడుతూవుంటే యింకా మీరు వెనుకముందులు ఆలోచిస్తూ వుండడం చూస్తే, తుదకు మీరు పెద్దపేరు పొందేటట్లే కానవస్తూవుంది. ఆపైని మీయిష్టంగాని—'

'చందుగారూ, మీరేమిటి భ్రమపడుతున్నారు! ఇందులో చిక్కులు చాలా వున్నవి. అరిందమ్ ఫెల్లాకులు ఇందులో ద్రోహులని మీరు నిర్ధారణ పరుస్తున్నారు. ఇదంతా తప్పు అభిప్రాయం. దొంగ చేసిన తమాషా చూచి మీరు భ్రమపడుతున్నారు. కాస్త సూక్ష్మదృష్టితో మీరు ఆలోచించండి. కంటి కేది కనబడితే అదల్లా నిజమని నమ్మి దురభిప్రాయం పడడం సర్వసామాన్యంగా పామరజన లక్షణంకదా! ఇప్పుడు ఇందులో మనం చూడవలసినది దొంగయొక్క తెలివితేటలున్నూ — దిట్టంతనమున్నూ. అంతేకాని మీ యినప మందసము ఫొటోగ్రాఫునుబట్టి అరిందమ్‌బాబు దొంగకాడు;

రసీదునుపట్టి షైల్లాక్ సహాయకుడనుకున్నా కాదు. రామ! రామ! సాయంత్రం 7 గంటలు మొదలు యిప్పటిదాకా అరిందమ్‌బాబుని నేను విడిచి పెట్టనేలేదు. బాటసారులకు జరిగిన చోరీనేరమును గూర్చి మే మిద్దరమునూ ఆలోచిస్తూ వున్నాము. అరిందమ్ బాబుగారు మీ యింటిదగ్గర కాపలాకి వచ్చేసరికి యింకా పావుగంట ఆలస్యం ఔతుందని బ్రాకెట్‌తో చెప్పవలసిందని చీటియిచ్చి షైల్లాక్‌ని అంతా ఒక గంట క్రిందటనే నేను పిలుపూవులసిగా నేనరిందమ్‌బాబు పంపించినారు. ఇదంతా ఒక గంటక్రిందటే సంగతులన్నీ యిలా వుంటూ వుంటే మీ రేమో భ్రమపడి అరిందమ్ షైల్లాకుల మీద చాలా అపోహం పడుతున్నారు!'

'ఓహో, మీరైతే చదరంగపెత్తులు వేస్తున్నారుగాని, నేనుమాత్రం యిందులో వూరుకోవలసినవాడను కాను మీ రేమో పెద్దమనుష్యు లనిన్నీ, దైవభీతి కలవారనిన్నీ, పిల్లల వాళ్ళుగదా, అని అనుకుంటున్నానుగాని, మీహాబుమారీ లేకుండా యీపని జరిగివుండదని నేనిక నూహించవలసి వస్తుంది మీ రిందులో తగినంతదఖలు పుచ్చుకోకున్నా, నేరస్థులైన అరిందం షైల్లాక్‌లను కాపాడవలెనని ప్రయత్నంచేసినా, నేను నాస్వంత పూచీమీద సూపరెంటుగారికి టెలిగ్రాం యివ్వకమానను.'

'సరే, మీ యిష్టంవచ్చినట్టు మీరు చేసుకోవచ్చును కాని మా యింక్వైరీ మేము చెయ్యక తప్పదుకదా! అయితే

మీరుమాత్రం యీతిప్పల తమాషాల్లోపడి గాభరాఐపోయి, ఊరికేనే నిరపరాధులను అపరాధులుగా భావించి, నిందించు చున్నారు."

"ఔనౌను. పోలీసువారే—అందులో పెద్ద ఉద్యోగస్తులే యిలాంటిపనులు చెయ్యడం తప్పులుకావా? ఇదంతా మీకు తమాషాకాదా?—ఊ—మీతో అట్టే వాగ్వాదం యెందు కూ! మీకూ మాకూ కూడా న్యాయం యిచ్చేవారు సూపరింటుగారుగదా! ఇదిగో; నేను టెలిగ్రాం పంపిస్తాను ఇప్పుడప్పుడే తెల్లవారుతూవేవుంది. 4 గంటలు కావచ్చినది" అనుచు క్రోధోద్రేకముతో తొందరగా టెలిగ్రాఫు ఆఫీసుకు పోయెను.

778 తన మామూలువేళకు డ్యూటీనిమిత్తము లేచి ఠాణాకు పో బయలుదేర, తంతిఆఫీసుకు పోవుచున్న లాలుచందుతో నాతిని కోర్కెప్రకారము సహాయముగా పోయెను.

---

## నాల్గవ ప్రకరణము

---

గుడ్ మార్నింగ్, మిస్టర్ అరిందమ్—అండ్ సర్కిల్ ఇన్స్పెక్టర్—, వాట్సదిమేటర్? లాల్‌చంద్ వైర్—అర్జెంట్ వైర్ పంపినాడు—?

'లాల్‌చంద్‌గారి యింట్లో సుమారు పదకొండు గంటలవేళ దాకా చోరీజరిగినది. డిపార్టుమెంటల్‌గా మేము 6-30 గంటలకు తమకు టెలిగ్రాం యిచ్చివున్నాము. ఆయన తొందరపడి 4 గంటల ప్రాంతమునకు తమకు టెలిగ్రాం వేసివున్నారు'

'సరే, మీరేమైనా ఎంక్వైరీ చేశారా? ఏదైనా ఒక కంక్లూజనుకు వచ్చినారా?'

'ఇంకా ఎంక్వైరీ, కంక్లూజన్, యివన్నీ కావాలా? తమ కెవ్వరికీ యెట్టియిబ్బ దిన్నీ, యెట్టిశ్రమయునూ అక్కర లేకుండానే అరటిపండు విప్పిపెట్టినట్లు భోగట్టా యావత్తునూ, తనంతట తానే, తమ కళ్ళయెదుటకు వచ్చినది ఇంకా తమ కెవ్వరికిన్నీ యెట్టి సంశయమునూ అక్కర లేదు. కలవైతే మనవిచేస్తాను.'

'జరిగినచరిత్ర యావతునూ ఉన్నదివున్నట్లు నాకు బోధపడేటట్లు చెప్పండీ—లాల్‌చంద్‌గారూ?'

'ముందుగా ఈ వుత్తరం యావతున్నూ తమరు చిత్తగించాలి' అని సర్కిల్ యిన్స్పెక్టరు నిన్నసాయంత్రము తనపేర విలాసము వేయబడి వచ్చిన 'జిగొమార్' వుత్తరము యిచ్చెను అది చూచుకుని పోలీసు సూపరింటెండెంటుగారు, లాలుచంద్‌గారివైపు తిరిగి, '—ఆఁ—ఏమి జరిగింది?' అని యడిగెను.

'చిత్తం—నిన్న సాయంత్రం యేమో ఆవుత్తరం అందిందట! అందుపైని వీరు మాయింటివద్ద పోలీసుఘాటు

వుంచినారు. మేమున్నూ మామూలుగా 10 గంటల తరువాత ఆఫీసు మూసుకొని వచ్చుచున్నాము. మంచిరాత్రప్పుడు నిద్రలేవడం నాకు అలవాటు. ఆ అలవాటు ప్రకారం నేను లేచే సరికి పెరటితలుపులు తీసివున్నవి. ఇదేమిరా అనుకుని నేను నాలుగుతలుపులు చూచేసరికి అన్నితలుపులూ తీసే ఉన్నవి. ఏదో అపాయం జరిగేవుంటుందని భయపడి వీధి తలుపులు తెరచి పోలీసువారితో చెప్పవలెనని వచ్చేసరికి, పెరటిత్రోవ వైపు నుండి, ఇదుగో యీ యిద్దరున్నూ (షెలాకు గారనిన్నీ, బ్రాకెట్ గారినిన్నీ తన వ్రేలితో చూపుచు) అప్పుడే వచ్చుచుండుట చూచితిని. వారితో జరిగిన సంగతి చెప్పగా, నాతో యింట్లోకివచ్చి అన్నిభాగములున్నూ చూచినారు. తరువాత మరికొన్ని సోదాలు చూచికుని, స్టేషనుకు వచ్చి, రిపోర్టుచేసి, సర్కిలు యిన్స్పెక్టరుగారితో చెప్పి, వారి నిన్నీ అరీందమ్ బాబుగారినిన్నీ తోడ్కొని వెళ్ళినాము. చూచే సరికీ, నా ఐరన్ సేఫ్‌లో చిరకాలమునుండి అమర్చబడియున్న ఇన్స్టాంటేనియస్ కెమేరాలో యీ అరీందమ్ గారి ఫోటోవుంది; ఇంతేగాక ఆ ఐరన్ సేఫులో నుండిన రసీదు యిదుగో—ఇది చిత్తగించండి—' అని ఆజిగోమార్ దొరగారి రసీదు నిచ్చెను.

'ఔను—చూచినాను. చాలా వింతగానేవుంది!'

'చిత్తం—ఇదిగో ఫోటోగ్రాఫ్!'

'ఆఁ—అయ్యో! అరీందమ్‌బాబే! అబ్బా! ఎంత పని!!'

'చిత్తం మొదట కొంతరాత్రప్పుడు అరిందమ్‌బాబు గారు కారులోవచ్చి, మాయింటిగద్దకున్న ఘాటులో జాగ్రత్త యని చెప్పి, తాను పెరటివైపు వెళ్ళివుంటానని చెప్పినాడట! ఆయన మరి తిరిగి రాలేదట! మే మందరమున్నూ చోరీ జరిగినతర్వాత వెళ్ళి కారుజాడలు చూచాము ఆ జాడలు మా పెరటివైపునుండి నసుంగా అరిందమ్‌బాబు గారి గాడీఖానా లోనికే ఉన్నవి. అక్కడే కారువుంది. దాని జాడలున్నూ, దీని జాడలున్నూ ఒకేరీతిగావున్నవి. ఇంతకన్న యేమిమావంటి కుటుంబస్థులున్నూ, వ్యవహారస్థులున్నూ చెప్పుకోగలము! న్యాయమూర్తులున్నూ, దీనజనరక్షణ దీక్షాదక్షులున్నూ, అయిన తమరు యీ కేసులో తగినంత దఖలు పుచ్చుకోకపోతే యీపోలీసువారి ఘోరాలను ఆగలేము. మిక్కిలి ఆతురతతో తమపేర టెలిగ్రాం యిచ్చుకున్నాను. ఆపైని తమధర్మము; నాకర్మము.'

'వీరు చెప్పినదంతా సరిగా వున్నదా?'

'ఔను'—'

'సరే, వెనుకనుండి తగినచర్య చేసుకోవచ్చును; గాని ప్రస్తుతం అరిందమ్ షెల్లాకులను రిమాండులోనుంచవలసినది.' అని సర్కిలు ఇన్స్పెక్టరు గారితో దృఢముగా చెప్పి, తాను తన కారులో కూరుచుండి, 'లాల్, మనమిద్దరమున్నూ మీయింటికి వెళ్ళి నేరము జరిగినచోటు చూడవలెను గనుక నాతో వస్తారా?' అని యడిగెను.

లాలుగారు, 'ముఖ్యముగా చూడవలసినదే—' అని కారులోయెక్కిరి.

అంతట సర్కిలు యిన్స్పెక్టరుగారి నుద్దేశించి, 'డిపార్టుమెంటలుగా నాకు వైరిచ్చినారుకదూ?' అని సూపరింటెండెంటుగారు అడుగగా, 'చిత్తం—ఒక గంటక్రింద అనగా లాలుచంద్ గారి టెలిగ్రాం తరువాత ఒక గంటకు మీకు తంతి నంపినాను' అని సర్కిలు యిన్స్పెక్టరుగారు చెప్పిరి.

'సరే, నాకది అందలేదు కాని, ఈపాటికి ఆఫీసుకు అందేవుంటుంది.'

'చిత్తం, ఇప్పుడు వీరి రిమాండుయెరెస్టును గూర్చి, తమ రిటెన్ ఆర్డర్సు (వ్రాత మూలమగు ఆజ్ఞ) కావలెను.'

'ఐ నో యిట్. తరువాత యిస్తాను.' అని యనుచు త్వరగమనుడై తన కారును వేగముగా పోనిచ్చెను.

---

## అయిదవ ప్రకరణము

కారులో మాత్రము లాలు స్థిమితమనస్కుడై యుండ గలడా? పోలీసు సూపరింటెండెంటుగారు తనయింటికి వచ్చి జరిగిన నేరమును గూర్చి తగినచర్చచేసి, చర్యనడిపిస్తారనే ధైర్యమైతే కలదుగాని, ద్రోహులను గూర్చి తన అభిప్రాయము

లతో దొరగా రేకీభవింతురో, లేదో, యను తహతహ తన మనమున ముమ్మిరిగా నున్నందున దొరగారి నిట్లు కదిపి చూచెను——

'చిత్రం. అయితే ఈకేసులో ద్రోహులను గూర్చి తమ అభిప్రాయ మేమిటి?'

'ఏమిటో——ఏదీ నిర్ధారణ పర్చలేము. అంతా అనుమానంమీద పనిజరిపించి చూడాలి; అరీందమ్ మిక్కిలి సత్ప్రవర్తకుడు! మాలైన్‌లో యింత సమర్థుడు మరొకడు లేడని పించుకున్నాడు! పరస్త్రీ, పరధనాపేక్షలు లేనివాడు ఇతనుతప్ప మరిలే డనిపించుకున్నాడు. షెర్లాక్‌మాత్రం యేం తక్కువవాడా! కాని సొమ్మంటే ఎవడి కక్కర్లేదు! మనిషియొక్క గుణము యేనిముషానికి యేలాగువుంటుందో యెవరు చెప్పగలరు? ఇంతకీ మీ ఐరన్‌సేఫులో వుంచిన కెమెరావల్ల మా పని చాలా సులభమై పోయింది——' అని యింకేమో చెప్పబోవుచుండగనే లాలుచంద్‌యిల్లు సమీపించిరి. వారు కారునుండి దిగి చందుగారి యింటిలోనికి బోయి, లాలు తన భవనమంతయును దొరగారికి చూపుచుండ, అయనయును అన్నిభాగములును మిక్కిలి పరీక్షాదృష్టులతో జూచుచు, నేరముజరిగిన గదికూడా పరీక్షించి, దొరగారు, 'లాలు, ఈగదికి తాళం వేస్తున్నాను. నేరము స్థిరపడేవరకున్నా, ముద్దాయి దొరికేవరకున్నా, ఈ తలుపులు యెవరున్నా తెరవకూడదు. ఇప్పుడు 10 గంటల

15 నిముషములు అయినది. నేను పోతాను. అవసరము ననుసరించి మళ్లీవస్తాను. స్టేషనుకు వెళ్ళి సర్కిలు యిన్స్పెక్టరుతో మాట్లాడి, నేను వెళ్తాను' అని చెప్పుచు ఆ గదికి తాళము వేసి, చివచివ తన కారు నెక్కి చందుగారు తనను వీడ్కొలువ దొరగారు వెడలిరి.

---

## ఆరవ ప్రకరణము

---

అహో! జగద్విఖ్యాతయశోభరితుండగు అరిందమ్ యును, సాత్వికుండును సత్ప్రవర్తకుండును నగు షైలాక్ గారును, కారులో వచ్చిన సూపరింటెండెంటుగారివలన అరెస్టు కాబడిరి కదా! పాపము! సర్కిలు యిన్స్పెక్టరుగారు మాత్రము యేమి చేయగలరు? అరిందమ్ మిక్కిలి సమర్థుడు కావచ్చును. అప్రతీవప్రతాపవంతుడు కావచ్చును తనకు ప్రాణస్నేహితుడు కావచ్చును కాని సర్కిలు యిన్స్పెక్టరు యేమిచేయగలడు? దొరగారి ఆర్డరు నుల్లఘించగలడా? షైలాక్ మాత్రము సామాన్యుడా? తనకు చిరకాల పరిచితుడు. ఎన్నెన్నో దుర్గమములగు స్థలములలో తిరిగి, దుర్భేద్యములగు కేసులలో పనిచేసి, జయ మొందిన ఘనుడు. ఐననేమి? దొరగారియాజ్ఞల నుల్లంఘునీయ ములుగదా! తన మనస్సున కిష్టములే కున్నను, సూపరింటెం

డెంటుగారు తగినంత ఆలోచన చేయకనే, అరిందమ్ షెల్లాకుల కురిమాండు ఆర్డరుచేసిరేయని తా దనమానసమున నూహించుచున్నను, తాబేదా రగు తా నావిషయమున నే మనగలడు?

అయ్యయ్యో; సేవకావృత్తి; తానెంత న్యాయైకవర్తనుడైనను, దైవభీతిగలవాడైనను, తనమనస్సున కిష్టములేకున్నను, న్యాయ్యేతరమైనను, ప్రజలకపాయ కరమైన దైనను, తన కపాయకరమైనదైనను, ప్రజావిప్లవ కారణమగున దైనను, దా సేవకుండగుటచే, తనయజమాని చిత్తము ననుసరించి, యాతని యాజ్ఞ లెట్టివైనను, నాచరింప వలసినదే గదా; ఇదియే గదా సేవకునికిని, స్వచ్ఛంద వృత్తి నిర్వహించు వ్యవహారస్థునకును గల భేదము. కాకుండినచో, లాల్‌చంద్ మాటలు ఫొటో గ్రాఫు, రశీదు చూచిన మాత్రమున తగిన చర్యజేయకనే అరిందమ్ షెల్లాకులకు రిమాండు ఆర్డరు చేసెనే సూపరింటెండెంటు అని గాబోలు, పాపము సర్కిల్ యిన్స్పెక్టరుగారు వెనుక ముందుల జూచుచు నేమియు చేయజాలక, సూపరింటెండెంటు గారి ఆజ్ఞలకు మారాడలేక, వారిని రిమాండుననుంచి తాను ముందుకు చేయగల కార్యముం గూర్చి ఆలోచించుచు స్టేషను లోనే సర్కిలు యిన్స్పెక్టరుగారు కూరుచుండిరి.

'దొరగారు లాలుతో వెళ్లి అరగంటయైన అయియుండదా? ఇదొక తమాషా!' అని సర్కిలు యిన్స్పెక్టరు నుద్దేశించి, అరిందమ్ షెల్లాకుతోననెను.

'అయితే, ఈ సూపరింటెండెంటుగారున్నూ ద్రోహ జనవిగటిత నాటకములో నొక పాత్రయే యనెదరా యేమి?' అని ఇన్‌స్పెక్టరుగారు అరిందమును ప్రశ్నించెను.

'కావచ్చును. ఇప్పటికి జరిగిన దాని ననుసరించి చూడగా అంతా అలాగేవుంది. కాని మరికొంతసేపు చూడవలసినదే మీ టెలిగ్రాంకూడా వెళ్ళిందికదా?'

అని అరిందమ్ పలుకుచుండగనే, తంతివార్తావహు డొక తంతివార్తను గొనితెచ్చి, సర్కిలు యిన్‌స్పెక్టరుకు యిచ్చెను. అది విప్పి చూచుకొనిన పిమ్మట ఆయనకు ఆశ్చర్యమును, అనుమానమును, సిగ్గును, భయమును ఒక్కసారే దొంతర దొంతరలుగా కలిగెను తత్క్షణమే కుర్చీనుండిలేచి, ఇన్స్పెక్టరుగారు అరిందమునకు ఆ తంతివార్త నందిచ్చెను. ఆయనయును పెండ్లాకుయును, ఆ సమాచారము చూచుకొని, ఆశ్చర్యమును, ఆనందమును దృప్తియు బొందిరి.

'ఇప్పుడు తెలిసినదా!'

'ఔనండీ—ఇదేచిత్రము, ఇప్పుడిప్పుడేకదా మీరు ధ్వన్యర్థముగా మాట్లాడినారు. అదే నిజమయినది'

'సరేకానండి, ఇక చెయ్యవలసిన పనేమిటి?'

'మరి పనికేముంది. మనం తొందరగా లాలుచంద్ గారింటికి ఈతంతి పట్టుకొని మరీ వెళ్ళవలెను. మరిన్ని రెండుజతలు బేడీలు కూడా తీసుకొనిపోదాము.'

'మీ కేం వెర్రా—పిచ్చా—మీ బేడీలు ఒకప్పనిచేటు గాని మరేమీ కాదు. ఇంకా చందుయిట్లో ఉంటావనే అను కోవడము ఒక పెద్దతప్పు—అక్కడేమేమి తమాషాలు చేసి పోయాడో ? మీరింకా యీజిల్లాకి కొత్త. నేను ఈచిక్కులు చాలా పడేఉన్నాను. జమీలిగా ఫ్రాల్ సాహెబులకాలము తిరిగి జ్ఞాపకము దెచ్చి, వాళ్ళనే మంచియనిపించి, వాళ్ళ గురువులాగ వున్నాడుగాని సామాన్యుడుగాలేడు. మీరేమో వీడు అలపాలదొరికే బాపతుగా ఆలోచిస్తున్నారుగాబోలు ! అదంతా వట్టి భ్రమ. ఐతే నేం—పదండి. ఆ తమాషా మేమిటో చూడదగినదే—చూదురుగాని—' అని యనుచు ఇన్స్పెక్టరుగారును, అరీందమ్ బాబును, జిల్లాకుదొరగారును మోటారు నెక్కి లాలుయింటికి బోవుచుండిరి. కారులో మాత్రము వీరు ప్రసంగ మాపివేయుదురా ?

---

## ఏ డ వ ప్ర క ర ణ ము

---

"అయితే ప్రొద్దున్నే దొరగారువచ్చి మాయిద్దరికీన్ని రిమాండు ఆర్డరుయిచ్చి, లాలుచంద్‌తో అతని యింటికి వెళ్ళి, యిప్పుడు యీలాగు టెలిగ్రాం యిస్తున్నా రేమిటి? దొరగారి స్వంతసంతకం వేరేగాని వేరేకాదే. అక్కడేమో అర్జంటువను లున్నాయన్నీ. రేపు సాయంకాలంగాని యీలోగా రా జాల

జగన్నీ ప్రోగ్రాం చూస్తున్నారు గదా! ఇది కూడా ద్రోహుల మాయయేమో?" అని షెల్లాక్ దొరగారు అరిందమును ప్రశ్నించుచుండ కార్ చందుగారి యిల్లు సమీపింప నచ్చట నందరును అత్తరిములో దిగి చందును కబురంపిరి.

అప్పుడే 10-30 గంటలకు చాలాపైగా అయినందున స్నానమునకు బోవుచు నాలందును సర్కిల్ ఇన్స్పెక్టరుగారి కబురందిన వారిదర్శింప హాలులోనికి వచ్చి, ఇన్స్పెక్టరుతో పాటు అరిందమ్ షెల్లాకులను గూడ చూచి కోపోద్రేకమున మండిపడి ఇన్స్పెక్టరు నేమియు ననలేక,

'ఏమండీ మళ్ళీ వచ్చినా రేమి బాబూ త్రిమూర్తులు న్నా—ఇక్కడికి సృష్టి అంతా పూర్తి అయినట్టుంది—" అని వ్యంగ్యముగా బలికెను.

'ఏమీ లేదు-దొరగారు వచ్చినారుగదా; మళ్ళీ స్టేషనుకు రాలేదే; ఎక్కడున్నారో. ఇక్కడికి వచ్చి ఏమి చేసినారో; మరేమైనా భోగట్టాలు దొరికిన వేమో తెలుసుకొందమని మూవాతో వచ్చినాము" అని సర్కిల్ యిన్స్పెక్టరు జవాబు చెప్పెను.

'ఏం—స్టేషనుకు రాలేదూ? స్టేషనుకు వెళ్ళి మరీ వారి హెడ్ క్వార్టర్సుకు పోదుమని నాతో చెప్పి ఈ గదికి తాళంవేసి 'నేరం స్థిరపడి దొంగ దొరికేవరకూ యీ తాళం మరెవరూ తియ్యకూడదు' దని కూడా చెప్పివెళ్ళినారు.'

'అన్నా! ఎంత పనైంది!' అని అరిందం అనెను.

'ఏదీ ఆ తాళం చూదాము—' అనుచు సర్కిలిన్స్పెక్టరుగారు ఆ గదివైపు పోబోవుచుండ చంద్రుడడ్డువచ్చి 'ఎందుకండీ మరక్కడికి—వారొచ్చినదాకా ఆతాళం ఊసే మనకు వద్దు. ఆపని యిక వారిదే; ఇందులో మరి మీరేమీ శ్రమ పడనక్కర్లేదు. ఇంతేదో ఐంది ఇక మీరు చెయ్యవలసిన పనేమియున్నది? ఇంతకీ దొరగారు వచ్చేయాలోగా ఆతాళంతో మీకేం పని' అని యడిగెను.

అరిందం సర్కిలిన్స్పెక్టరు పక్కన నిల్చిరి. షెల్లాక్ నిర్ఘాంతపోవుచుండెను. వీరిని చూచుచున్న కోలదిని చందుగారి మానస సముద్రము బడబాగ్నిచే వలె మండిపోవు చుండెను. కాని ఏమనగలడు!

స. ఇ:—ఔనండీ! గదికప్పుతాళంచూచిన తప్పేమి? మీ దొరగారు చెప్పినట్లు మేము తాళము తియ్యము. ఊరికే ఎట్టి తాళము వేసినారో చూదామని అడుగుచున్నాము గాని మరేమీ కాము.

అరిందము యొక్క చిర్నగవ్వుగల మోము చూచి లాలుచందు రుద్రుడగుచుండుట సహజముకాదా!

'ఔనుగాని వీరిని ఎరెస్టులో నుండనివ్వకుండా మీరెందుకిక్కడికి తీసుకవచ్చారు? ఇది మీకుధర్మమేనా?'

'లేదండీ. వీరింకా అరెస్టులో లేరు. రిమాండులో నున్నారు. నేనున్నూ వీరితో వచ్చినాను. అయితే మీదొరగా

రిక్కడనే వుంటాడు! వారిని కలిసి మాట్లాడవలెనని నేనున్నా ఏమో చెప్పుకోవలసియున్న దన్నందున వీరున్నారు, కలిసివచ్చి నారు ఇందులో తప్పేమిటి?'

'మీ దొరగారు — మా దొరగారు, అని రెండు మార్లు వక్కాణించినారే! ఏమీ; మా దొరగారే గాని మీ దొరగారు కారాయేమి?'

'ఆహాహా — అది కాదది కాదు — ఇందాకా వచ్చి మీ అనుమానం ప్రకారం అరిందం షెల్లాకులను మా[illegible]ఆర్డరు చేసి మీతో మీయింటికివచ్చి, మీతో మాట్లాడి, మీ ఖజానాగదికి తాళం, వేసి, పోలీసు స్టేషనుకు వెళ్ళెదమని మీతో చెప్పిన్నీ స్టేషనుకు రాకుండానే, ఆలాగే, పరస్పరంగా వెళ్ళిపోయినవారు మీ దొరగారు, ఇదుగో ఇప్పుడిప్పుడే మాకీ టెలిగ్రాం యిచ్చినవారు మా దొరగారు,' అనుచు సబ్ఇన్స్పెక్టరు తనచేతిలోనున్న ఆ టెలిగ్రామును లాలుచందుగారి చేతికిచ్చెను.' ఆయనయును ఆవార్తను చూచుకొని వారివలన నర్థము గ్రహించినంతనే తన మొఖముల్లన మోమువెల్ల నయ్యెను.

'ఏమండీ! ఇప్పుడు తెలిసిందా, మీ దొరగారంటే యెవరో, మా దొరగారంటే యెవరో? ఇదీ భేదం.'

లాలుచందుగారు స్తంభీభూతులై రాతిప్రతిమయై నిలచిరి.

'ఏ మూలాగున నాలోచిస్తున్నారు?' అని అరిందంబాబు ప్రశ్నించెను.

కుంటాం. అను గడుక్కీ మోసమే ఐతే ఏలాగ బ్రతకడం? స్వామి నిశ్చేష్టులైనట్టు కనపడుతూ వున్న వన్నీ అసంభవాలని మీరు అభిప్రాయపడి మాటాడుతున్నారు. అందుకు తోడు ఇప్పుడీ టెలిగ్రాం కూడా వచ్చినది. పోనీ దేహ వెదుకుతున్నా దొంగ దొరకక్కుంటే మానిపోయెను గాని, మా సొమ్ము మాకు దొరికితే అంతేచాలు.'

అయ్యో, లాల్‌చంద్, ఎంత చేటప్పు; నీ కంటికి కానవచ్చిన దంతయూ, నిజమని ఎంత భ్రమపడుచున్నావు! నీవు అనుకున్నట్టు, అరిందమ్ షెల్లాకులతో పాటు సర్కిలు ఇన్‌స్పెక్టరుకూడా, యీ నేరములో నున్నాడని ఊహించినచో, పాపమాతడు, గది కేల దొరగారు తాళము వేసిరో, యెట్టి తాళము వేసిరో చూడబోవుచుండ తోలుబొమ్మ వాపివేసి, యిప్పుడాతడు దొరగారి టెలిగ్రాము జూపి, నా దొరగారి వ్యక్తిని గూర్చియే నీ కనుమానము గలుగుట చేతకదా, సర్కిల్ ఇన్‌స్పెక్టరుగారు కోరినటుల నాగది నుండు, ఆతను వైచిన తాళమును జూడనీయ ననుమతించి, కాను గాని, ఆ గదికి తాళం బెందుకు వేసియుంటారు?' అని కూడ నడుగుచున్నావు? నీ అనుమానము ప్రకారము అరిందమ్ షెల్లాకుల నరెస్టు చేయవలెనా? ఇపుడు నీకు గానవచ్చుచున్న విషయముల ననుసరించి, దొరల వారిని గూర్చి, నానుమానము వొదిగించుకొనుచుండ నీతో పాటు మేమును గూడ ననుమాన

ములఁ బోఁగొట్టుకొని పూర్వోత్తర సందర్భముల నాలోచించ వలెనా? నీ తొందరపాటుతో పాటు మనుష్యులను గూడ నపార్థము జేసికొనుటల నిర్బంధించినావు. జరుగుచున్న వస్తువును విస్మరించితివి నీకు గోచరమగుచుండ, ధనము గోల్పోయిన నీకుఁ గల చిత్తభ్రాంతిపాటు, బుద్ధి మాంద్యములచే, మనుష్యుల మాద్రోహ మూహింప నీయక, 'కానని వాని నూతగొని కాననివాఁడు విశిష్టవస్తువుల్ గాననిభంగి......' అనునట్టుల నీ యొంటి దృక్పథమున మమ్మిట్లు ద్రిప్పుకొని పోయి, పోయి యిపుడు తెలియుచున్న నూతన విషయములం బట్టి, నీ మనసు ద్రిప్పుకొని, నీయభిప్రాయముల మార్చుకొనుచు, మమ్ముఁగూడ మార్చుకొన మనుచున్నావా? ఏమో పాపము, ధనమును గోల్పోయిన వాఁడవు; మా కథకు మూల కారణుఁడ వలె నున్నావు; దేవోపహతుండవుగ వాయువు నీ మనోవ్యథ జూడ జాలక, ఏమో సమంజసములు గాబోలు నీ యూహలు, నీ తర్కములు, నీ యభిప్రాయములు, అని యనుకొని నిన్ననుసరించి చరించుచున్న మాతప్పు నిపుడు దిద్దుకొనుచున్నాము. ఇక నిన్ననుసరింప జాలము.

'సరేలెండి. అవన్నీ వెనకనుండీ చూడవచ్చును. ముందుగా యిప్పుడు జరుగుచున్న వస్తువు మనము చక్కగా బోధపర్చుకుంటూ వుండవలెను—ఏదీ, పదండీ; చూడాము.'

చందు ముందు నడువ, తక్కినవా రందరును వెనుక నడచుచు ఆగదిని సమీపింప బోవుచుండిరి.

అరిందమ్ చందుయొక్క ఆందోళనము వలన నాయనకు గలిగిన పరి పరి విధములగు ననుమానములచే నాతని మాటలకు జాలినందియో, ఇన్స్పెక్టరుగారి యసహాయిత్వమునకు 'అయ్యో! పాపము' మని దోచియో, ఆతరు వలిగాని చేతలకు విస్మయ మందియో, జరిగిన తారుమారు తమాషాలకు తన మానసమున గలిగిన వేకి తత్తరపాటుననో గాక యింకే కారణముననో గాని, అరిందం నోట మాటాడకయే, నాగది సీతంపును సమీపించెను. అందరును ఆగదితాళము చూచిరి. ఎవ రెవ రేమేమి తమ తమ మనముల దలంచిరో, మనకు దెలియదు గాని అరిందం మాత్రము ఇన్స్పెక్టరు గారితో 'అయ్యా! ఈ కప్పను తాళముతో దెరచినవానికి 1116 లు బహుమాన మిచ్చుటకు చందుగారు ఒప్పుకుందురేమో వారినడిగి తెలుసుకొనుడు' అని చిరునగవుతో బలికెను.

ఆహా! అరిందమ్, నీవ్రువేయు ప్రతిమెత్తును, కాళిదాసు కవిత్వమునకు 'అక్షరలక్ష' యుంబోలెయును, భర్త్రుహరి కవిత్వమున 'ప్రతిశ్లోక శిరఃకంప' సమన్విత మనునటుల నీప్రతిమెత్తును మాకు రోమాంకురములు నగుర్పొడుచ జేయుచున్నవి. నిన్ననుసరించుటే మాకిల్లాన దాయకముగు చున్నవి.

'ఓహో! ఇదొకటికూడానా? పోయిన సొమ్మున కిది వడ్డీగాబోలు! ఎందుకండీ అక్కర్లేని ఆలోచనలు——ఈ తాళం వేసినవారిని పోలీసుసూపరింటెండెంటుగారనే నేను అనుకుంటున్నాను.

కాని ఈ టెలిగ్రాం వల్ల నాకున్నూ అనుమానంగానే వుంది. ఇంజాకా వచ్చి ఈ గదికి తాళం వేసినవాడు నూపరెంటు కాడని మీకున్నూ ముప్పాతికముఖ్వీసాలా తోచినట్లయితే ఈ తాళం విరగగొట్టించెయ్యండి... ఎందుకండీ... అక్కర్లేనిఖర్చు! ఇప్పటికి పోయినసొమ్ము చాలకనా? ఇంతపాపం యెక్కడైనా వుందండీ! ఇంతఘోరం యెక్కడైనా, యెప్పుడైనా విన్నారండీ! కనపడ్డ ఋజువులన్నీ సంశయాలై పోయెనా? వచ్చిన నూపరెంటు దగాకోరై పోయెనా? పోయినసొమ్ము పోగా, పైగా 116 లు జుల్మానా?—పోసున్నూ. నాసొమ్మైతే దొరకనే దొరుకుతుంది. నాది కాకపోతే మరి దొరకనే దొరకదు. ఈ మాత్రానికి మరెందుకండీ? ఈ తాళంవల్ల ప్రయోజనం లేదని మీకున్నూ తోస్తే తాళం బద్దలకొట్టించెయ్యండి —మరెందుకండీ వెయ్యాలోచనలు?—'

'అయ్యో! ప్రయోజనం లేకపోవడ మేమిటి? దొరికితే ఈ కప్పతాళం మీమీదనే దొంగ దొరకాలి...' అని అరీందం అనుచు ఇన్స్పెక్టరు గారి నుద్దేశించి,

'అయ్యా, పోలీసు రివార్డు రు 1000 లు అని అడ్వర్టయిజ్ చేయించండి. ఇలాగే మనం ఆలోచిస్తూవుంటే యెప్పటికైనా తేల్తుందా?' అని సలహాగా పలికెను.

'అయితే పోనీగాని, ఈ ప్రచురణము వల్లమనకేం ప్రయోజనం? ఎవడో ఒకడు వొస్తాడు; కప్పతాళం తీస్తాడు.

అయితే వాడికి రూ. 1000 లో 1116 లో యిచ్చుకోవడమే మనకిదక్కుట అంతేగాని ఇందువల్ల యీ కేసులో మనకు వుండే ప్రయోజనం చెప్పగలరా?'

అయ్యో! లాల్, ఎంతబేలవు!

నీకు డబ్బున్నదన్న మాటేగాని, యింగిత మెక్కడ నుండి వచ్చును? బజారున కొనదగినది కాదుగాని, కానిచో నెన్ని మణుగులైనను నిర్లక్ష్యముగ కొనియే యుందువుగదా!

'అరవిందంగారి అభిప్రాయ మేమిటో మీకు తెలిసింది కాదుగదా! లావుగా సొమ్ము యిస్తామంటే అసలు ఈ తాళం వేసినవాడెవడో, వాడేవస్తాడు; తీస్తాడు; అప్పుడు మనం వానిని పట్టుకోవచ్చును గదా అని ఆయన అంటున్నారు.'

'ఔనండీ ఇది మైకులాకు. ఎన్నిగంటల ఎన్నినిమిషాలకు ఇవాళ తాళంవేశాడో, రేపు లేక యెల్లుండి లేక మరియే నాడైనా మళ్ళీ అన్నిగంటల అన్నినిమిషాలకే, ఆ తాళం తోనే, రావాలి; మరోవేళప్పుడురాదు మరోతాళంతో బొత్తిగారాదు. వెయ్యడానికీ, తియ్యడానికీ. 24 గం॥ల చొ॥ వ్యవధియుండవలెను. కనుక ఎవడు, ఏతాళంతో, ఎన్నిగంటల ఎన్నినిముషాలకు, వేశాడో, మళ్ళీ ఆతాళంతోనే, అంతవేళకే, సరిగా తియ్యవలెను. అలాగ్గాతీసేవాడు ఇప్పుడీతాళం వేశిన వాడుగాని, వానితాలూకు మనిషిగాని, తప్పకుండా అయి వుంటాడు. అందువల్ల మనకు ప్రయోజనం యేమిటంటే, ఈ

తాళం వేసినవాడుగాని, వాని పార్టీవాళ్ళుగాని, మనకు తెలియుడానికి వీలుంటుంది. ప్రజంటా—మనం యివ్వాలా; వాడు పుచ్చుకోవాలా? కాని ఒక్కపనిమాత్రం యిందులో వుంది. ఎవడు తాళంచెవితో ఈ కప్పు ఓపెన్ చేస్తాడో, వానినే, ఈ గదిలో పెట్టి, గొళ్ళెం వేసి, మామూలురకం కప్పతాళం వేసి, స్టేషనుకి కబురుమాత్రం చెప్పాలి. తర్వాత తమాషా చూడాలి; అదీ చమత్కారం. అంతేగాని నిజంగా డబ్బు ఖర్చైపోతుందేమో అని భయపడనక్కరలేదు.' అని అరిందం సానుభూతిగా బలుకుచు, 'అసలు ద్రోహుల జాడేమైనా కనుగొనవలెనంటే యింతకన్న మంచిమార్గము మఱియొకటి నాకు యీ కప్పతాళం సందర్భంలో యిప్పటికి కానరాలేదు' అని పలికెను.

'అయ్యా! ఇన్స్పెక్టరుగారూ, ఏదో మీరూ మీరూ ఆలోచించుకుని, దొంగ దొరక్కపోయినా, సొమ్ము దొరికితే అంతేచాలు కార్యం చెడగొట్టకుండా, తరుణం మిగిలిపోకుండా, సంగతు లన్నీ బాగా ఆలోచించి, తొందరపడకుండా సానుకూల పర్చండి. నిజమయిన రక్షణభట శాఖవారని మనిపించుకోండి. అదీగొప్ప.' అని లాలు పలుకుచు, 'మీకు బాగుందని తోచిన మార్గమే అవలంబించండి—ఇంతకన్న నేనేమీ చెప్పలేను. ఆపైని మీచిత్తం' అని యనెను.

'పోలీసువారందరును పోలీసు స్టేషనుకు పోయిరి. లాలుచందు తన కార్యముల నిర్వర్తించుకొనబోయెను.

అయ్యో, లాల్ ! నీవెంత వెఱ్ఱివాడవు ! 'దొంగ దొరక్క-పోయినా, సొమ్ము దొరికితే అంతేచాలును' నని యనుచున్నావెంత యనుభవము లేనివాడవు ! పోలీసు నీ వెఱుగవుగాబోలు; పాపము కడుపులో చల్ల కదలకుండా ఒకచోట గూరుచుండి జమాఖర్చులు వ్రాసుకొనుచు, చిఠా అవర్జాలు తయారు చూచుకొనుచు, కావలసినవారికి బదుళ్ళిచ్చుచు, కుటుంబాలకు కుటుంబాలు నాశనం అయిపోయే వడ్డీలు వేస్తూ, వడ్డీలకు వడ్డీలు కలిపి మఱియు మఱియు నవలును పెంచుచు, లోకుల యాస్తుల గలుపుకొనుచు, స్థూలసూక్ష్మముల నెఱుంగనొల్లక గాలముపుచ్చు నీకు దొంగతనము జరిగినపిదప, మరల చోరీమాల్ దొరకునను నాన భ్రమయని తెలిసికొనజాలక, మిక్కిలి పరిభ్రమించు నిన్నేమనియెదను ? పోలీసువారికి ఆస్తి దొరకుటతో కార్యములేదు. పోయినవానిలో నొక చీపురుపుడకయైనను దొరికినచో ద్రోహిని పట్టెద మంతేగాని పోయినఆస్తి యంతయునుగాని, కొంతగాని, హక్కుదారునికి దృప్తికలుగులాగున కనిపెట్టి పట్టియిచ్చెదమను నూహగాని, పంతముగాని, అదియే పరమావధిగానుంటగాని, పోలీసువారిపని కాదుసుమా. పాపమది యెఱుంగవు కాబోలు !



# కాలారాయి

## ద్వితీయ ఖండము

## స్వయం కృతాపరాధము

### మొదటి ప్రకరణము

### రూ 1116 లు బహుమానము.

అరీం—ఔనండీ ద్రోహాను లన్నియు వరుసగా జరుగుచుండగనే రుజువును సాక్ష్యమును దొరకకుండ నేలాగున సాగుచున్నవో గమనించుచున్నారా ?

స॥ఇ—ఇన్ని నేరములకును గ్రంథకర్త యొకడా, ఇద్దరా అను సంశయము తీరనేలేదు

అరీం—ఒకడైతే నేమి ? ఇద్దరైతే నేమి ? ముందు జరుగ వలసిన పనికి ప్లాను వెయ్యండి. అది మనకు కర్తవ్యము.

స॥ఇ—ఔను. ఈ రోజు ఉదయం రూపవత్తున్నా లాల్‌చంద్‌గారి కేసులో మనకు సరిపడి పోయినది గదా ! ఏదైనా ఇకను చెయ్యవలెను. మీరేమి ఆలోచించినారు ?

అరీం—వీటి యన్నింటికిని ఘండ మెంటల్సు ముందుగా నిర్ధారణ కావలెను. పదాని కైనను మంచిదని యాలోచించి, నేనున్నూ, షెల్లాక్, బ్రాకేట్‌లును ఇందులో సంపూర్ణమైన పని చేయుటకు నిశ్చయించినాము. ఇప్పుడు సుమారు మూడు గంట లయినదిగదా. ఈ రాత్రి మేము చెయ్యవలసినపని

ఆ తర్వాత వాళ్ళ మాట మరేమిన్నీ తెలియక వాళ్ళవాళ్ళు ఎంతో తల్లాడిపోతూవున్నారు.

అరిం—వాళ్ళెవళ్లో, యే వూరువాళ్లో, తెలుసునా మీకు ?

ప్రయా—మాకు తెలియదు నండి—

అరిం—సరే — మాకు ప్రస్తుతం కావలసినభోగట్టా తీసుకున్నాము. మేము కొంత ఎంక్వైరీ చేసిన పిమ్మట మిమ్మల్ని పిలిపిస్తాము. అప్పుడు మీరు మళ్ళీ రావలసివుంటుంది.

ప్రయా—ఔనండీ ఇహ సదేవని, మీరు పిలిపించినప్పుడల్లా రావడం—పోవడం—ఇదో కొన్నాళ్ళు జరగాలి. అసలు చోరీ చోరీలాగే వుంటుంది. మాసొమ్ము పోవడానికి తోడు ఈ శ్రమ దానికి వడ్డీ—ఇది పోలీసులకు మామూలే. మాకేం కొత్తకాదు. అలాగే వొస్తాము. యిప్పుడు శెలవు పుచ్చుకుంటాము.

ప్రయాణీకులు వెడలిరి.

అంతట నొకడువచ్చి 'కేసరి' యను పత్రిక నొకదానిని గొనివచ్చి అరిందమ్ బాబుగారి కొసంగెను. ఆయనయును పత్రికను తొందర తొందరగా దిరుగవేయుచు చూచుచు, నందొకచోట గల ప్రకటనను తాను చూచి సర్కిల్ ఇన్స్పెక్టరు గారికి చూడ నిచ్చెను. ఆయనయును ఆప్రకటనసిట్లు చదివెను.

Look Here! తాళము తీయువానికి Look Here!

రూ 116 బహుమానము

ఈ పురమున లాల్‌చంద్ గారి యింటి గదితాళము కాన వచ్చుటలేదు. అది యెవరు సరియైన తాళముతో తెరచెదరో వారికి రూ 116 ల బహుమాన మొసంగబడును.

రత్నకంభల శాఖవారు, కలకత్తా.

లాల్‌చంద్.

'సరిగానే యున్నదండీ, ఇక దీని ఫలితము మనము చూడవలెను.'

'మనము చూచుట కేమియున్నది ఆ గది తాళము నెవరు తెరచిన, వారిని ఆగదిలోనే యుంచి ఆగదితలుపు తాళం వేసి స్టేషనుకు కబురు చెప్పవలసినదని లాల్‌చంద్ గారితో చెప్పనే చెప్పినాము. మరి యిక మన మిప్పటికి చెయ్యవలసినది గాని, చెప్పవలసినదిగాని, మరేమియు గానరాదు కాని అదిగో ఆ ప్రయాణీకుల వారి దోపిడి కేసులో (High Way Robbery) కాస్త జల్దుకో వలసి యున్నది. ఇందు కొరకు ఇది మొదలుకొని, నేను, షెల్లాక్ బ్రాకెట్లు మాత్రము పనిచేదుము. మీకు అప్పుడప్పుడు భోగట్టా యిచ్చుచుందుము. ఫలోన్ముఖమునకు వచ్చిన తర్వాత మీకు తెలియజేతుము, రెండు మూడు రోజుల వరకును మే మెవ్వరమును స్టేషనుకు రాలేము. మాకొరకు మీరు కబురంపకండి మేము దొరకము ప్రస్తుతము సెలవు తీసుకుంటాము.'

అని అరిందమ్ చెప్పి షెల్లాక్ బ్రాకెట్లతో వెడలి పోయెను.

## రెండవ ప్రకరణము

---

### మార్గమున బాటసారులు

'ఇప్పుడు చాలా రాత్రిగానే వుంది; ఏమి తోడు లేకుండా మన రెండు బళ్ళే బయల్దేరాయి గదా' అనే జంకుతో కూడా బయల్దేరాము. దేవుడు మనలను కటాక్షించి అదుగో అదో బండికూడా పంపించాడు.'

'ఔనౌను—అయ్యా, ఏవూరండీ—బండీ?'

'మేమా—బేనిమాదేపూర్ వెళ్తున్నాం. మీరా రెక్కడికి?'

'మేమున్నూ బేనిమాద్‌పూరే వెళ్తున్నాం'

'సరే-మాకు మీరు, మీకు మేము సాయంగా వెళ్ళిపోదాము. మావి రెండుబళ్ళు, మీదొక బండీ, మరి భయమేమిటి? మనం కాస్త మేలుకుంటే సరి. ఇదేనండి కొంచెం గడ్డయినతోట. సాధారణంగా ఈ ప్రాంతంలో మనం మేలుకుంటే మనకి మరేం భయం వుండదు.'

'భయ మేమిటండీ? భయం—భయం అని అనడమే గాని—ఏభయం లేదండీ—శివుని ఆజ్ఞ లేన్దే చీమునాకుట్టదు. మన పురాకృత కర్మ ననుసరించే అన్నీ జరుగుతూ వుంటాయి. మన మేమిటో జాగ్రత పెట్టు కుంటామని అనుకోవడమే గాని,

మనమేం జాగ్రత్త పెట్టుకోగలం ? ఆ పశువులను రక్షించాలి గాని, మనం యెందుకో లెఖ ? కాపాడుకోవడం గాని, కాపాడడం గాని, మన చేతుల్లోనే వుంటే, లోకంలో యిన్ని ద్రోహాలు, యిన్ని నేరాలు, యిన్ని ఘోరాలు యెందుకు జరగాలి? ఏమిటో మనం అనుకుంటాం గాని, అంతా వొట్టిమాట—వొట్టి మాట.'

ప్రయాణము సాగుచునేయున్నది

'ఔనండి—నిజమైన మాటాడినారు—మీరిద్దరేనా యీ బండిలో-మీరిద్దరూ అన్నదమ్ములా ?'

'ఔనండీ—మే మిద్దరమునూ అన్నదమ్ములము—ఆ బండిలో తోటికోడళ్ళిద్దరునూ నొఖరుమనిషీన్నీ.'

బండ్లు త్వరత్వరగా పోవుచునేయున్నవి.

'మేము ముగ్గురమే — నాభార్య, మరదలు, నేను మాత్రమే. బేగమూంద్‌పూర్‌లో మా ఆడవాళ్ళ పుట్టినిల్లు. అక్కడ నాలుగు రోజులుండి మళ్ళీ వెళ్దాం అని బయల్దేరాం'

'అయ్యో, అన్నట్టు నిన్నటి కేసు విన్నారా ?'

బండి తోలువాండ్రును మిక్కిలి చురుకుగనే యున్నాడు. గాఢాంధకారబంధురమైన నా నడిరేయికి కాలకాలుడు ప్రభుడై పరిపాలించు చున్నాడు.

'ఔనండీ. ఏదో మా గ్రామంలో కూడా అనుకుంటూనే వున్నారు. కాని పూర్తిగా వినలేదు. అయితే ఏదాని

కైనా ప్రయాణంలో మహాత్రం యాత్రికుల్ని ఒంటిబండి నడవ కూడదు. బళ్ళల్లో నిద్రపోకూడదు'

అని వీరనుకొనుచుండగనే 'గో' ల్లను శబ్దముతో రేచుకుక్కలవలె వారికి మున్నూదిమంది మనుష్యులు దండధరులై బయల్వెత్తుకొనివచ్చి, మొదట బండ్లవారిని బండ్లనుండి దింపివేసి, వారిని దూరముగా గొందరు గొంచబోయిరి మరి కొందరు బండ్లలో దూరి, మూడుబండ్లలో నున్న వారినింగూడ సమాంతరముగా వేరువేరు తావులకు నెతుకొనిపోయి, వారి వారి యాస్తులం జూపకున్న వారినిం జంపుదు మని వారి చేతులనున్న కత్తులను, జూపి, వారును భయపడి, ఇద్దరన్నదమ్ములును వారి భార్యలునుగల కుటుంబమువారు, వారియొద్దనున్న స్వల్పమొత్తములనుదీసి యిచ్చివేసిరి మూడవ బండిలో నున్న యజమాని, భార్య మరిదలు గల కుటుంబమువారు, తమవద్ద నేమియు లేదనినందున, వారి బండి వెదకి, అందేమియు గానక, వారి కండ్లకు గంతలు గట్టి, తమ యునికిపట్టుకు దోడ్కొనిపోయిరి. తక్కిన రెండు బండ్లవారును, తమత్రోవను దాము మెల్లగ బోయిరి.

---

## మూడవ ప్రకరణము

---

### ద్రోహుల గుహ

వారి యాస్తులను జూపుమనిన జూపనందున ద్రోహుల గుహకు దోడ్కొనిపోబడిన కుటుంబమువారు భార్యాభర్తలును

దాసియు గదా! తమ వస్తుల నొసగ గలిగించ దని యెంత బాధించినను నేమియు లేదనినందున, వారిని విడిచిపెట్టుటకు బదులు ద్రోహులు, తను గూడా వేల నీ కుటుంబమును దోడ్కొనిపోయిరో గదా! యీయిల్లు వారి యాస్తిని జూపవలసిన దనియు, లేకున్న వారి యిండ్లెక్కడో, అందేమి యాస్తి కలదో, యీ మొదలగు సంశయముల నడుగుచు పాప మా ముప్వుర నా ద్రోహు లెంత బీకించియుందురో గదా!

ఇక్కడికి తెల్లవారినా ద్రోహులలో పెద్ద, ఒక వార్తాపత్రిక జూచుకొనుచు, నీ ప్రమాణంములో మనవాని వద్దకు వచ్చి, 'ఏమి——నేను ఊళ్లోకి వెళుతున్నాను ఆఖరు మాట చెప్పు నీ పేరేమిటి? నీ యిల్లెక్కడ? నీ ఆస్తి యెక్కడనున్నది?' యని హుంకరించుచు నడిగెను.

'మా దీదేశముకాదు. నాగపూర్ వాసులము. కలకత్తాలో నున్న బంధువులను చూచుకుని, ఈ సమీపగ్రామంలో వున్న మాబంధువులను చూచుకుని, తిరిగీ, నాగపూర్ వెళ్ళిపోతానని బయల్దేరాము. మేము కర్రలు కొట్టుకొని, అవి అమ్ముకొని జీవనం చేస్తున్నాము. అంతేకాని కర్రల అడుతుల వ్యాపారస్తులం కూడా కాము. పూటభత్యం పుల్లవెలుగు మనుష్యులము. మాకు కూలి ఆడితే, పండ అడుతుంది. మా జీవనం, మా బ్రతుకూ, యిలాంటిదికదా: మాకు ఆస్తి యెక్కడ దొరుకుతుంది నాయనా? మమ్మల్ని యెందుకు

బాధిస్తారు బాబూ మీరు? మాఁకోవని నమ్మళ్ళి పోసియ్యాండి. ఇంతకష్టమగేం చెప్పుకోగలం? మా ఆడవాళ్ళని కూడా యిక్కడ వుంచేశారు గదా — వాళ్ళు బెంగటిల్లిపోతారు నాయనా! రాత్రినుండి వాళ్ళని నేను చూడనైనా లేదు. ఏమైపోయినారో ఇప్పటికి నాకు తెలియదు గదా!' అని వేడుకోలుగా బలికెను.

'మీ ఆడవాళ్ళకేం భయంలేదు. మావాళ్ళదగ్గర వున్నారు. మీనంగతంతా నిజంచెప్పేస్తే మీరంతా కలిసి ఏకంగా వెళ్ళిపోవచ్చును.'

'బాబో, మాకేం లేదు నాయనా! తిండికేలేదు— బండివాడు ధర్మానికి బండి కట్టాడు పుట్టించిన దేవుడు తిండికి లేకుండా యింకా యెన్నాళ్ళదాకా చంపెయ్యకుండా, యిలాగ బ్రతకనిస్తాడో గదా అనే దుఃఖముతో మేము జీవిస్తూ బ్రదికి వున్నాము. దొరక్క దొరక్క మేమే మీకు దొరకాలా! ఏంలాభం—మీదగ్గర కొచ్చాం. ఇవాళ యింత కడుపునిండా అన్నం తిన్నాంగదా అని సంతోషిస్తున్నాం. మీదగ్గిరెన్నాళ్ళుంటే అన్నాళ్ళూ మాకు యింత అన్నం దొరుకుతుందిగదా అని ఆశపడుతున్నాం. మాబంధువుల్ని చూశి కొన్నాళ్ళయింది. వెళ్ళాలని వుందిగాని, అక్కడికి వెళ్ళేమాత్రం యేవుంది— డిబ్బ? ఇక్కడ మీదగ్గ రుంటేనే నయంలాగవుంది నాయనా, గాని మా ఆడవాళ్ళ పూచీమాత్రం మీదే సుమండీబాబూ!'

'మీ ఆడవాళ్ళకేం భయం లేదు గాని, మా దగ్గిర మేము చెప్పిన పన్లు చేస్తూ వుంటూ గా—నీకూ, నీ కుటుంబానికీ, అన్నం బట్టా యిచ్చి యేమైనా రొక్కం కూడా యిస్తాము.'

'ఔను బాబూ, ఇంతకన్నానా ? పనియిచ్చి, అన్నం బట్టా యిచ్చే దాత లేవరు నాయనా ఈ కరువుల్లోను ?'

'సరే. నాతో రా—ఇదుగో—చూడు. అల్లదుగో మీ ఆడవాళ్ళు — కనబడ్డారా ? ఇహ భయం లేదుగదా ? ఇవుగో ఈ బట్టలు కట్టుకో' అని యనుచు నాతని కేదో వింత తీరగు వస్త్రముల దొడుగ నిచ్చి, యాతని కన్నులకు గంతలు కట్టి, ఆగుహానుండి యావలికి దోడ్కొనిపోయి, నాలుగైదు మైళ్ళ దూరము పరకును, మోటారు బైసికిలు మీద కొంత దూరమును, సవారీలో కొంత దూరమును తీసుకపోయి, పట్టణ సమీపమునకు రానిచ్చి, యాతని కన్నుల గంతలు విప్పి, 'రా—నాతో రా—ఊళ్ళోకి వెళ్ళిపద్దాము' అని చెప్పి, కాల్నడకను పుర వీధుల వెంబడి బడి పోవుచుండెను.

---

## నాలుగవ ప్రకరణము

---

### తాళము పట్టుట.

పోలీసు స్టేషనులో సర్కిల్ ఇన్స్పెక్టరు, సబ్ ఇన్స్పెక్టరు, మంగళ్సేన్ మొదలగువారు కూరుచుండి, ప్రమాణస్తు

లు కొందరు తమకు జరిగిన చోరీని గూర్చి, దొంగల చహారా మొదలగు సంగతులు చెప్పుచుండగా వారిని వినుచు, వ్రాసుకొనుచుండిరి.

లాల్‌చంద్‌గారింట పగలు షుమారు పదిగంటలైనది నిన్నటి సాయంత్రము మొదలు యిప్పటి వరకును షుమారు ఏబదిమంది పైనను ఆ తాళము దీయుటకు ప్రయత్నించియు, విఫలమనోరథులయి పోవుచుండిరి. ఎవరో యిద్దరు మనుష్యులు వచ్చి, 'అయ్యా, మేము తాళం తెరుస్తాము ఆ బహుమతీ సొమ్ము మాకిస్తారా?' అని యా యిరువురిలో నొకడడిగెను. 'సొమ్ము యివ్వడాని కేమీ అభ్యంతరం లేదు—గాని మిమ్మల్ని మించిపోయినవాళ్ళు చాలామంది పెద్ద పెద్ద వాళ్లు వచ్చి, చాలా కష్టపడి, తుదకి లాభం లేక వెళ్ళిపోయారు. మీ రేమిటో ఊరికే శ్రమపడతారేమో అని అనుకుంటాను' అని లాల్‌చందు బదులిడెను.

'పోనియ్యండి, ప్రయత్నం చేసినంతమాత్రాన నష్టమేవుంది? తాళం తెరిస్తేనే సొమ్మిస్తారుగాని, ముందుగా యిచ్చెయ్యరు గదా.'

'సరే అయితే చూడండి—రండి' అనుచు లాల్‌చంద్ ఆ గదికి వేయబడిన తాళంకప్ప జూపెను.

వీరిరువురిలో నొకడు రుబ్బురోళ్లు మొదలగు వానిని తయారుచేయుట—తిరగళ్ళకు, కల్వపాత్రములకు, గంట్లువే

యుట, మొదలగు రాతిపనియే వృత్తిగా గల వానివలెను, రెండవవాడు యినుపసామగ్రి తయారుచేయువానివలెను, గాన వచ్చుచుండిరి. ఒకడు వయసు మీరినవాఁడు, రెండవవాడు బాగా వయసు ముదిరినవాఁడు.

పది గంటలు దాటినది. వీ రిరువురిలో నొకడు. తన చేతనున్న యొక తాళపుగుత్తి దీసి, అందొక తాళముఁ నీ రెండవవాని కొసంగి, తన పోచీవాచీ జూచుకొనుచు తాళము దెరువుమనెను. ఈ రెండవవాఁ డేలకో గాని యొక్క క్షణకాలము మాత్ర మేమో యాలోచించు చున్నట్టుల గానుపించెనే గాని, ఆ మొదటివాఁడు వీనిని మిక్కిలి తొందర పెట్టుచుండ, నాత డా తాళముతో నాతలుపు దెరచెను. లాల్‌చంద్‌గా రీతఁడు తాళము దీయు ననుకొనలేదు. ఇప్పుడు తాళము దెరువబడగానే, చంద్‌గారి శరీరము గంపింప జొచ్చెను. అట్లయ్యును తత్క్షణమే బహుమానముకై లోనికి బిలచి, కూర్చుండ నియమించి, తాళము దెరచిన యాతని నా గదిలోనే యుంచి, గొళ్ళెము వేసి, తన స్వంత కప్పు తాళము వేసి, తన పరివారములో గొంతమంది నట నుండుమని చెప్పి, తాను తొందర తొందరగా పోలీసు స్టేషనుకు బరువెత్తెను.

తాళము దీయవచ్చిన వారిలో తాళముతో తలుపు దెరచినవాడు గదిలో నుంచబడినాఁడు గదా. మరి యొకడు లాల్‌చంద్‌గారు పోలీసు స్టేషనుకు పోయినారను సంగతి పసి

పట్టినతోడనే, తనకు రావలసిన బహుమానమును గూర్చి, చంద్ గారు మరి వచ్చునంత దనుక నైన నట నుండక, త్వర గమనుడై వెడలిపోయినటుల గానవచ్చుచున్నది; కానిచో, చంద్ పోలీసు స్టేషనుకు వెళ్ళి సర్కిల్ ఇన్‌స్పెక్టరుగారితో చెప్పగా, నాయనయును ఉత్సాహముతో, మంగల్‌సేనుని దోడ్కొని, చంద్‌గారి యింటికి వచ్చునరికి, ఆ మనిషి కాన రాకుండుటకు గారణ మేమై యుండును?

'ఏమండీ! ఇద్దరు వచ్చినారనన్నీ, అందులో ఒకడు లోపల, ఒకడు పైన, వున్నాడని చెప్పినారే—వాడేడీ?' అని సర్కిల్ ఇన్స్పెక్టరుగా రడిగిరి.

'ఏమో—ఎటుపోయాడో! అవతల ఎక్కడో వుంటే వుంటాడు. ఇంతకీ మనకి కావలసిన మనిషి గదిలోనే వున్నాడు గదా!'

'అలాగా.........'

ఇన్‌స్పెక్టరుగారి ముఖమున నేలాగో గాని లాలుచంద్ నకువలె సంతోషచిహ్నములు గానరాలేదు. లాల్‌చంద్‌గారు ఆ గది తలుపు తాళము దెరచి, గొండ్లెము దీసి, తలుపులు దెరచెను. ఆ గదిలో నున్నవాని నందరును చూచిరి.

మంగళ్సేన్—సునాయాసంగా ద్రోహి దొరికే ఉపాయం చేశారండీ.

ఇన్స్పెక్టరుగారు మాత్రం మారు పలుకక, తదేక ధ్యానముతో, నా గదిలో నిలచియున్న వానిపై నెగా దిగ జూచుచుండిరి.

'ఏమండో, ఏమిటి—మనిషి స్పష్టంగా దొరికినా అలా చూస్తూ ఆలోచిస్తూ వున్నారేమి? ఇప్పుడు కూడా ఏదో పిష్టపేషణం నబబులు చేస్తారాయేమిటి?—అదే ఆలోచిస్తూవున్నట్టుంది—'

'ఉండవయ్యా, ఎప్పుడున్నా తొందరేగాని మీదగ్గర మరేమిన్నీ లేదు—'

ఆ గదిలో నిలచియున్న యాతడు ఇన్స్పెక్టరు నుద్దేశించి, 'ఐనది. అనుభవించినాను—స్వయంకృతాపరాధము. నా తాళమే పట్టినారు.' అనుచు, ఇన్స్పెక్టరును తన వద్దకు పిలచి, ఏదో గుర్తుగలసంఖ్యను చెప్పెను.

'అయ్యో! బాబూ, అరిందమ్—ఎంతపని జరిగినది! రండి—రండి—స్టేషనులో మాట్లాడుకుందాము' అనుచు సర్కిల్ ఇన్స్పెక్టరుగారీ యరిందముని దోకొనిపోయిరి.

అయ్యో, లాల్, ఇపు డేమంటావు? నీచే చెరపెట్టబడిన వానిని సర్కిలు ఇన్స్పెక్టరు, 'అయ్యో... అరిందమ్...' అనుచు, శిక్షించుటకు మారు తనతో దోడ్కొనిపోవుచున్నాడిదేమి?

ఇప్పుడు సర్కిలుఇన్‌స్పెక్టరుగారి మానసమున నెట్టి యూహా లుద్భవించు చున్నవో వ్రాయ నవసరమయి యున్నను, అముగద్దునకును అరిందమ్‌షెల్లాకులను, పర్యాయ మున నిన్స్పెక్టరుగారిని గూడ, ననుమానించుచు నున్న లాలు చంద్‌నకోడి వ్రాయ మాకలము సాహసింపజాలకున్నది.



# కాలూరాయి

## తృతీయ ఖండము

### మొదటి ప్రకరణము

#### రూ 2,175 లకు హుండీ

సుమారు 12 గంటలు కావచ్చినది. పోలీసు స్టేషను లోనున్న అరీందమ్ బాబుగారి పేర విలాసము గల ఒక హుండీ పట్టుకుని వచ్చి ఒకడు ఆయనతో 'అయ్యా, ఈ హుండీ తాలూకు రూ 2,275 లును తమకు యిప్పించవలసిన దని చమర్‌సింగ్ గారు పంపినారు. కావున త్వరగా యిప్పించ గోరుచున్నాను' అని యనెను.

'ఏదీ—హుండీ—ఇదా; మాకు చేసిన సప్లయిలతాలూకు బాకీగదూ—సరే నీ పేరు 'కరీంబక్సు' కదూ: ఈ హుండీ వెనకప్రక్కనే నేను మాబాంకర్ పేర ఎండార్సు చేసియిస్తాను. నువ్వు చున్నీలాల్ గణపతిరాయ్‌గారి దగ్గరకు ఈ హుండీ పట్టుకుని వెళ్ళి, ఆయనకు చూపిస్తే, నీకు సొమ్మిస్తారు. అది పట్టుకుని వెళ్ళి, చమన్ గారికి యిచ్చి, నేను 'రామ్—రామ్' చెప్పినానని చెప్పు.'

'సరే ఆలాగేనండి—'

ఆ హుండీ వెనుక ప్రక్కనే—

'ఈ హుండీ తాలూకు మొత్తం చమన్‌సింగుగారి నౌఖరు కరీంబక్సుకు యిచ్చివేయవలెను.

అరీందమ్'

శ్రీయుతులు, చమన్‌సింగ్ అండ్ సన్సు గార్లకు,
కలకత్తా.

అని వ్రాసిన ఆ కాగితమును కరీంబక్సుకు యిచ్చి, మరి యొక చెక్కు రూ 2,000 లకు తన ఖర్చులకొరకు, తనకు ఆ సొమ్ము చెల్లుబడి యగుటకు తన నౌఖరు నందకిశోరలాల్ పేర ఇష్యూచేసి, నందకిశోరలాల్ చేతికిచ్చి, కరీంబక్సును, లాల్‌సిన్హాను, గణపతిరాయిగారి వద్దకు పంపివేసెను

---

## రెండవ ప్రకరణము

---

### తంతివార్త

పోలీసు స్టేషనులో నేలొకోగాని యాలోచనా నిమగ్నుడై యున్న అరీందమ్ బాబుగారి వద్దకు టెలిగ్రాఫ్ ప్యూన్ వచ్చి, ఏదో యొక కాగితము తెచ్చి, ఆయనచే సంతకము చేయించుకొని, వెడలి పోయెను.

అరిం—చూచినావా, స్నేహమయొక్క బలము! కొద్ది రోజులలోనే కానైయున్న నా కుమార్తె వివాహమునకు సహాయము చేయగలవా యనియన, చంద్రమౌళిగారూ 3,000 లు టి. యమ్. ఒ (తంతి మనియార్డరు) పంపినాడండీ నేను పోస్టాఫీసుకు పోయి డెలివరీ తీసుకుంటాను.

సా॥ఇ—ఇప్పుడు పోస్టుమాన్ అదేనా యింటి మేడక తీసుకుని వచ్చినాడు.

అరిం—ఔను.

సా॥ఇ—మరైతే పోస్టాఫీసుకు వెళ్ళ రేమి? ఎందు కాలస్యం?

'ఔనిదుగో కొంచెం యిక్కడ పని చూచుకుని బయ లుదేరి వెళ్ళగలను.'

---

## మూడవ ప్రకరణము

---

### అరిందమ్ బాబుగారి యిల్లు

'చూచినావా, మన చంద్రమౌళిగారియొక్క అభిమాన ము. మన సరోజిని వివాహమునకు సొమ్మును గూర్చి ప్రసంగ రీత్యా నేను చెప్పి నేటికి 15 దినములైనను కాలేదు. అప్పుడే మూడు నేలు తంతి మనియార్డరుగా పంపినాడు.

'సరేగాని, మీకు సొమ్ము అందినట్టున్నూ, ఈ సహాయమునకు మీ రెంతేని కృతజ్ఞులనిన్నీ తెలియజేయుచు తంతి నంపిరా ? లేదా ?'

'అయ్యో, అలాగు వూరుకుంటానా ! ఇప్పుడే తంతి మనిఆర్డరు పుచ్చుకుని చంద్రమౌళికి నా కృతజ్ఞతను దెల్పుచు టెలిగ్రాము పంపి వచ్చుచున్నాను.'

'అయితే యీ నెలలోనే సరోజిని వివాహము గదా; సొమ్ము చాలదేమో యని సంశయించు చుంటిరి; ఇప్పుడు మరి ఆ చిక్కు లేదు గదా !'

'మరే చిక్కును లేదు. ఏ సంశయమును లేదు. మనకు సోడా, బట్టలున్నూ సప్లయిచేసిన సమన్‌సింగుగారి రూ 2,176 ల హుండియున్నూ, సరోజిని వివాహముకొరకు రూ 2,000 లకు చెక్కున్నూ, మన బ్యాంకికి పంపివేసి, ఆఫీసులో పని చూచుకొనుచుండగానే యీ టెలిగ్రాఫ్ మనిఆర్డరు వచ్చినది. అసలు చంద్రమౌళితో నాకు మూడువేలు పంపవలసిన దని కోరలేదు. ఈ కార్యమునకు 3,000 జరూరనిన్నీ, అందు విషయమయి నేను మిక్కిలి ప్రయత్నించు చున్నానని మాత్రమే చెప్పినాను. అలాంటిది తాను అత్యాతురముగా మూడువేలు, టి. యమ్. ఓ. గా పంపినాడు. కనుక, అదిన్నీ బ్యాంకినుండి వచ్చే మొత్తమున్నూ, కలిపితే వివాహ కార్యము సరళీగా జరిగిపోతుంది. మరేమీ తకరారు లేదు.'

'అయితే మీరు సాయంత్రంలోగా మంచి ముహూర్తము పెట్టించినయెడల, ఆ సుముహూర్తపు వ్యవధి ననుసరించి పెండ్లిపనులు చేయించుటకు వీలుంటుంది.'

'సరే; నేను పోలీసు స్టేషనుకు వెళ్ళెదను. ఈ రోజున శనివారము; రేపు తీరుబడిగా నుంటుంది. అన్ని కార్యములునూ చక్కగా చూచుటకు వీలుండును. నేను ప్రస్తుతం ఠాణాకు వెళ్ళి, అక్కడ పని చూచుకుంటాను'

---

## నాలుగవ ప్రకరణము

---

### పోలీసు స్టేషను

'ఏమండీ టి. యమ్. ఓ. డెలివరీ తీసుకున్నారా?'

'ఆ—తీసుకున్నాను'

'చూచారా నేటి కేసట?'

'లేదు! లేదు! నిన్నటి మన క్వైరీకి ఏదైనా అడ్రెస్ వచ్చినదా?'

'రాకేమి? మీరు ఏదైనా స్కీము వెయ్యాడమంటున్నా, అది నిరర్థకము కావడమూనా?'

'అంతా సార్థకమే చూచారు కదూ స్వయంకృతాపరాధము ఎంత చిక్కు తెచ్చిపెట్టిందో! ఏమిచేయుటకున్నా

వీలు లేక, తుదకి వాని చేతుల్లో చిక్కుకుని, నేను తీసిన గోతులో నేనే పడ్డాను—కొనకి నా తాళమే పట్టినాడు. అదుగో, ఆ లాగే వుంటుంది— ఒక్కొక్కప్పుడు స్కీము అడ్డంగా తిరిగితే.'

'అయితేనేం. ఎన్ని సంగతులో తెలిసినవి కావా!'

'ఆ—అన్నీ తెలియడమే! ఈ తెలియడాలన్నీ కార్యానుకూలత ననుసరించే వుంటవి సరే ఏదెలాగున్నా ప్రొసీజరొకటిసరిగా వుండవలెను గదా ఏదీ కేసరి?'

'ఇదుగో'

దారిలో నొక చోట ఎర్రసిరా గుర్తు వేయబడిన కాగితము తీసి ఆయన యిటుల జదివిరి.

'శుక్రవారపు కేసరి దినపత్రికలో ప్రచురించిన రూ 11 6—0—0 ల లాల్‌చంద్ గారి బహుమాన విషయము' నకు ప్రత్యుత్తరము:—

ఆ తాళము 10 సం. ల నిమిషములకు హాయ్‌పనిచేయు వానిదుస్తులుగల నా నౌఖరుచే తీయించితిని కావున ఆ వెయ్యి నూటపదహారు రూపాయల బహుమానమునకు నేనే హక్కుదారుడను. నా పేరు మధుసూదన లాల్. మీరు పత్రికలో ప్రచురించిన రీతిగా ఇన్‌ష్యూర్ చేసి పంపవచ్చును.

'మధుసూదనలాల్.'

'వహ్వా! ఏమి చమత్కారము!! ఇదో పేరా! ఏంపేర్లు! ఏం చర్యలు!! అయ్యో, వీడే సుమండీ అఘటన

ఘటనా సంబద్ధము. పెట్టెవేసి పెట్టుకోకుండా, చేసినపని చేయకుండా, దాంకీదాంకకుండా, ఔనో కాదో తెలియనీయకుండా ప్రవర్తించుచున్నాడు.'

'సరే లెండి—ఇక మనం చేయవలసిన పనియేమో తెలుసునా ?'

'ఏమో, మీరే సలహా చెప్పండి—'

'చెప్పడమునకేమున్నది; లాల్‌చంద్ గారితో చెప్పి ఆ సొమ్ము పుచ్చుకుని, ఇన్‌ష్యూర్ చేసి పంపించి మీరు పోస్టాఫీసు దగ్గర కాచుకుని యుండవలెను.'

'సరే—ఇక నేదో ఆ పాట్లన్నీ నేను పడతాను లెండి' అని చిరునవ్వు నవ్వి, అక్కడనుండి లేచి ఆయన తన యింటి ఆఫీసు గదిలోనికి బోయి, కొన్ని సీసాలను దీసి, ఏమేమో చేసి, మరికొంత సేపటికొక పెద్ద కవరు మధుసూదన లాల్ గారి పేర విలాసము వ్రాసి, 'లాల్‌చంద్ వద్దనుండి' యనిగూడ వ్రాసి తన నౌఖరు కిచ్చి పోస్టాఫీసుకు పంపివేసి, ఏమేమో యోచించుచు తన యింటనే గూర్చునియుండగ గణపతి రాయి గారి వద్దకు పోయియుండిన కరీంబక్షు యను నందకిశోరలాలు యును, కొన్ని కాగితములు పట్టుకొని వచ్చి అరిందమ్ బాబు గారికి యిచ్చి యెదుట నిలుచబడెను. బాబుగారును ఆ కాగితము లన్నియును జూచుకొని విస్మయమొంది నోట మాటలేక మిన్నకుండిరి.

ఏమిది! అరీందమ్, ఏమా విస్మయానకము? ఏమి యానోట మాట లేకుండుట? ఏమి యూగినుందు వేమి?

కరీంబక్స్—ఏమండీ, ఏం చేస్తార్, చమన్‌సింగ్‌గారి కేమని చెప్పమంటారు?

అరీందమ్—సరే, నీవు వెళ్లు; కొద్దిరోజులలో నిచ్చెద నని చెప్పు ఈ కాగితములు నావద్దనే ఉండనిమ్ము.

కరీంబక్స్—అలాగ వల్లకాదండి—మీకు నేనిచ్చినది డిమాండ్ డ్రాఫ్టు గాని మరొకటి. మరొకటి కాదు. గనుక మీరా డ్రాఫ్టువుంచుకుంటే, ఆలాగు వుంచుకున్నట్టు మీరో వుత్తరం చమన్ సింగుగారి పేర యివ్వాలి. లేకుంటే డ్రాఫ్టే వాపస్ చెయ్యాలి.'

అరీం—సరే వుత్తరం వ్రాసియిస్తాను.

అనుచు నేమేమో వ్రాసియిచ్చి వానిని పంపివేసి మరల యథాస్థానమున గూరుచుండి ఆ తరుసటి గాని చేతలకు విస్మయ సాగరమున నీదులాడుచుండ, నింతలో తంతివార్తావహుడొక తంతిదెచ్చి యిచ్చి బాబుగారి సంతకము వుచ్చుకుని మరలి పోయెను.

ఇవు డిప్పుడే తన కందిన తంతివార్తయును, పది నిముషములకు వెనుక తనకు చేరిన డిజానర్డు డిమాండు డ్రాఫ్టును, డిజానర్డు చెక్కును, చూచుకొని కొంత తడవు పూర్వాపర సందర్భముల నాలోచించుకుని గాబోలు, చివాలున లేచి చున్నిలాలు గణపతిరాయ్ గారి బ్యాంకికి పోయెను.

---

---

## అన్నీ చిక్కులే !

'భళారా ! ఏమి దిట్టరివిరా !
ఏమి బుద్ధి కౌశల్యమురా !
ఏమి దౌర్మార్గ్యమురా !

నీ ప్రయత్నములును, నీ చేతలును, నీ యెత్తు గడలును నీ పన్నుగడలును చూడ జూడ నిన్నియు నీ యరిందమ్ దెసనే గురి సేయుచున్నటులే గానవచ్చుచున్నవి. లాల్‌చంద్ గారింటి చోరీ కేసులోనా నన్నే ద్రోహిని జేసితివి ! అందుల కెన్నెన్నో రుజువులును, దాఖలాలును నీ బుద్ధి చాతుర్యమువలన జూపితివి. నాకు దోడు జేసితివి పాపమా షెల్లాక్‌ను గూడ ! పిదప పోలీసు సూపరింటెండెంటునై నన్నే బాధించితివి ! అనంతరము లాల్‌చంద్‌గారి గది తలుపు తాళము దీయుటలో నేను నీకొరకు దీసిన గోతిలో నన్నే ద్రోసి కప్పివేసితివి ! మఱియు నిపుడు నాసర్వస్వమును గణపతిరాయ్‌గారి బ్యాంకిలో నానంతకముచేసి పబ్లికుగా దోచుకుని నన్ను నిర్ధనునిగా జేసితివి ! నేనంపిన చెక్ యును, నాపేర చమక్‌సింగ్‌గా రంపిన డ్రాఫ్టును నీ వలననే గదా, డిజానరై వాపసు వచ్చినవి !

అయ్యో! డబ్బులేక యిబ్బంది పడుచుందునేమో యని యూహించిగాబోలు, బోగస్ తంతి మనిఆర్డరు మూడువేల

కంపితివి ! అది తెలిసికొన జాలక మాచంద్రమౌళియే పంపె గాబోలని సంతసించి నాకీ ధన్యవాదములతో తంతి నంపగా నిదిగో తానేమియు నెరుగనివాని, సామ్యంచుచిదే పంపితినని తన్నెకనక్కడను లాసి పడగొట్టను, దానివ్వరూప కొంచె మొత్తు డులో జిక్కియున్నావనియు, దగిన సాక్షి మొఱ్ఱ జాలమికి తమింపు డనియు నిప్పుడీ తంతి నంపినాడే !

* * * * *

'ఓహో, ఏమి నాటకీ యాడి మనున్నావుగా? ఇన్ని కతల బన్నెడి నీవొక్కండవె వానో, కాదో గాని, నీ కుతంత్రములు ప్రశంసనీయములు. కాని యిన్ని నీ పన్నుగడలును అరిందమ్ గూర్చియేనా? అయిన నౌగాక; గాని, దొంగనాణెములు తయారుచేయుచున్న కాలూరాయని నీవేయైనయెడల, ఆనాడు గుల్‌సుమ్ చెప్పినరీతిని దొంగలకు గురువగు కాలూరాయుని నీవే యైనచో, నిన్ను మాత్రము సామాన్యముగా వీడువాడను గాను. ఈ బొందిలో నీ ప్రాణముండగా, పట్టిన పంతము నెరవేరు నంతదాక అరిందమ్ నిన్నలసాల వీడువాడు గాడు, ఇదుగో యిప్పుడిపుడే నేను సంధించిన నారాయణాస్త్ర ప్రయోగ మమోఘమై పరిణమించును గాక——

'ఔరా! నీయొక్కయోగాని, మీయొక్కగాని లయకారి తన మేర్పాటు సమయ మాసన్నమైనది అరిందమ్ అయినను నామమాత్రావశిష్టుడు కావలెను. కానిచో ద్రోహకులాంతకం

కూడా వుంచిప్రన్నారు. ఆడవాళ్ళు ఆడపన్లున్నా, మొగ వాళ్ళును మొగపన్లున్నా, చేస్తున్నాము.'

వీ రిరువురును వడివడి నడచుచు బాబుగారి యిల్లు సమీపించుచున్నారు.

'ఎన్నాళ్ళకోసం మిమ్మల్నందర్నీ వుంచినారు అనగా ఎన్నిరోజుల వరకూ పనిచేయుటకు మిమ్మల్నందర్నీ నౌఖరీ వుంచి వున్నారు?'

'ఎన్నాళ్ళదాకా కేముంది? అమ్మాయిగారి వివాహం అయిన మూడురోజుల దాకా ఉండమని రోజుకూలికి నిర్ణయించి వుంచినారు.'

'సరే'

ఇటుల మాట్లాడుచునే బాబుగారిల్లు సేరిరి

ఆహా! వారి భవనము నిత్యకల్యాణమును— పచ్చల తోరణమును, అయియుండెను. అందరును వచ్చువారును బోవువారు నై యుండిరి.

ఇంట స్వర్ణమయి వేయికన్నులతో పెండ్లిపనులు జేయించుచుండెను.

బంగాళా దేశమున నొక తాలూకాకు తహసీల్ దార్ పనిచేయుచున్న కిషన్ చంద్రసేన్ గారి జ్యేష్ఠకుమార్తె యగు స్వర్ణమయి అరిందమ్ బాబుగారి ద్వితీయ కళత్రము ఈయనకు ప్రథమ కళత్రమువలన సంతానము గాని, సంసార

సుఖముః గాని చేకురక మునుపే, ప్రథమ కళత్రవియోగము సంఘటించుటచే, స్వర్ణమయిని ద్వితీయ కళత్రముగా వివాహము జేసికొనెను. సాంపమీరా మొదలఁయిప్పటికి పంౘదెండేండ్లవయసుగల సరోజని తప్ప మరి పిల్లలు లేరు. పోనీ యిక ముందైనను పుత్రసంతానము కలుగునా యని యనుకొంద మన్నను, మఱి సంతానయోగ్యతయే లేదని ఆంగ్లవైద్య శాస్త్రపారీణ యగు హార్షుదాంసాసిగారు సిద్ధాంతపరచియే యున్నారు కావున నీ సరోజసి వివాహ మత్యుత్సాహముగ జరుపనుద్దేశించి, అరిందమ్ బాబుగారు తమవద్ద నున్న సొమ్ము చాలక, బ్యాంకిలోనున్న తమసొమ్మును దెప్పించుకొన చెక్కు పంపియుండిరి గదా మఱియును చాలక చంద్రమౌళితో తన కుమార్తె వివాహమునకు ముహూర్తపు వేళకు తగ్గకుండ సహాయము (అప్పిచ్చుట) నభ్యర్థించుసటుల ప్రసంగము గూడజేసిరి గదా! ఇంతకును ఈయన యే పదిమందికి వివాహము చేయవలెను గనుక!

స్వర్ణమయి యును, ఒడలు దెలియనంత శ్రమపడుచు, కూలికి గొందరు కూలీలను, నౌఖరులను నియమించి, రాబోవు బంధుగులకును, పెండ్లివారికిని, బసలును, విడుదులును యేర్పరచుట, భోజన సదుపాయములకు వలయు నేర్పాటులు సేయుటలోను గాగల పనులలో నతిచురుకుగ నామె సంపూర్ణముగ నిమగ్నయై యుండెను.

అరిందమ్‌బాబు తన యింటికి బోయి యొకానొకచోసమున నొక వాలుకుర్చీపై మేనువాల్చి, విశ్రాంతి నొందుచుండెను.

వేళ యతిక్రమించినందున భోజనమునకు రావలసినదని, క్రొత్తగా నియమింపబడిన కూలివానిద్వారా, స్వర్ణమయి కబురంపె గదా! బాబుగారు వచ్చిరని తెలిసికొని స్వర్ణమయియును నాథుం జూడవచ్చి, 'ఏమిది. నేడింత సేపటివరకును భోజనమునకే రాలేదు భోజనానంతరము మరల పనులు జేసికొన వచ్చును గదా యని కబురంపితిని' అనుచు భర్తమోము తేరి పార జూచి, 'ఏమోగాని యీరోజున మిక్కిలి ఆయాస పడినటును, ఏదో విచారాంకురము మీమానసమును గలవర పెట్టుచున్న నట్లును దోచుచున్నది — కారణ మడుగవచ్చునా?' యని సవినయముగ స్వర్ణమయి పలికెను. కొంతతడ వాతడు మిన్న కుండి—'స్వర్ణమయీ, నీ యుత్సాహమునకును, నీ ప్రయత్నములకును, నేను సహాయ పడజాలకుండుట యటుండ, నా వలన గొంత యపరోధము గూడ కలుగు చున్నందుల కెంతయు విచారించుచున్నాను' అని పలికెను.

'మీరు స్వయముగ నపుంతరములు గల్పించరే. దైవికములే యైనచో, దైవమున కిష్టము లేదనియే యెంచి ప్రవర్తింతుము. ఇప్పుడు కాకున్న మరి యొకప్పుడీ శుభకార్యము నెరవేర్పగలము.'

'నీతో చెప్ప కేమి? ఒక్కసారిగ నెన్నో చిక్కులు ద్రోహులవలన కలిగినవి. బ్యాంకిలో నున్న మన సొమ్మంతయు నా సంతకము ఫోర్జిచేసి ద్రోహి యెవడో కొల్లపెట్టినాడు.

మరియు చంద్రమౌళి పేరుతో నాకు మూడు వేలకు దొంగ టెలిగ్రాఫు మనియార్డరు పంపియున్నాడు. అందుకు గూర్చి పెద్ద చిక్కు రాన్ను యున్నది. అది సోమవారమునాడు తేల గలదు.'

'అయితే మీ సంతకము ఫోర్జిచేసి ధనము కొల్లగొట్టిన వాడును, నీకు రూ 3000 లకు టెలిగ్రాము పంపిన వాడును ఒక్కడేనా! లేక యిద్దరా?'

'ఒక్కడో, యిద్దరో, పదిమందో, నేను చెప్పలేను గాని, ద్రోహు లందరును అరిందమ్ దెసనే గురిచేయుచున్నట్లు దోచుచున్నది.'

'తుద కేమి తేలినది?'

'తేలుట కేమున్నది. ఎక్కడనున్నా నా తాలూకు సొమ్ము లేదు—నడచుచున్న నెలజీత మొక్కటి తప్ప, మరి యాధారమే లేదు. మనకు సోడా సప్లయిచేయుచున్న గులాబ్ సింగ్ తనకు మన మీయవలసిన సొమ్మును గూర్చి తొందర చేయుచు డిమాండు డ్రాఫ్టు నంపియున్నాడు. కావున నీ మానములో వివాహ మాపి, మరియొకప్పుడు, జరుపవలె నని దోచుచున్నది. ఇందు కే మందువు?'

'అయ్యో, యిన్ని చిక్కు లొక్కసారిగ సంప్రాప్త మయినప్పుడు, యీ ముహూర్తమునకు వివాహము జరుప వలదని దేవుని యభిమతమును, సంకల్పమును, అయి యున్న

దని దలంచి నాపివేయవలసినదే. నిన్నటి మూడువేల తంతి మనియార్డరు మనము చంద్రమౌళి పంపినాడనుకున్నది దగాయేనా! ఎంత గుండెనిబ్బరము!'

'ఈ క్రొత్త నౌఖర్ల నందరినిన్ని పంపివేయుము.'

'మరియొక గంటకాలము పని చేయించి వారివారి చేతులలో నున్న పనులు పూర్తి చేయించి, వారి కీయవలసిన సొమ్మిచ్చి పంపివేసెదను'

'సరే' యని అరిందమ్ బాబుగారు భోజనాది కార్యములొనర్చుకొని, ఆ దినమున మిక్కిలి వేగముగ బరుండబోయిరే గాని, ఆపదలపై నాపత్తులే వరుసగ, గలుగుచుండ, ఆందోళనారహితమై, నిశ్చింతగా నున్న గదా మేనువాల్చి నంతనే నిద్ర పట్టుటకు! హంసతూలికపై బన్నుండినను, మొండ్లపై బన్నుండినను గూడ నొకటియే గదా! ఉండి యుండియు దీర్ఘోచ్ఛ్వాసములు దీయుచు, పాన్పుపై నొక్క నిముసమైనను విశ్రాంతిగా బరుండలేక, యిటు నటు దొర్లుచు, బహు మనస్తాపముచే నెంతసేపటికిని సూర్యోదయము కాదే యని వేదనం బడుచుండెను.

మనోవేదనచే బాధితులౌవారికి నిముసములు గడియలై, గడియలు ఝాములై. ఝాములు దినములై, దినములు దీర్ఘములై తోచుట; మనోవిచారము లేక, ఆనందసముద్రమున నీదులాడుచున్నవారికి, దినములు ఝాములై, ఝాము

లు గడియలై, గడియలు నిముసములై, నిముసములు బహు ప్రాన్స్వములై తోచుట లే కాలమునగాని, ఏ దేశమునగాని, ఎవరికిగాని, సహజములేగదా !

---

ఆ ర వ ప్ర క ర ణ ము

---

## క్రొత్త భోగట్టా

సర్కిల్ ఇన్‌స్పెక్టరు గారును మరియు నింకెవ రెవరో ఠాణాలో ముచ్చట లాడుచుండగ, నరేంద్రబాబు గారు ఠాణాకు వచ్చిరి. వీరు వచ్చిన మరి కొంతసేపటి కెవరో బాబుగారి నెరిగినవారు గాబోలు వచ్చి, 'బాబుగారూ, తమ కేలాగో గాని ఎరెస్టు వారంటో, లేక, ఏదో సమనో గాని వచ్చినట్లు పోస్టాఫీసు సమీపములో నను కొనుచుండగా లీలగా విన్నాను. ఎందుకైనా మంచిదని తమతో మనవి చేసినాను.' అని ప్రసంగవశంబునంబోలె యనెను.

సర్కిల్ ఇక్—ఏమిటండీ, ఇదో గంద్రగోళము. అన్నీ ఒకదాని వెనుక నొకటిచొప్పున వరుసపెట్టె అపత్పరంపర లేనా! నేను చిక్కులి చింతించుచున్నాను. మీరు కొన్నాళ్ళు సెలవు పెట్టి యింటివద్దనే యుండినచో, కొన్నాళ్ళకు యీచిక్కులన్నియు వదలిపోవచ్చును.

అరీం—అది పురుష లక్షణం కాదు.

సూర్యకాంతమణి యచేతనంబయ్యును సూర్యపాదములు సోకినంతమాత్రాన మండిపడుటంబోలె తేజోవంతులు పరులు చేయు పరిభవంబుల నోర్వజాలరు; మఱియు ఆపదలు సంభవించినపుడు ధైర్యమును, ఐశ్వర్యప్రాప్తి యపుడు ఓర్పును, సుస్వభావములు గదా.

కావున నధైర్యపడి, పౌరుషము విడచి, ప్రతిపక్షుల దుష్కృత్యముల కోడి, ప్రజల సౌఖ్యము చూడక, ఈనా ఒక్కని క్షేమముకొరకు, మాత్రమే చూచుకొనుట మిక్కిలి ఒంటెత్తుతనము కాదా; ఇంతకును నాకు కలిగిన ఆపదలు మాత్రము తీరనివి కావు మరికొంచెము శ్రమపడక తప్పదు.

సా॥—నేనుకూడా యేమీ తప్పుమాటాడ లేదే! కొన్నాళ్ళపాటు శ్రమలేకుండా, తొందరలు లేకుండా, నెమ్మదిగా నుండవచ్చును కదాయని అన్నాను. సరేగాని ఎరెస్టు వారం టేమిటి ?

అరీం—ఏమీలేదండి నిన్నను తమయెదుట మాట్లాడు చుండగనే పోష్టుమాన్ 8,000 రూపాయిలకు టి. యమ్. ఓ. ఇంటిమేషన్ తీసుక వచ్చినాడుకదా అది చూచి, చంద్రమౌళి పంపినాడని తమతో కూడా ప్రసంగవశమున చెప్పియుండలేదా! అదుగో ఆ టి. యం. ఓ. బోగస్‌ది, దొంగ తంతి మనిఆర్డరు

పంపినా డెవడో ద్రోహి. అంతేకాని చంద్రమౌళి పంపలేదు. ఆతనికేమిన్నీ తెలియదని నిన్న సాయంత్రానికే నాకు టెలిగ్రాం వచ్చినది. తక్షణమే నేను పోస్టల్ అధికార్లకు వ్రాసినాను. అది యీరోజు సాయంత్రానికి గాని కండగలదు ఈ లోగానే బహుశః వీక్లీ గెజట్ను శనివారం (నిన్ననే) వెళ్ళియుండ వచ్చును; అక్కౌంటుమూలంగా మూడువేల రూపాయిలు బొక్కసములో తక్కువ వచ్చియుండును. అది ముందుగా చూచుకుని, యిది ఫాల్సు తతిమనిఆర్డరు అని గ్రహించి, ఆసొమ్ము రిఫండు సేయుమని కోరుచు, ఎక్స్ప్లనేషను, కోరి యుంటారు. అంతేకాని అది అసెస్టుఆర్డరు అయియుండకూడదు. ఇంతకీ రేపటిరోజున అన్నీ తెలియనే తెలుస్తవి గదా.

'ఇది అంతా ఒక్కడిపనో, లేక, ఇద్దరుముగ్గురిపనో!'

'పనులయొక్క చమత్కారం చూస్తే ఒకనికన్న యెక్కువమందే యిందులో పని చేస్తూవున్నట్టు తోస్తున్నది. కాని వీనంతటికిన్నీ సాధు డొక్కడే అనిన్నీ, తానున్నూ తన అనుచరులున్నూ కలిసి చేస్తూవున్న పనేగాని, అసహాయంగా ఒక్కడే ఇందులో లేడని అనుకుంటాను.'

'సరే, షెల్లాక్ బ్రాకెట్లు యివ్వా డెక్కడనున్నారు?'

'వేరే వేరే వనులమీాద పంపినాను. రెండురోజులలో మీాకంతా తెలియగలదు.'

'అమగో మీా నౌఖరు—యెందుకో—'

'ఏమిరా, ఏ మీలాగు వచ్చినావు?' అని అరీందమ్ బాబు ఆ వచ్చిన నౌఖరును ప్రశ్నించెను.

'ఏదో వుత్తరం వచ్చింది. అమ్మగారు ఏమీ తోచక కూర్చున్నారు వీలుంటే తమర్ని ఒక్కసారి దయచేయమన్నారు' అని ఆ వచ్చినవాఁడనెను.

'వీలుండడాని కేమున్నది నేఁడు ఆదివారము. అంతా తీరుబాటే పనిలేనివానికి సరేగాని మళ్ళీ యేం షికారీయేనా!' అని యనుచు, ఇన్స్పెక్టరుగారివద్ద శెలవు గైకొని, తనయింటికి మరలెను.

---

## పదవ ప్రకరణము

---

### ఉత్తరము

'ఏ మీలాగున కూర్చున్నావు?'

'మా తల్లిగారికి జబ్బుగా నున్నదని మా తండ్రిగారు వ్రాసినారు.'

'ఉత్తర మెప్పుడు వచ్చినది?'

'ఇప్పుడే—ఒక గంటక్రింద వచ్చినది.'

'ఇది రాకమునుపు మన కేమీ భోగట్టా లేనేలేదు!'

'కాను. ఇదే ప్రత్యుత్తరము.'

ఆ జా బందుకొని, చదువుకొని, ఇదుగో 'జవాబురని తోస్తే, తిరిగి వ్రాస్తా' నని కూడా వ్రాసినారే ఇంతట్లో తొందర పడ నక్కఱ లేదని యిందువలన తెలియుచున్నదిగదా.'

'కానుగాని, తిరిగీ వారివద్దనుండి జాబు వచ్చువరకును, ఊరుకోవడమేనా, లేకపోతే, డాక్టరుని తీసుకొని వెళ్ళడమా?'

'ఏదైనా రేపు సాయంత్రము దాకా వూరుకుని, అతర్వాత యే ప్రయత్నము చేసినా మంచిదేను.'

అని సలహానిచ్చి, ఆ దినమంతయు, వారివారి స్థితిగతులను గూర్చియును, జరిగిన చిత్రచర్యలను గూర్చియు, ప్రసంగించుకొనుచును కాలము బుచ్చిరి.

అరిందమ్‌గారి ఇంటివద్ద పనిచేయుచున్న 778 కొలవు పుచ్చుకొని అప్పుడే వెడలిపోయెను.

చదువరులారా!

నేడాదివారము గదా! మనము 2, 3 రోజుల నుండి మిక్కిలి శ్రమపడి, లాల్‌చంద్‌తో విచారించి, అరిందమ్‌తో మోసపోయి, ద్రోహితో గడసరిపల మయిన మన మానసము లెంతో భారవంతము లయి యున్నవి. కావున నాదివారమగు నేడు, మనము కొంచెము విశ్రాంతి నొందుదము!'

రేపు సోమవారము. మన ముందరమును మిక్కిలి హెచ్చరితో గమనించవలసిన సంగతు లెన్నెన్నియో యున్నటుల గానవచ్చుచున్నవి.

---

# ఎనిమిదవ ప్రకరణము

## సోమవారము

ప్రహరీ గోడ సింహద్వార సమీపమునుండి, భవనపు మెట్ల వరకును, ఎక్కడ చూచినను మోటారులే; మోటారు సైకిళ్ళే. ప్రజయు నినుక వేసిన నినుక రాలని చందాన క్రిక్కిరిసి యుండిరి. అందరును, వ్యాపారస్థులు, ఉద్యోగస్థులు, కొందరు కుటుంబస్థులును నిలచియుండిరి. నెంబర్లు వేయబడిన పోస్టు బాక్సులతో కొందరు నౌఖరులును, వేచియుండిరి. కాలచక్రమునకు భీతిలక, జీవన మత్యల్ప మని జంకక, మనము జన్మ మెత్తి, యేకార్యము చేసియున్నా' మను ప్రశ్న యొకప్పుడైనను యోచింపక, 'మా పెద్ద లార్జించిరి; మే మనుభవింప వలసియున్న' దని యెంచువారుగాని, 'తిండికేగద మనము జన్మించినది—కావున సంతృప్తి కరముగ దినుచును, దిరుగుచును, నుందు' మను సోమరులు గాని, ఉబుసుపోక, పలుపోకలఁబోవు, ఆ తితాయిలుగాని, నిరుద్యోగులును, నిర్వ్యాపారులు, నగు కా పురుషులు గాని, యచ్చట నొక్కరైనను గానరారు—అందరును పనిసేయు వారే; అంతా చురుకుదనమే! అంతా పనే, మేడ క్రింది భాగమంతయు మామూలు టపాలు సార్టింగు బటువాడాలు. మేడమీద రిజిస్ట్రేషనులు, సేవింగ్సు బాంకులు, ఇన్‌ష్యూర్‌లు మొదలగువాని బటువా

డాలును. రిజిస్ట్రేషన్ నిమిత్తము వచ్చువారును, పుచ్చుకొని పోవువారును, సేవింగ్సు బాంకిలో సొమ్ముకట్టువారును, వాపసు పుచ్చుకొను వారును, ఇన్‌ష్యూర్ చేయుటకు వచ్చువారును, పుచ్చుకొను వారును; ఎక్కడ చూచినను, ప్రజాసంచలనమే!

ఇట్టియెడ నొక స్ఫురద్రూపియగు పురుషు డొక డొక కార్‌నుండి దిగి, తనతోనున్న మరినల్వుర నట నుండు డని చెప్పి, 'భద్రముసుడీ' యని హెచ్చరించి, విసవిస నడచుచు బోయి మెట్లెక్కి, తొందర తొందరగా, ఇన్‌ష్యూరెన్స గుమస్తాను సమీపించి, 'ఏమండీ, గుడ్ మార్నింగ్, నా పేర నేదైనా ఇన్‌ష్యూరెన్సు కవరు వచ్చినదా?' అని యడిగెను.

'మీ పేరు?'

'గోపాల్ చంద్'

'ఎక్కడినుండి?'

'కరాచీనుండి——'

'ఆహా; చూడాలండీ. యీదొంతి దొంతంతాను; యింకా రిజిస్టర్‌లో యెంటరే కాలేదు: ఇదిగో, ఆపనే ఆరంభిస్తాను. కొంచెం మీరు తాళాలి ఒక్క పావుగంట కూర్చుండ గలరా?'

'అయ్యో, కూర్చోకేమి? అందుకే వచ్చినాను గదా: కానియ్యండి; మీపని కానివ్వండి. అంతా అయిన తర్వాతే ఆమెను——వచ్చే వుంటే, యింతట్లోకి యెక్కడికి పోతుంది?'

'సరే'

ఇన్‌స్పెక్టరెన్సు గుమాస్తా తన పని చేసుకొనుచుండెను.

గోపాల్‌చంద్ యును, తన వీపునదండకు నొక తూరకుంచి, యేమో యోచించుచు గాబోలు కూరుచుండెను.

పోస్టుమాస్టర్ —యూ, మని ఆర్డర్ క్లార్క్! ఇదుగో అరిందమ్ గారిపేర శుక్రవారమునాడు వచ్చిన మూడు వేలకు టి. యమ్. ఓ. ను గూర్చి ఆయననే రిపోర్టు చేసియున్నాడు చూచినారా? ఆ టి. యమ్. ఓ తనకు వచ్చుటలో నేదో అసందర్భము కలదనియు, పంపినవాని పేరు చంద్రమౌళి యని యున్నదిగాని, నిజముగా చంద్రమౌళి పంపలేదనియు, ఆ చంద్రమౌళి గారి తంతి జవాబు నిందుతో జత పరచితి ననియును, ఆ సొమ్ము నాపను పుచ్చుకొనవలసిన దనియును, తాను సోమవారము 10 గంటల వరకును యింటి వద్దనే యుందు ననియు, ఆలోగా పోస్టల్ అథారిటీస్ వచ్చి సొమ్ము నావన్ పుచ్చుకొనియెడల మరల మంగళవారము ఉదయము 10 గంటలలోగా తానన్య కార్యాంతరములలో నుందుననియు తెలియజేయుచు, ఈ బోగస్ (మిథ్య) తంతి మనిఆర్డరు పంపినవానిం గూర్చి పోస్టల్‌వారు తగిన చర్య చేయవలసిన దనియు రిపోర్టు నిచ్చియున్నారు. కాని మనమేమి చర్చ చేయగలము? మరల నీ కేసు పోస్టు మాష్టర్ జనరల్ గారి ద్వారా ఆయనకే డిటెక్షనుకొరకు రిఫర్ కావలసినదే. ఇప్పుడు మీరు చేయవలసిన పని, తక్షణం పి. యమ్. జీ. గారికి తంతి పంపవలెను.

'అరీందమ్‌గారి పేర చంద్రవశాళి పంపిన రూ 8,000 ల టి. యమ్. ఓ. బోగస్ అనియు, తనకు చెందరా దనియు, సొమ్ము వాపస్ యిచ్చుచున్నా ననియు, అరీందమ్ బసూ (బోస్) గారు రిపోర్టు నిచ్చియున్నారు. సొమ్ము వాపసు పుచ్చుకొను చున్నాను. ఈ కేసు విషయమై తగిన చర్చ చేయవలసిన దని గూడ ఆయన వ్రాయుచున్నారు.

పోస్టుమాస్టర్, యమ్

కలకత్తా'

అని వ్రాసి తంతిశాఖ కంపి, టెలిఫ్రూన్‌లో పి. యమ్ జీ. గారితో మాట్లాడి సంగతులన్నియు నివేదించుచుండెను.

గోపాల్‌చంద్ వీరి సంభాషణల నెల్ల నేలొకోగాని వినుచునే యుండెను

ఇన్‌ష్యూరెన్సు గుమస్తా ఇన్‌ష్యూర్ కవరులన్నియు పరీక్షించుచు, వాని పై విలాసము, పంపినవారి పేరు, సంఖ్య, మొత్తము మొదలగు వివరములు రిజిష్టర్‌లో వ్రాసుకొను చుండ, 'ఆఁ అయ్యా, ఏదండీ, ఆ కవరు అదే నాది కాబోలు —చూడండి—' అని గోపాల్‌చంద్ అతనితో ననెను.

'కాదండీ—'

'చూడండి; ఎవరిపేర నున్నదో.'

'ఇదా ? ఇది రూ 1,116—0—0 లకు ఇన్‌ష్యూర్ —మధుసూదన్ లాల్‌కి'

'ఎవరు పంపినది?'

'ఎవరు పంపితే నేమి? లాల్‌చంద్ వద్దనుండి—ఇంతకీ యెవరిదైనా, గోపాల్‌చంద్‌ది మాత్రము కాదు.'

'ఔనౌను' అనుచు నీతడు కిన్నకుండ 'అయ్యా, ఇంతేనా? ఇంకా వున్నవా కవర్లు?' అని అడిగెను.

'మరి లేవండి ఇంతే యీరోజుకి ఇవి చాలవా అండి! మా పీకలమీదికి!!'

ఇంతలో నౌకరొకండువచ్చి, 'అయ్యా, మధుసూదనలాల్ పేర ఇన్‌ష్యూరెన్సు కవరు రూ [illegible]—0—0 లకు వచ్చినదా?' యని ప్రశ్నించెను.

ఈతడు సంపూర్ణమైన అంగసౌష్ఠవము గలిగి, ముష్కరుని వలె నుండెను. వెనుకకు విరిచి కట్టిన పింజలు గల నల్లని యంచుల పంచయును, పంచ లోపల కెగించి, బిగించి యుంచి ధరించిన కమ్మీజును, కమ్మీజునకు వన్నెదెచ్చిన నల్లని షార్టు కోటును, వాని యుడుపులు.

ఇన్‌ష్యూరెన్సు గుమస్తా, గోపాల్‌చంద్ అడిగినప్పుడు వలె, కవరులు ఒకటొకటే చూడక, రిజిష్టరు దిరుగవేయుచు కావలసిన భోగట్టా వెదకుచుండెను.

'ఏమండీ; నామాటేమి చూచినారు కారే?'

'అయ్యో! అదేచూస్తున్నాను ఉండవయ్యా, నీలాగే రెండుకళ్ళూ, రెండు చేతులే, వున్నాయి. ఇటు అడిగి అటు తెమ్మంటే యెలాగ? చూడనిస్తారా లేదా?'

రిజిష్టరులో చూచుచుండెను.

'అయ్యా, ఇప్పటికి శెలవు తీసుకుని తిరిగి దర్శనం చేస్తాను!' అని చెప్పుచు గోపాల్‌చంద్ లేచి త్వర గమనుడై పోయి, మేడదిగి, తన కార్ వద్ద నిలచియున్న తనవారిని సంబోధించి, 'ఇప్పుడు నల్లంచు పంచ, తెల్లషర్టు, నల్ల షార్టుకోటు, మనిషి నడచి వచ్చినాడా, బండిమీద వచ్చినాడా?' అని యడిగెను.

తనచే నిపుడు సంబోధింపబడిన తనవారిలో నొకడు, 'అతనా? ఇదుగో ఈ కారులో వచ్చినాడు' అని యటనున్న నొక ఫోర్డుకారు టూ సీటర్‌ను జూపెను. గోపాల్‌చంద్ దాని నెంబరు నొక కాగితముపై వ్రాసి, మఱియు నేమో వ్రాసి, పోస్టాఫీసురోడ్ బీటు జవానున కిచ్చి 'ఈ చీటి సర్కిల్ ఇన్‌స్పెక్టరు గారికి ఒక గంటలోగా అందవలె' నని తాఖీదుగా చెప్పి మరల నీ కార్ కడ కరుదెంచి, తన జేబునుండి యేమో దీసి ఆ కార్ చక్రమునందో నేమో పడవేసి, తన కార్ వద్ద నిలచి, తనవారితో ముచ్చటించుచుండెను.

మన ముష్కరుని వంటివాడు, ఇన్‌ష్యూరెన్సు గుమాస్తాతో మాట్లాడి, పోస్టుమాష్టరుతోనును మాట్లాడి, తనకు బటువాడా కావలసిన ఇన్‌ష్యూరెన్సు కవరును దీసికొని, శర వేగమున దన కార్‌ను సమీపించి, అధిరోహించి, వింటినుండి విడువబడిన బాణముం బోలె దానిని పోనిచ్చెను.

ఈ కారును కనుమేటు దూరము పోనిచ్చి, తనవారితో నిలచి ముచ్చట లాడుచుండిన గోపాల్ చంద్ యను తన సౌండ్ లెస్ మినర్వా కార్‌ను గూడ బయలుదేర దీసెను. ఈ రెండు కారులును, మనమే చూచియుండినచో నొకటి వెనుక నొకటి, నీవా, నేనా యనునటుల బరుగిడుచున్న వేమో యని మనకును దోపక మానదు.

---

## తొమ్మిదవ ప్రకరణము

---

### ఒక చిన్న యుత్తు

కార్పొరేషన్ ఆఫీసుకు వెళ్ళి అక్కడి గుమాస్తాలతో నేమో మాట్లాడి, వారు చెప్పిన దేదో తన పుస్తకములో వ్రాసుకుని అప్పుడప్పుడే మరలి వచ్చిన పోలీస్ సర్కిల్ యిన్‌స్పెక్టరుగారు కార్ నొకదానిని అద్దెకు మాట్లాడి అందధిరోహించి పోయి పోయి ఒకానొక దివ్యభవనము జేరెను.

లోపల అమరావతిం బురుడించు వైభవము గల నా భవనము బ్రవేశించుటకు వీథివైపు ముందుభాగమున,—

శ్రీ శ్రీ శ్రీ దర్భంగ మహారాజా
లోపలనున్నారు.

తెమ్మః అని వ్రాయబడియుండెను.

లోపల ప్రవేశించిన సర్కిల్ ఇన్‌స్పెక్టరుగారు మహారాజావారితో కొంతసేపు లోకాభిరామాయణము ముచ్చటించి, తుదకు సెలవు గైకొనువేళ, 'తమ కార్‌కు నంబరు వేయించినారా? కార్పొరేషన్‌వారు చాలా పట్టుదలగా నున్నారు.' అని యనెను.

'అయ్యో! వేయించకేమి? నేటికి వారము దినములైనది. దాని నెంబరు 9165 సి. ఏమి నెంబరు వేయించలేదని కార్పొరేషన్ వారు తగాయిదా చేయుచున్నారా?'

'లేదు—లేదు. నెంబర్లు వేయించే రోజులు గనుక శ్రీవారు మరచియుందురేమో యని జ్ఞాపకము చేసినాను.'

'లేదు నేను యిటువంటి విషయములలో మిక్కిలి పట్టుదలగా నుంటాను.'

'చిత్తము నేను తమ దర్శనమునకు సుమారు పది పదకొండు గంటలకే రాదలంచినన్ను త్రోవలో తమ కార్‌ను నేను చూచినందున తమ రెక్కడికో దయచేసియుందు రని తలంచి యుంటిని.'

'లేదండీ నేనీరోజున యిప్పటివరకును యెక్కడికిని కదలనే లేదు. నాకార్‌నుకూడా యెక్కడికిని పంపలేదు.'

'అయ్యో; యీనెంబరే నేను చూచినాను.'

'ఈనెంబరే ?'

'చిత్తము కార్పొరేషనువారు పొరబడి యుంటారు. తమరు 9457 సి. (1) అని గుర్తువేయించుమని నా ప్రార్థన. పొరపాటున 9457 సి. అని నెంబరు యిచ్చియుంటారు తమరు యీ సవరణ చేయించినచో, మరి చిక్కురాదు. నేనున్నూ తమరు చేయించే సవరణ కార్పొరేషన్ ఆఫీసులో యిప్పుడు తెలియజేసి, అక్కడ రిజిష్టరులలో కూడా యీ మార్పు చేయించెదను.'

'సరే; బాగానేవున్నది. నేను యిప్పుడే ఆ సవరణ చేయించెదను.'

'చిత్తము. శెలవు తీసుకుంటాను' అని యని మన సర్కిల్ ఇన్‌స్పెక్టరు గారు తిరుగ స్టేషనుకు బోవుచు నిటుల దలపోయ దొడంగిరి.

'ఏమిదా. చమత్కారము! అరిందమ్ పోస్టాఫీసునుండి నాకు పంపిన చీటి ప్రకారము 9457 నెంబరు కార్ శ్రీ దర్భంగా మహారాజా వారిది కదా— అది ద్రోహుల కార్ గనుక జాగ్రత్తగా చూడవలసిన దని వ్రాసెనే! ఏమిదింత! దర్భంగా మహారాజావారు అటువంటి సంబంధము లేమియు నుంచుకొనరే! ఒకవేళ ద్రోహి చమత్కారం చేసి శ్రీమహారాజావారి కార్ నెంబరు వేసియున్నాడేమో, తనకార్‌నకు కూడాను! ఏంతెంత పనైనా చేయ్యగలడు!

'ఏమిరా కాకుంటే తానే నూపరింటెండెంటయి నాచేతనే అరీందమ్‌ను అరెస్టు చేయించినాడే. లాల్ గారి గదికి క్రైమ్ లాక్ వేసి, తానే స్వయం వచ్చినీని, అరిందమ్ చేతనే ఆత్మాశ్రము తీయించి, ఈ ఘనమైన ఆలోచన చేసిన అరీందమ్ బాబునే, ఆగదిలోనే లాల్‌చంద్ చేత రాంగ్‌ఫుల్ కన్‌ఫైన్‌మెంట్ చేయించినాడే! సౌండర్ వహాయంతో జోగన్ తంతి మని య్యార్డరు పంపి అరీందమ్‌ను భ్రమపెట్టి అల్లర పెట్టినాడే! ఇంత కూలన్న పనులూ చేసినవాడు ఒకడో, యిద్దరో, యిప్పటికిని తెల్లియ దాయెను ఇందులో వాడు గడుగుచకును, అరీందమ్‌నే బాధించు చున్నాడు. ఏదో అరీందమ్ మీాద ప్రత్యేకముగా క్రోధముతో పని చేయుచున్నట్లే, తోచుచున్నది.' అని వితర్కించుచు పోలీసు స్టేషనుగూర్చి పోవుచుండెను.

---

## పదవ ప్రకరణము

---

### ప్రయాణము

'ఔనమ్మా రెండు మూడు రోజులై కొంచెం జబ్బు తీవ్రంగానే వుంది. మీాకు వుత్తరం కూడా వ్రాసియుంటిరట గదా!'

“ఔను ‘మళ్ళీ ఉత్తరం వస్తే బయలుదేరుదా’ మని బాబుగా రన్నందున ఆగవలసివచ్చినది గాని లేకపోతే అప్పుడే బయలుదేరి వెళ్ళియుందును. ఇంతకీ టైము లేకుండా ఇప్పుడే యీ కబురు కూడావచ్చినది. ఏదీ వ్యవధి! పోనీ అని బయలుదేరుదా మన్నను బాబుగారింట్లో లేరు చెప్పెద మన్నను ఏమి చేయుటకును దోచకున్నది’

‘ఏమమ్మా, ఇందులో చిక్కేమిటుంది మనం పోలీసు స్టేషనువైపే వెళ్ళి, అక్కడ బాబుగారితో చెప్పి, మరీ రైలెక్కుదాము. బయలుదేరితే మిక్కిలి వేగంగానే బయలుదేరాలి నేను వచ్చి అప్పుడే ఒక గంట అయిపోయింది. ఈ పాటికి మీతల్లిగారికి ఏలాగవుండునో! తమరు రాకపోతే వేగం చెప్పండి. నేనైనా వేగం వెళ్ళిపోతాను.

‘అట్టే వేళలేదు. ఇప్పుడప్పుడే 6 గం. 30 మి అయిపోయింది. ఇంకా అరగంట వుంది టైము. ఈ రైలులో బైల్దేరి తీసుకురమ్మనే నన్ను అర్జంటుగా కార్‌లో పంపినారు. మనం రైలుకివెళ్ళి కార్‌ను యిక్కడ కార్‌ఖానాలో వుంచి మిమ్మల్ని తీసుకుని వెళ్ళి, అక్కడ దిగబెట్టి, రేపు నేను వచ్చిగాని, కార్‌ఖానా యేజంటు చేతగాని, మళ్ళీ కార్ తెప్పించుకోవచ్చును అన్నారు.

‘రైలు తప్పిపోయిన యెడల మోటారు మీదనైనా తమరిని తీసుకొని రమ్మన్నారు గాని రైలుమీదైతే వేగంగా

యిల్లు చేరి, మీతల్లిగారి ముఖం చూడవచ్చును గదా అని యింత తొందర పడుచున్నాను గాని మరేంలేదు. చెయ్యి కాలిన తర్వాత ఆకులు పట్టుకొన్నట్లు మనము వెళ్తే లాభం లేదు. ఇట్టి సందర్భములో అరిందమ్ బాబుగారు మాత్రం వద్దంటారా? పై పెచ్చు ఆయనవచ్చేవరికీ మీరు యిక్కడ వుంటే చీవాట్లు పెడ్తారు కూడాను. అందుచేత వేళ మించి పోకుండా బయల్దేరండి తోవలో స్టేషన్‌లో చెప్పి మరీ వెళ్దాం— మరి బయల్దేరండి' అని ఆతురముమెయి నాక్రొత్తగా కార్ తీసుకునివచ్చినవా డనెను.

'మనం బయల్దేరి వెళ్ళేసరికి అమ్మగారు, ఖులాసాగా వుండాలని దేవుణ్ని ప్రార్థిస్తున్నాను.

'సరోజినీ! నేను, చాల దుస్థితిలోనున్న మీ అమ్మమ్మను చూచుటకు యీ రైలులో వెళ్లుచున్నాను. తోవలో మీ బాబయ్యగారగుపించేయెడల కలుసుకుని చెప్పి మరీ వెళ్తాను. నీవు యింటివద్ద భద్రముగా ఉండు. స్థితిగతులు వెంటనే టెలిగ్రాము చేస్తాను. నౌకర్లుంటారు. మీ బాబయ్యగారుకూడా వేగమే యింటికివస్తారు. అమ్మమ్మకు ఒంట్లో మిక్కిలి బాగు లేని కారణము చేత, తాతగారు కార్ పంపగా నేను వెళ్ళినా నని చెప్పు' అని చెప్పుచు, అనారోగ్యురాలుగా నున్న తన తల్లిగారిని జూడ శ్రీనగరమునకు ప్రయాణసన్నాహముతో

కారు నెక్కి, 'ముందుగా స్టేషను వైపు పోనియ్యి' అని స్వర్ణ మయి యనెను.

కార్ నడచుచున్నది.

* * *

కార్ పరుగిడు చున్నది.

* * *

చాలదూర మేగినది.

ఏమి నడకయని వ్రాయను! చప్పుడు లేదు! కారు ప్రక్కనే నడచుచున్న వాని కైనను, కారును చూచువరకును, కారు వచ్చుచున్న దనే తెలియదు.

ఈ కారు యొక్క పథమును, పరమావధియును మన కును దెలిసికొనవలసినంత యవసరము లేకపోయి యుండును; గాని అందులో మన స్వర్ణమయి యున్న దే: కనుక మనమును, ఆ కారు ననుసరించి పోయి చూతుము గాక!

తిరిగి తిరిగి చాల యాలస్య మైనది. స్టేషనును సమీపించి, బాబుగారిని గూర్చి తెలుసుకొని, ఆయన స్టేషనులో లేకుండుటం జేసి ఆ డ్రైవరు స్వర్ణమయితో—

'అమ్మా! బాబుగారు ఠాణాలో లేరు. ఏదో పని మీద వెళ్ళియుంటారని ఠాణాలో వాళ్ళు చెప్పినారు. మనకు రైలువేళ అయిపోవు చున్నది. రైలుకి మనం వెళ్ళిపోతేనే మంచిది. త్రోవలో చాలమంది బాబుగార్ని యెరిగిన వాళ్ళు

మనకి కలుస్తారు. ఎవరితో చెప్పినా సరిపోతుంది. అన్నట్టు, రైలు స్టేషన్ మేష్టరుతో చెప్పినా సరిపోతుంది. బాబుగారికి మీ కబురే అందక పోతుందేమో అని సంశయించ నక్కర లేదు. కావలిస్తే ఉత్తరం ఒకటి బాబుగారి పేర వ్రాయండి. అది అందజేయించేపూచీ నాది. ఏమంటారు?' అని యనెను.

'అనడాని కేమున్నది? అన్నీ బాగానే ఉన్నాయి. కబురు చెప్పడానికి కూడా వీలు లేక పోయిందే' అని యని, మఱియు స్వర్ణమయి తన మనమున, 'అన్నా, యెంతపని. ఈలాగున నెందుకు సంఘటనపడినదో; దైవేచ్ఛ యెటులనున్నదో; ఏల నీవార్త బాబుగారు లేనిసమయమున వచ్చినదో; ఇంకేమి జరుగనై యున్నదో' యని తపించుచున్న కారులో వితర్కించుకొను చుండెను. క్షణకాలములో రైలు స్టేషను సమీపింప, వీ రిరువురు నట దిగి, చూచుసరి కదివరకే రైలు వచ్చియుండుటచే డ్రైవరు తొందరపడి, 'అమ్మా! బండి వచ్చింది. టిక్కెట్టు పట్టుకుని, ఈ కాగితము యిక్కడనే వున్న ఖార్ఖానా యేజంటుకు వప్పగించి, వస్తున్నా' నని చెప్పి పోయి, మఱల క్షణకాలములో స్వర్ణమయిని గలసికొని ప్లాట్‌ఫారముకుబోయి, మంచిసహాయమున్న (పెట్టె) బండిలోనెక్కించి, 'అమ్మా! బాబుగారికి వుత్తరం వ్రాశారా?' అని యడిగెను.

'లేదు; కలమూ, కాగితమూ? ఇంతకును ట్రై మేదీ?'

'పోనీ, స్టేషను మేష్టరుతో ఈసంగతి బాబుగారికి తెలియజెయ్యమని చెప్పిస్తాను. మీరు బండిలోనే కూర్చోండి;

టిక్కెట్లు నాదగ్గరే వున్నవి. నేను వచ్చేలోగా బెల్ కొట్టేస్తే మరో ప్లైటులో నైనా యెక్కిపోతాను. మీరేం భయపడ క్కరలేదు' అని చెప్పి, స్వర్ణమయి చూచుచుండగనే తాను స్టేషన్ మాష్టరు ఆఫీసు గదివైపు వెళ్ళెను.

వేళ యయినది. మొదటి గంట యిదివరకే కొట్టినారు రెండవ గంటయు నైనది. గ్రామాంతరము, దేశాంతరము పనుల మీద, బంధు దర్శనార్థము పోవుచున్న వారిని అంప కము బెట్టువారును, 'అక్కడ చేరగనే, ఒక కార్డువ్రాయు' మను వారును, 'మరల నెన్ని దినాలకో!' యను వారును నైయుండ, 'జాగ్రత, దూరముగ నుండు' డను పోలీసువారి యడావిడులును, రైలువారి అధికారపు అగవులును, ప్రయాణీ కుల కేకలు, ఆందోళనలును, హెచ్చుపెరగియున్నవి. నరి రైలు పెద్దయరపరచి, కదలుచున్నది. ప్లాట్ ఫారముపూర్తిగ దాటునరికే రైలువడి హెచ్చినది. 'డాక్ గాడీ' గనుక, మిక్కిలి వేగముగ పోవుచుండెను బండిలోనున్న వారికి స్టేషనుగాని, స్టేషనులో నున్నవారుగాని మఱి కానరాలేదు.

---

## పదకొండవ ప్రకరణము

---

### జయము

దర్భంగా మహారాజావారి కారును పరీక్షించి, దాని నెంబరు తెలుసుకుని, తర్క వితర్కములతో, తానాను నమీా

ధించిన సర్కిల్ ఇన్‌స్పెక్టరున కెదురుగ నొక కార్, దాని వెనుక నింకొక కార్, పోలీసు జవానులును మరికొందరును గూర్చుండ ఠాణా సింహద్వారము కడ నిలుపజూచి, 'ఏమిది' యని, యేమియు దోపక జూచుచుండ నందొక కారునుండి అరిందమ్ బాబుగారును, ఇరువురు ఠాణేదారులును, చేతులకు బేడీలు వేయబడిన యొక స్థూలకాయుడును దిగిరి.

మనకు అరిందమ్ చిరపరిచితుడే. సబ్ యిన్‌స్పెక్టరు మంగళ్సేన్ కూడా జుమేలియాంచరిత్ర గల 'నేనే' యను గ్రంథమూలమున పరిచితుడే. మరియొక సబ్‌యిన్‌స్పెక్టరు బ్రాకేట్. ఇతనిని కూడ మన మీగ్రంథమున నిప్పటికి కెరిగియే యున్నాము గదా! కనుక నిక నీ కారునుండి దిగిన వారలలో మన మెరుగని వాడొక్కడే.

ఈతడు స్ఫురద్రూపి యయ్యును, భీకరాకారుడు, అదిగో, చూడుడు! ఆకర్ణాంతమును విస్తరించిన వయ్యును, నడుమ యుగము క్రూరదృష్టుల వెలువరచుచున్నవి. తీర్చినట్టులున్నను, కనుబొమ లాతని వసూన్నతుజాటుచున్నవి. గండఫలకములును, ఫాలభాగంబును సంపూర్ణంబు లయ్యును, కష్టములతో కాలము గడపిన గరిడీ మచ్చును ననుకరించుచున్నవి. వక్షపీఠమును, మల్చివేసి నట్టులున్న యూరువులును, తిరిగి యున్న జబ్బలును, వస్తాదులలో జేరిన వానిం బోలియున్నవి. ఊర్ధ్వ అధోభాగములు శాస్త్రోక్తముగ విభజించి సృష్టింప

బడిన యీతడు, చూపరకు నేత్రపర్వమయ్యెను, తన రెండు చేతులకును బేడీలు తగిలించి యుండుటం జేసి మిక్కుటముగ భయము నాపాదించు చుండెను.

కార్‌నుండి దిగిన అరీందమ్‌ను చూచి, "అలో! ఎక్కడ నుండి? ఇదంతా యేమిటి, ఈత డెవడు?" అను ప్రశ్నలు సర్కిల్ ఇన్‌స్పెక్టరు దొంతర దొంతరలుగా నడుగ జొచ్చెను.

'అయితే, మం గ్రంథకర్తేనా యేమిటి ఈ మహాను భావుడు?'

'అలాగే......అనుకుంటున్నాను'

అందరును ఠాణాలో ప్రవేశించిరి. చేతులకు బేడీలు వేయబడిన వానిని స్టేషనులో ఇనుపగజముల తలుపులుగల గది లోనికి ద్రోవ జూప, 'ఘనజ్వాలనజ్వాలకరాళమైన యొక నిశ్వాసంబు గావించి' ఠాణాలోపల చావడినుండి యీ యినుప గజముల గదిలోనికిపోవు నేలగచ్చు అదరుచుండ, నడచుచు, బుర్ర తటాయించుచు నందు ప్రవేశించెను రాత్రిసుమారు గం 7-30 ని॥కు దాటి యుండును.

'ఈ రాత్రి యంతయు సీతని సిరిమూండులో నుంచి, కావలసిన ఆహార సదుపాయముచేసి, జాగ్రత్తగా చూచుచుం డవలెను. ఠాణాలో యెక్ట్స్ట్రాడ్యూటీ వేసి మరికొంత మందిని వాచ్ వుంచండి. నేను తిరిగీ తెల్లవారేసరికి యిక్కడే వుంటాను.' అని అరీందమ్ అనుచుండగనే 'ఆఁ—అఁ—ఏమండో?

అయ్యా, మీ అందరిలాగా బజారు వస్తువులు తీసవలసిన వాడను గాను; స్నానం లేనిదే నోట్లో యేమిన్నీ వేసుకోను; మీవల్ల అపవిత్రుడ నైనాను, నేను సచేలస్నానము చెయ్యానిదే, ధ్యానం చేసుకోకుండా, ఏమిటిప్పుడు అంతకొంప మునిగి పోయిందని, మీ రిచ్చే దేదో యింత తిని, ఈ వొక్క రాత్రికీ ఏం పడిపోయింది? ఒక్కనాటి భాగోతానికి మీసం గొరిగించుకున్నట్లు!' అని యీ భీకరాకృతి శారద మేఘ గర్జనస్ఫురణం బలికెను.

అరిందమ్ చిరునవ్వు నవ్వుచు. 'సరే' యని సర్కిల్ ఇన్‌స్పెక్టరుగారిని పిలచి, యాయన చెవిలో నేమో చెప్పి, స్వగృహోన్ముఖుడై వెడలెను.

---

## పండ్రెండవ ప్రకరణము

---

### ఏ మి ది !

చల్లని మలయమారుతము తన యాయాసమునపనయింప, దినమెల్ల దేహపరిశ్రమచే దుర్బలతరమై, మనో పరిశ్రమచే దుర్బలతమమైన తన శరీరము, బట్ట పేలికలవలె యూగులాడు చున్న కాళ్ళపై నటునిటు యూగుచుండ, చేతనొక విలాస దండము బూని అరిందమ్ నడచుచుండ, త్రోవలో నొకం

ఎదురుగ వచ్చి, 'అయ్యా, తమ కొరకు పండిట్ త్రివిక్రమ రావుగారు, ఒక యినుప పెండపము, (ఐరన్ సేఫ్) పంపినా మనిన్నీ, దాని రైలు ప్యాను మీకు అందచేయు మనిన్నీ, రేపే డెలివరీ తీసుకొనవలసిన రైలుఛార్జీ నా దగ్గిడ చెల్లించితి మనిన్నీ, చెప్పుమన్నారు.' అని చెప్పెను.

సంతోషమే—నీ వెవరు?'

'నేను నాగపూర్‌లో నొక వర్తకుడను. త్రివిక్రమరావు గారిని బాగా తెలిసిన వాడను.'

'నీ వెప్పు డీ యూరు వచ్చినావు?'

'సాయంత్రం గం ?-లకి ల బండిలో వచ్చినాను.

'మా యింటికి వచ్చెదవా? భోజన నదుపాయము చేయించెదను.'

'చిత్తము. అక్కర లేదండి. నేను రైలు దిగగానే స్టేషను దగ్గరనే యున్న హోటేలులో భోజనం చేసుకుని మరీ వచ్చినాను. తమరు ఆదరించినారు; అంతే చాలును.' అనుచు రైలుప్యాసాయన కిచ్చి యాతడు తన త్రోవను బోయెను.

* * * * *

అరిందమ్ తన యిల్లు సమీపించుచు 'ఈ వొక్క రాత్రికే యేం మునిగిపోయింది—' అన్నాడే—అర్థం లేని మాట ఒక్కటైనా ఆడడే! ఈమాటయొక్క తాత్పర్యం యేమై యుంటుందో! ఏదైనా అఘాంతరము చేయునా? ఏమి

చేయుటకైనను, ఆతని చేతుల నేమియు లేకుండ జూచి, మరీ గదిలోనికి పంపినామే—అయినను, తగిన కట్టుబాట్లు చేసి చెప్పవలసిన సంగతు లన్నియు సర్కిల్ ఇన్‌స్పెక్టరు గారితో చెప్పి, మరీ వచ్చినానే,' అని యనుకొనుచు స్వగృహము జేరునరికి, వీధిగుమ్మమువద్దనే కనిపెట్టుకుని నిలచి, తన తండ్రి కొర కెదురు జూచుచున్న సరోజని అరిందమ్ బాబుగారిని చూచి, 'బాబా, 'అమ్మగారు మీా కగుపించినారా?'

'ఏమీా, స్వర్ణమయినేమీ! ఇంట్లో లేదూ? ఎక్కడికి వెళ్ళినది?'

'అమ్మమ్మగారికి చాలా జబ్బుగా నున్నదని, తక్షణం రమ్మని, తాతగారు కార్ పంపినారు. అమ్మ వెళ్ళింది; మీా రింట్లో లేనందున, స్టేషను వైపు వెళ్ళి, మీాతో చెప్పి మరీ వెళ్లానని చెప్పింది. మిమ్మల్ని కలియలేదా?' అని యడుగ, నరి బాబుగారికి మరి చైతన్యములేదు. ద్రోహిని పట్టగలిగితిని గదా యను తృప్తియును మరిలేదు. ఏది లేకున్నను మానెగాని పాపము, నోట మాట మాత్రము మరిలేదు. మరి లోపలికి వెళ్ళలేదు. వెళ్ళక నటనే నిలచి, తుదకు విషణ్ణవదనుడై, దేహ మనోపరిశ్రమలచే చెప్పరాని దౌర్బల్యము నొందిన యాతనికి, 'వరుఘలు గారికే పరీక్ష' యనునట్లయినది గాబోలు. తన యాతనను దీరిచికొన, తన యిల్లు సేరబోవ, నిదీ శుభవార్త యెట్టిటులనో, లోనికి బోయి సరోజనిని జేరదీసికొని, తన

మంచముపై గూరుచుండి, కొంతదనుక నేమియు మాటాడక, తుదకు, 'అమ్మా, మీతాతగారిపేర ఉత్తరము యిచ్చి చూచెదను.' అనెను.

'ఎందుకండీ, బాబా, తోవలో మీతో చెప్పలేదా?'

'చెప్పకున్న మానెగాని, నాకు గానవచ్చినచో సంతవరకును రానిత్తునా? ఇంతకును వాడు నాకగుపించ నిచ్చునా? అయ్యో! వట్టిభ్రమ.' యని తన మానసమున ననుకొనుచు సరోజనితో, 'నాతో చెప్పలేదు. తాను మీతాతగారిదగ్గరకు వెళ్ళనూ లేదు.' యని యాత డనెను.

'అదేమిటి-బాబా, అలాగంటున్నారు? ఎప్పుడున్నూ అనుమానం మాటలే అంటారు. రైలు వేళ అయిపోయి వుంటుంది. మీతో చెప్పుటకు వీలులేక తొందరలో వెళ్ళిపోయి యుంటుంది. ఇంత మాత్రానికి మీకు సంశయ మెందుకు?' అని సరోజని, ప్రశ్నించెను.

'అమ్మా. నీకు మంచిచెడ్డలు తెలియవు నీకు కనపడ్డవి నీవు విన్నవి, అన్నీ నిజమే యనియనుకొను చుందువు.'

'ఏమండీ—బాబా, యిందులో అబద్ధంగాని అనుమానంగాని, యేముంది?'

'అయ్యో! అమ్మా అంతా అబద్ధమే అయివుండాలి. ఏదినీ నమ్మలేము. ఇప్పుడు అన్నీ చిక్కులున్నూ, ఆపద లున్నూ, తటస్థించుచున్నవి. అన్నీ ప్రమాదములే!'

'బాబా, మీ మాటలే నాకు అర్థం కాలేదు. నాకేమీ బోధపడలేదు. ఆ మంచిచెడ్డలు మీకే తెలియాలి—' అని సరోజని యనెను, మిన్నకుండెను. అరిందమ్‌యును కొంత తడ పూరకుండి గడియారము చూచి, చివాలున లేచి, 'అమ్మా, నీవు భోజనము చేసినావా?' యని సరోజని దెస జూచి, యాతురముగ బ్రశ్నించెను

'లేదు.'

'అయ్యో. ఏమమ్మా, పదిగంటల వరకును భోజనమే లేక పోవుట?'

'ఏదీ—సాయంత్రం దీపాలు పెట్టే ముందరే అమ్మ వూరికి వెళ్ళింది ఆతర్వాత ఇప్పుడే వస్తానో, అప్పుడే వస్తారో మీరని కనిపెట్టుకుని ఉండగా, ఉండగా యిప్పుడు మీరు తెచ్చి కొండంత అనుమానం పెట్టినారు భోజనం చేసినతర్వాత తాత గారికి టెలిగ్రాము యివ్వడమో, యేదో, ఆలోచించ వచ్చును ముందుగా భోజనానికి లేస్తే బాగుంటుంది.'

భోజనాపేక్ష లేకపోయినను, తాను మానినచో, సరోజనికూడ భోజనము మానును నను భీతిచేత 'సరే' యని అరిందమ్ లేచి, స్నానము చేసి, భోజనము చేసి, తామరాకుపై నీటి బొట్టు వడువున, నిలుకడలేని మనస్సుతో, ఏమిచేయుట కును దోపక, తన టెలిఫూన్ యంత్రముదరి జేరి, గంటకొట్టి, యిటు మాట్లాడెను—

'అలో, ఆఁ—ఎవరది? నీవా! సరే—స్టేషనులో—స్టేషనులో అంతా సరిగా నున్నదా? ఆఁ—సరే—నా కొక ఆర్డర్లీ కాన్‌స్టేబిల్—ఆఁ—ఆర్డర్లీ ఔను ఆఁ—తక్షణం కావలెను—ఆఁ—ఔను. త్వరగానే పంపవలెను—ఔను—త్వరగానే.—సైకిల్ కాన్‌స్టేబిలే రావలెను—ఆఁ—'

మరల దన చాపుడుకుర్చీపై గూరుచుండెను. కొంచెము సేపటిలోనే సైకిలుపై 178 నెంబరుగల జవాను వచ్చి, అరిందమ్ బాబుగారికి సలాం మొనర్చి నిలువ, 'నీవా! సరే' అని బాబుగారును లేచి, ఒక కాగితముపై నేమేమో వ్రాసి, ఈ అర్జంటు టెలిగ్రాము పట్టుకుని, టెలిగ్రాఫ్ ఆఫీసుకు త్వరగా వెళ్ళి యిచ్చి, నీ యెదుటనే టెలిగ్రామును పంపజేసి లేటుఫీజు కూడా యిచ్చి, రసీదు పట్టుకుని రా,' యని చెప్పి కొంత సొమ్ము కూడా యిచ్చి, వానిని పంపివేసి, తా నేమో తల పోయుచుండెను. పాప మాతనికి నిదురపట్టదు. తన పడకపై నెంతో దొర్లుచున్నాడు—దీర్ఘోచ్ఛ్వాసములు దీయుచున్నాడు—కూరుచుండును—నిలచును—మరల బండుకొనును—మరియు గూరుచుండును. చాల ద్రాత్రియైనది మరి కొంత సేపటికి కా టెలిగ్రాఫ్ ఆఫీసుకు పోయియుండిన బంట్రోతు రసీదు దీసికొనిరా నది యందుకుని, తెచ్చినవాని నంపివేసి, మరల యథారీతిని బరుండి యనవస్థతతో గాలము బుచ్చుచుండెను.

స్వర్ణమయి యింట లేదనియు, తన తల్లిగారికి నవా రోగ్యముగా నుంట నాయన గబురంప, దా నట కరిగె నని తెలిసిన తోడనకన్న, నిముస నిముసమునకును, తన మానసన సంద్రమున తరంగములం బోలె, నెట్టి యూహా లుద్భవిల్లు చున్నవోగాని, ఆందోళన, అనుమానము, అస్వస్థత, అసౌ ఖ్యమును, నపరిమితముగ, దీసినకొలదిని నూత నీరూరు చందాన, గలుగుచుండె గాలపరిమితియైన నెరుంగక, మిగుల వేధింపబడుచుండ, మరికొంత సేపటికి నొక తంతివార్తావాహు డొక టెల్గ్రామును దీసికొని, అరిందమ్‌గారి యింటికివచ్చి, పిలచి యాయనకు టెల్గ్రాము నందిచ్చి, రసీదుపై నంతకము జేయించుకొని వెడలిపోయెను.



అరిందమ్‌యును, యెంతో యాతురతతో నా వార్తం జదువుకొని, దీర్ఘోచ్ఛ్వాసము దీసి, తనయొడల్గంపింప మింట గాంచి, మంటంబడిన వాడుం బోలె, తహతహం పడి, వేదనం జిక్కి, సరోజనిని సమీపించి, యయ్యెడను నిదుర లేపబోయియు నటులు నేలొకో జేయక, మరల తన యథా స్థానము జేరి, యున్నదని, పూర్వ దిగ్భాగము నవలోకించి, చింతించి, యిటునటు దిరుగుచు, గూరుచుండుచు, లేచుచు, మరల గూరుచుండుచు, నొడ దెలియని వంత నందుచు:—

'హా రా! ఎంతపని జేసితివి! నే నా నాడు తెమిజుద్దీన్ కుమార్తెయగు గుల్‌సుమ్‌చేత మిగులఁబ్రేమింపబడుచుండిన

బసదుహీంన్ కుమారుడగు సిరాజ్‌హీంన్‌అను నాతడు నీ యధికారము క్రింద ఫ్రూల్‌సాహేబుచేత నక్రమమై, పద్ధతులకు విరుద్ధమై, ప్రాణాపాయకరమై, యుండు ఖైదులో నుండగా దప్పించి, శుభ ముహూర్తమున గుల్‌నుమ్ సిరాజ్‌హీంన్‌లకు వివాహ మొనర్చి, నీకు దక్కకుండ జేసితిని గదా యను నీర్ష్య వహించి, స్వర్ణమయిని, నానుండి, వేరుపరచి, నన్ను సాధింప నెంచితివి గా! పాప మామెబల నీ కేమి యెగ్గుచేసినది? నావన్నె గడలకు తీసిపోతి వనుటకు నిది యొక తార్కాణముగాదా? ఇది నీ బహద్దూరీకి లోపముగాదా! కానిమ్ము ఇట్టిఈర్ష్యలతో పని చేసి, నీ పై తికాలము జయప్రదముగ నుపద్రవముల నంఘటింప జేయగలవు? అయ్యో! నా జేయు కార్యము లన్నియు నీ చేతులకు బ్రతిహతములే సుమా!

‘ఐనను, నా చేతులకు నీవును బ్రతిహతములు సేయక పోలేదు. కాని నేన బ్రదికి యుండితివా, నన్ను బ్రతారింప నీ తరముగాదు సుమా! ఏమో భ్రమపడు చున్నావుగాబోలు!’

‘మఱియు, నీ శిష్యుల మని చెప్పుచు దిరుగుచుండిన, జమీందారు ఫ్రూల్‌సాహేబులను అంతరింప జేసితిని గదా యను చింత నిన్ను బాధించుచున్నదా! లేక (మాగురువు) గారు అజేయులుసుమా!’ యను జముల వాక్యముల దృఢీకరింప నెత్నించుచుంటివా? ఊఁ—మాటదగాక. నీవు నీవుగా నాకంట బడితివా, నిన్నొకచో గూరుచుండజేసి నీతియు,

పాపభీతియు, బోధింప వలెనని మాత్రము నా కెంతేని గోరిక గలదు.

'ఫూల్ సాహేబును బట్టి తెచ్చినపు డాతనిచే నెన్నెన్నో విధముల విధ్వంసము కాబడిన జీవితము గల మోహినిచే మృతుడౌట, నాతనికి యుత్తమ జీవనమును బోధించుమన్నను అవకాశము చిక్కలేదు.

మఱియు, తన సౌందర్యమునకును, తన తెలివి తేటలకును, తగనిచర్యలు గలిగి, దేవీపూర్ ఎస్టేటులో దివాన్‌గిరీ చెలాయించుచుండిన భానోజీ యనియు, భవానీపూర్, పద్మాబాయి విషయములలో, బోటుహౌసులో నాటకమాడించిన యేలినవాడై, బోటుహౌసులో మాటలాడు చున్నపుడు నేను పెంకెమాట లాడ, విషవాయువులతో నిండియున్న గోరి లోనికి, మీట నొక్కి నన్ను త్రోసివేసిన ప్రభువయి మఱియు నింక నెన్నెన్నియో యయి, తుదకు ఎలెక్ట్రిక్ స్ప్రింగులచే యోగినిగా నాచే బంధింపబడిన జమీందారుకు గూడ తా భీష్ముని యవతారమనియు, దా స్వచ్ఛందమరణము నొంద, దన యూపిరుల బాయుచున్నా ననియు, నాతో జెప్పుచుండ, 'వల' దని యెంతజెప్పినను వినక, యుత్తమజీవనమును, సత్ప్రవర్తనమును బోధింతు మన్నను, వీలు చిక్కనీయకయే, ప్రాణముల బాసెను.

'వారిధుపురమును గురువవు నీ వని వానివలననే ప్రత్యక్షముగ వినియుంటిని గాన నీ వొకతూరి నాకంట బడితివా, నిన్ను శిక్షింపకయే, నీయుక్తులకు మన్నించి, నీకు సన్మార్గవర్తన మలవరచికొన నేర్పువలె నను నా ప్రయత్నమున కిపుడైన దోడ్పడరాదా! ఇంకేల! నీ ప్రతాపమునకును, నా ప్రజ్ఞకును మాత్రమే యుద్ధము! నీ యూహలకును, నా పోహలకును మాత్రమే సమరము!! నా ప్రయత్నములకును, నీ ప్రతిభకును మాత్రమే సంగరము!!! ఏదియెట్లున్నను, 'నీవా; నేనా గెలుపొందవలసినది?' అను ప్రశ్నయే మిగిలియున్నది.' అని అరిందమ్ వితర్కించుచుండెను.

* * * * *

ఓ అరిందమ్, ఇంతవంత నీకేల గలిగినది? ఇంటికి వచ్చుచున్నప్పటికి స్వర్ణమయియింట లేదనియు, తన తల్లికి జబ్బుగానున్నదని యామెను బిలువ వచ్చినవానితో, మోటారులో రైలుకు బోయినదనియు దెలిసినప్పటికంటెను, యెక్కువగా తహతహం బడుచున్నావదేమి? ఇపుడిపుడే వచ్చిచేరిన తంతివార్త నీ విచారమపనయించుటకు మారది మరింత కలత పెట్టెనదా యేమి? ఏదీ, ఆకాగిత మిటు దెమ్మా, మేమును చదివి బోధించుకొని, నీ దుఃఖమునకు దగినంత కారణమున్నదో లేదో, చూచెదము. బహు మేధాశాలివౌ నీకే ఆ తంతివార్త యింత యశాంతి గలిగించినయెడల, మేముమాత్రమా తంతి జూచి యేమిచేయగలము? ఐనను, నీతోపాటు మేమును

సుఖదుఃఖములఁ బొందుచున్నాము గనుక, మేమును ఆ తంతి జూడదగినవారిమే. మానవులకు పరవిమర్శ (పరామరిక పరామర్శ) లవలన తమ కొకింత శాంతి కలుగుట సహజముగదా. అందుకొరకైన నిమ్ము కానిచో, నిన్ననుసరించి, నీ కష్టపరంపరల మేమే యనుభవించుచున్నటుల బాధితుల మగుచున్నాము గనుక, మేమా తంతిని జూడనిచో, నీ ముందడుగుల మే మెటుల ననుసరింపగలము?........................

ఏమీ, మమ్మాతంతిం జూడనీయకయే, వైరివానిం బలె మింట జూచుచు, నీలో నీవేమేమో యనుకొనుచు తొందరగా నెటు బోవుచున్నావు? మేము నిన్ననుసరింపరాదని యెంచియా యేమి, మా పలుకుల విననైన వినక, శిరము వ్రాల్చి, పోవుచున్నావు? ఇంత నొంటరిగ నున్న పాప మీనరోజని నేరికి ఒప్పగించి పోవుచున్నావు? పూల్ సాహేబు కాలమునాటి నుండియు నిన్ననుసరించి, నీ బుద్ధి చాతుర్యమున కెంతేని యానందించుచు, నీకు మనోవేదన కలిగినవు డెల్ల నీతోపాటు క్లేశముల ననుభవించుచు, నీకు నిదుర పట్టనప్పుడు, మాకును నిద్రపట్టక, నీవు తొందరపడి ద్రోహుల పట్టుటకు నొంటరిగ సాహసించి పోయినపు డెల్ల నీవెంట నంటి వచ్చుచు బోవుచు, నీసుఖదుఃఖములతో పాల్గొనిన మమ్మిట్లు డించి పోవుచున్నను, మేము మాత్ర మోర్చి యిట నుండగలమా? పొమ్ము—పొమ్ము. ఇదో! మేమును నీ వెంట నంటియే వచ్చుచున్నాము. ఏలనన? అనవాయముగా, నవరా

త్రియపుఁ డొంటరివై, తుంటరు లెల్లయెడల దిరుగు నీకాలమున నెక్కడికో, పోవుచున్న నిన్నో యరిందమ్! పూల్‌సాహేబు కాలమున గోరిని యెదిరించినప్పు డొంటరిగ బోయియుంటి వని నిన్నెరిగియున్న మాచదువరులు నిన్ను నిందించిరిసుమా! మఱియు జామాలియాకాలమున నీవానాడా పాడుపడియున్న యింటి కొంటరివై పోయియుంటి వని గూడ మా చదువరు లాడిపోసిరి సుమా! ఇంకను మఱియొక తరుణమున గోరీపూల్ సాహేబులు రహస్యముగ నొక గదిలో సంభాషించుచుండ, పొంచుండి నీ వొంటరిగ వారిని వినుచుంటివట! నిన్నాతరుణమున గూడ నోనాడిరి సుమా. ఇప్పు డేటికొర కొంటరివై పోవుచున్నావో మాకు దుర్భేద్యముగా నున్నది నీ యిష్టము గాని, లోకుల నిందారోపణలకు మాత్రము లోబడిపోకుమా!

'ఇంతకును 'మీ చదువరులు నేను తెంపరితనము జూపితి ననునది నిందగా నెంచి, నన్ను నోనాడిరిగా?' అని యనుచున్నావా? ఔను—అపరాధపరిశోధక కార్యముల మెలంగు నీపట్లను, బహు నేర్పుమెయి వర్తించు ద్రోహుల చేతలపట్ల నెంతేని జాగ్రత బుద్ధికుశలతయు నుండుటలో నేమాత్రమూహామాత్రము చేతనైనను, లోపము గలుగుటగాని, లోపము గలుగుట తప్పదని దోచుటగాని, జరిగినచో నీచర్యం జదువుచు, స్తనశల్య పరీక్షల జేయు మా చదువరులు నిన్నలపాల విడువరు సుమా!

గత్యంతరము లేనప్పుడును, అవసర మని తోచునప్పుడును, స్థితిగతుల ననుసరించి - అపాయకర మని మీకు దోచినను - నా కనపాయకరమును, క్షేమంకరమును నగునని తోచునట్ల నేను నా పనులును, నా మార్గములును సంపూర్ణముగ నెరిగినవాడ నౌటచే, సరియైన రీతినే ముందడుగు వేయుచుందు' నని యందువేని, మాకు వాగ్బంధనము సుమా !

♦ ♦ ♦ ♦

పాఠకులారా, ఈ అరిందమ్ మనతో నేమియు చెప్పక, అడిగినదానికి జవాబైన నొసగనంక, నెక్కడికో పోవుచున్నాడు మన మందరమును గూడ వానివెంట నేగి, యాతఁ డెందు బోవునో, యేమి యొనర్చునో, చూతుముగాక !

ఓహో, యెంత త్వరితగమనుడై పోవుచున్నాడు! నీ వేగముతో ననుగమింపలే కున్నాము. ఓహో! ఎక్కడికో యనుకున్నాము. పోలీసు ఠాణాకేనా? ఏమో—ఎందుకో; అదుగో, అక్కడ పహారా జవానుతో నేమో మాట్లాడు చున్నాడు. మనమును వింద్దుముగాక !

'ఊఁ' యని వాని వందనము నందుకొని, 'ఏరీ! బీటుజవానులు?' అని యరిందమ్ అడిగెను.

'చిత్తం ఇంకా రాలేదు.'

అదో! తన పాచీవాచీ చూచుచున్నాడు. ఆఁ 8 గంట లేనా యయినది. వాచీ చూచిన క్షణము గిఱ్ఱున దిరిగి, వచ్చినత్రోవనే మరలుచున్నాడు.

ఏకొర కిక్కడికి వచ్చినాడో; బీటు జవానుల మాట యడిగి, 'ఇంకను రాలే' దన మాట వినినతోడనే, వాచీ చూచి గృహోన్ముఖు డగుటకు కారణ మేమైయుండునో!

పోలీసు కాన్‌స్టేబిలు—ఎందు కీయన యీలాగు వచ్చి యుంటారో చెప్పగలనా?

పో॥ కా॥ (౨)—బీటు జవానులు సరిగా వస్తున్నారా లేదా అని చూదామని వచ్చియుంటారు. అంతకన్న మరేం వుంది?

పో॥ కా॥ (౧)—మా బాగా పోల్చావే! బీటు జవాన్ల గోష యీయన కెందుకు? అందుకు సబిన్‌స్పెక్టరు లేరా?

పో॥ కా॥ (౨)—అయితే మరేమిటని అంటావు: చెప్ప రాదా?

పో॥కా—౧. చెప్పడాని కేముంది? సాయంత్రం పట్టి తెచ్చిన ఖైదీ వున్నాడుకదూ. వాడు చాలా గట్టివాడనీన్నీ, చాలానేరాలు చేసినాడనీన్నీ, మన ఇన్‌స్పెక్టరుగారు అంటూ వుండగా విన్నాను. ఠాణాలో వాడున్నాడు గనుక మనము జాగ్రత్తగా వున్నామా, లేదా, అని చూదామని వచ్చి ఉంటారు లేకపోతే యిప్పుడు మూడు గంట లైందిగదా! ఇంకా ఒక గంటకుగాని బీటువాళ్ళు రారుగదా: బీటువాళ్ళు వచ్చేవేళ ఈయనకి తెలియదు గనుకనా! బాబుగారు చాలా జాగ్రత్తయిన మనిషి.

ఎప్పుడూ యేదో ఆలోచన చేస్తూనే వుంటారు గదా.

అయ్యో; అరిందమ్, నీ వెందుకో పోలీసు స్టేషనుకు పోయియుంటివి వనుకొని, నీవెంట నూరక మేమును వచ్చియుంటిమి. ప్రత్యూషకాలపు వెలుతురు జూచి, తెల్లవారు వెలుగనుకొని, గడియారము నైన జూచుకొనక, ఏదో పని చేయబోయి గాబోలు, తాణాకు పోయి మరలుచున్నావా! నీ మానసము నింత కలవర పెట్టుచున్నదా తంతివార్త యేనా: యేమో యోచించుచు, చాపుకుర్చీపై గూరుచుంటివి కదా: ఏదీ, ఇకనైన మమ్మా తంతివార్తం జూడనిమ్ము

'స్వర్ణమయి యిక్కడికి రాలేదు. తన తల్లికి జబ్బుయు లేదు. మేము కారునుగాని, మనిషినిగాని, పంపలేదు. నేనును ఆందోళనలో నున్నాను. సంపూర్ణమైన భోగట్టా వివరముగా మాకును దెలియువరకు నేమియు దోచదు. విూ తంతివార్తకు ననుక్షణము నెదురుజూచు చుందును.'

'శివప్ చంద్రసేన్'

ఓహో, ఇట్టివార్తనందిన నీకు మేము దుఃఖోపశమనము చేయగలమా? నీతోపాటు మేమును పరితపించవలసినదే.

గాని, అరిందమ్! అలనాడు ఫూలసాహేబును పట్టుటకు నీవు ప్రయత్నించుచుండిన దినములలో జుమీాలియా ఫూల్‌సాహేబులు ఖయిదునుండి తప్పించుకొనినప్పుడైనను,

మరల వారినే పట్టుటకు నీవా భవనము జొచ్చినప్పుడు వారిరువురు మాయమగునప్పుడైనను, నీ వొంటరిగ ఆనాడు పాడుపడియున్న గృహము జొచ్చి, జమీలియాను పట్టుటకు బోవ, గభీమని గుండము ప్రేలి, జమీలియా మాయమగునప్పుడైనను, షాం బజారులో జమీలియా ముసలిజాని వేషమూని, నీకు ప్రాగు మిషతో, నీవేలు కరచినప్పుడైన యింతవంత సందలేదే !

ఔను—అట్టి విచారములవంటి విచారములు కావివి, స్వాప్నవిషయము. అందునను నిదనతి. మఱియు విశేషించి ద్వితీయకళత్రము ! అన్నియును చిక్కులే సంప్రాప్తించుచున్న దినములు ! అదు గడిన సమయము! అన్నియు సంభవములుగా గానవచ్చు నసంభవములే! ఎంతకని భరించగలవు? స్వర్ణమయి యింటలేదాయెను ! తన తల్లికెంత జబ్బుగా నుండుట యబద్ధమట. ఆమె తండ్రి మోటా రంపుట యంతకన్న నసత్యమట! తనకును మనోవేదన కలిగియున్న దనుచున్న కిషన్‌చంద్రసేన్ గారి కేమని జవాబు నొసంగుట! వయసుమీరిన నీ కాలమున నీకు సహచారిణిగ నుండవలసిన స్వర్ణమయి కానరాకుంట, నీ శేషించిన జీవితకాల మెటులబుత్తువో కదా యో ధీశాలీ ! ఏమో కాని, నీ పూర్వచరిత్ర పూల్‌సాహేబు కాలమునను, జమీలియా పూల్‌సాహేబుల కాలమునను, జమీలియా కాలమునను, నెంతో యానందదాయకముగను, ఉత్సాహ

పూరితముగను నుండె, నేలొకోగాని, యిప్పుడు మిగుల విచా
రమును, అడుగడుగునకు ననుమానమును, నిలుపోవని యధై
ర్యమును గలుగుచున్నవి! ఇందుకు గారణము నీవయ నగునా?
కాజాలదే: మునుపటికంటె బహుమేధావంతవగా యాలోచన
లు సేయవలసినదే! నీ కనుభవము వృద్ధియైనకొలది, మునుపటి
కంటె నేనుమనుగు లధికముగా నేర్పరితనము గానవచ్చు పన్ను
గడలు పన్నవలసినదే! అట్లయ్యెను, నీ కింత చింతలు మాన
ము లేల సమకూరుచున్నవో గదా! బహుశః ద్రోహుల
యెత్తుగడలు నీ పన్నుగడల నణగద్రొక్కుచున్నవా?

ఏమీ! భిన్నాననుండవై, వెలవెల బోవుచున్న నీముఖ
మండలము జూచి, దీపములును వెలవెల బోవుచున్నవా?

దేవుడాపత్పరంపరలనే కలుగజేయడు; మఱియు, సౌ
ఖ్యావళినే యనుభవింపనీయడు. మానవజీవితము సుఖదుఃఖ
మిశ్రితము. కాకయుండినచో, సాయంకాలము వరకును నె
న్నని యిక్కట్టులం బడి, యేదెస బోయెనో, యెన్నెన్ని యు
పాయముల బన్నెనో, యేమేమి జేసి పట్టితెచ్చెనోగాని, ఒక
నేరస్థుని రిమాండుతో నుండి, ఇంటికిబోయి, తన యాయా
సము దీర్చుకొనుచు, తన ప్రేముడి యిల్లాలు స్వర్ణమయితో
తన యుత్సాహము దెల్పవేవేగ రా నింటు, సరోజని గుమ్మ
ము వద్దనే శుభవార్త జెప్పెనే; సరే—పోని తండ్రియింటి కే
గెద నేగెద ననుకొంద మన్న, శివప్ చంద్రసేన్‌గారి తంతి

వార్త యేమి? ఇందువలన పాప మరిందమునకు మనశ్శాంతి సమూలముగ పోయినది గదా!

వైద్యుడు, రక్షకభటశాఖవారు, లోనుగాగల వృత్తులు గలవారు, సర్వసామాన్యముగ పరుల రోగములకును, ఇతరుల యిండ్ల జరిగిన క్రిమినల్ నేరములకును, తాము సహాయులరై, ఎంతెంత కష్టముల నైన పొంది, చికిత్సల జేయుట యందును, నేరముల నిరూపణలయందును, సాహసించి పని చేయగలరు గాని, 'తనవరకూ వస్తే తనువే లేదను' నటుల, తమకే అట్టి యాపదలు కలిగినచో, నేమి జేయవలెనో దెలియక, తహ తహం పడుట సహజమేకదా; అటులనే, ఇపుడరిందమ్ చాల యాందోళనలో నున్నాడే! అల్లదే—వేగుంజుక్క పొడముటయును, ఉషఃకాలపు వెలుగును జూచి, తెల్లవారుచున్నదని యనుకొని, భ్రమపడి, పోలీసు ఠాణాకు బోయి, మరలివచ్చిన అరిందమ్ యొక్క మనోవేదన బోద్రోల వేవేగ నరుదెంచుచున్నాడో యన. సర్వసౌఖ్యసంధాయియు, లోకబాంధవుండును నగు, సూర్యు డంధకారము బోద్రోలి తూరుపుకొండ నధిష్ఠించి, జనుల కెల్ల వెలుతురు నొసంగియు పాపము, అరిందమ్‌నకు మాత్రము ఉదయమున 9 గంట లగు వరకును అంధకారముగనే యుండెను.

తొమ్మిది గంటలు దాటినది, తంతివార్త నొకదానిని దీసికొని తంతి వార్తావహు డొకడు అరిందమును సమీపించి,

తంతివార్త గల కవరు నాయన కొనంగ, నాయనయును దనీ దులో సంతకముచేసి, తంతివార్తను జదువుకొని, యెడతెలి యని యానందముతో, "సరోజనీ, మీ అమ్మ క్షేమముగా తాతగారి యిల్లు జేరినట్లు మీ తాతగారే టెలిగ్రాఫు వేసి నారు. చూచినావా, మీ అమ్మ ఒక్కతే వెళ్ళినట్లున్నా, రమ్మనుమని ఆయన కార్ పంపలేదనికూడా వ్రాసినారు. ఏలా గున్నదో చూచినావా ఎవరో ద్రోహులు చేసిన పన్నాగము సుమా యిది ఇంకొనయము—మరోవూరు, మరోవూరు తీసి కొనిపోయి, అగాధములో దించివెయ్యడమో, నగా నట్రు దోచుకొని, పీక నులిమివెయ్యడమో చేసిన యేమి చెయ్య డము. వాడెవడో యింకా దయదలచినాడు. ఇక్కడికి అదృ ష్టవంతులమే. ఇప్పు డప్పుడే అదృష్టవంతుల మనుటకు వీలు లేదు. ఇది దొంగటెలిగ్రామేమో? చూదాము. వెంటకూడా నెవరూ లేరట. ఆయన పంపిచారని చెప్పి, కార్ తీసుకొని వచ్చినవాడుకూడా తనవెంట వెళ్ళనే లేదట! ఏమి దురంతము!" అని అరిందమ్ తన కుమార్తెయగు సరోజనితో తన యనుమా నము వెల్లడిసేయుచు ననెను.

సరోజని యేమియు మాటాడక, వెడవెడ చూపుల జూచుచు మిన్నకుండెను.

'ఔరా! ఎంతవాడవు!! నేను నీకొరకు వచ్చియుండ నింతలో నెంతలు పోవగజేసితివి! నీవే కాక, నీయనుచరులును

గూడ నీయంతవారై యున్నారుగదా! కాకుండినచో నింత త్వరలో నింతలు పొడచుట యసందర్భము కాదా! కాని నేనింట లేనపుడు నీవు చేసినది దొంగపనిసుమా! నీ బహాద్దూరీకిది లోపమును, కళంకమును దెచ్చుచున్నది. సుమా!' అని యనుచు, తన కుమార్తెవంక దిరిగి, 'సరోజనీ, చాలపొద్దెక్కినది; నేను ఠాణాకు వెళ్ళెదను. నీవు యింట నుండెదవు గనుక జాగ్రత్తసుమా రామకృష్ణ చంద్రను మాత్రము యెక్కడికిని బంపకుమా.' అని చెప్పి, అరిందమ్ బాబుగారు ఠాణాకుబో బయలుదేరి, త్రోవలో నున్న టెలిగ్రాఫు ఆఫీసుకుబోయి, తీరుబాటుచూచుకొని వ్యయముగ దానే వెళ్ళి, తన భార్యయగు స్వర్ణమయిని దీసుకవత్తు ననియు. అంతవరకును నామెను మీయింటనే నుండనీయు డనియు, సరోజని క్షేమముగా నున్న దనియు, జరిగిన మోసమునకును, దురంతములకును విచారించుచున్నా—ననియు, ముక్తసరు మాటలతో, నొక తంతివార్త నంపెను.

ఠాణాలో నంతయు నెమ్మదిగానే యుండెను. నిన్న రాత్రి రిమాండులోనుంచబడిన యాతనిని, ఠాణా ఆవరణలోనేయున్న కొళాయికి స్నానముకొరకు దీసుకపోయి, స్నానానంతరము మరల రిమాండు గదిలోనికి పోలీసు జవానులు దీసికొనిపోవుచుండు సమయమునకు, అరిందమ్ బాబుఠాణా జేరి, కొంచెము వింతదృష్టితో చూచి, లోపలికి బోయి, తన యాన

నమున గూర్చుండి, కొంతసేపు పని చూచుకొని, 'అయ్యా, నేటి సాయంకాలము అయిదుగంటలకు యీముద్దాయియొక్క వాజ్మూలము మనము వుచ్చుకొనవలయును ప్రస్తుతము, ఈరైల్వే రశీదు మీావద్దనే వుంచి, స్టేషనుకు పంపి, ఐరన్ సేఫ్ తెప్పించి, యిక్కడనే వుంచండి ఇందుమీాద నేను సంతకము చేసేవున్నాను దీని రైలుఛార్జి అక్కడనే కట్టియున్నారు.' అని సర్కిల్ ఇన్స్పెక్టరుతో చెప్పి, ఆ రైల్వే రశీదు ఆయనకు యిచ్చి, తాను మరల స్వగృహోన్ముఖుడై వెడలెను

సర్కిల్ ఇన్స్పెక్టరును ఆ రైల్వే రశీదు యిచ్చి యొక జవానుని రైలుస్టేషనునకు పంపి, ఇనుపమందసమును తెప్పించి, పోలీసు స్టేషనులో నారుబయట నుంపించి, పేకేజీ విప్పించి చూడ నందు ప్రశస్తమయిన యినుపమందసము గానవచ్చెను. మఱియు, దాని తాళముకొరకు కొంతవెదకినను, అందు కానరా లేదు తత్క్షణమే ఆసంగతి అరిందమ్ బాబుగారికి తెలియజేయ, నాయనయును, సుమారు నాలుగుగంటల సమయమునకు స్టేషనునకు వచ్చి, ఆ యినుప మందసము చూచి, తన మిత్రుడు పండిట్ త్రివిక్రమ రావుగారి ప్రేమాతిశయమున కెంతేని యానందించి, పెట్టెయొక్క పనివానితనమునకు మెచ్చుకొని, 'అయ్యా, పేకేజి విప్పినప్పుడు బాగా పరిశీలించినారా ? అందులో వేరే పొట్లము గట్టి, తాళము పంపినా రేమో !' యని సర్కిల్ ఇన్స్పెక్టరుగారిని అడుగగా, 'లే' దని వారన విని,

త్రివిక్రమరావుగారి మరవున కొంకింత విసిగి, 'అయ్యా, ఇక బీగపుభాగమునకు భంగము కాకుండ తలుపు దెరచుమార్గం మరిలేదా ?' యని సర్కిల్ ఇన్‌స్పెక్టరుగారిని అడిగి, ఎట్టకేలకు మెకానిక్‌చే తీయించవలెనని తలంప, సర్కిల్ ఇన్‌స్పెక్టరుగారును మెకానిక్‌కి కబురంపి, ఆపెట్టె తాళము విరుగగొట్టకుండ తీయించ నెంతో ప్రయత్నించిరే గాని, యెంతమాత్రమును వీలు కాలేదు సరిగదా, యెందరో మంచి మంచి పనివాండ్రను గూడ తెప్పించి ప్రయత్నించి చూచినను, 'పెట్టెకు భంగమురాదు. గాని బీగపుభాగమునకు మాత్రము కించిత్తు యిబ్బంది కలుగు' నని పెక్కండ్రు చెప్పుటచే సంశయించి, కర్తవ్యము నాలోచించుచు, అరిందమ్ బాబుగారితో 'అయ్యా, ఆయనపేరనే యుత్తరమువ్రాయుడి; వారి జవాబు చూచుకొని, మన మేపనిచేసినా బాగుంటుం' దనుకుంటానన, అరిందమ్ బాబుగారును సరేయనిరి.

ఇంతట నీ సంభాషణ వినుచున్న, ఖైదుగదిలో రిమాండున నున్న, యాతడు లేచి నిలచి, 'అయ్యా, ఎందుకండీ; తాళంకోసం వారిపేర వుత్తరం వ్రాయనక్కరలేదు. పెట్టె పాడుచెయ్యకుండా, తాళం చెడగొట్టకుండా, తియ్యవచ్చు ననుకుంటాను. నన్నొకసారి చూడనిచ్చినచో, నేనును ప్రయత్నం చేస్తాను. ఇదివర కొకసారి యీలాగుననే ఒకరిపెట్టెకు తాళంపోతే తీయవలసివచ్చింది. అప్పుడు నేను తీసి, అయిదు రూపాయిలు బక్షీస్ పుచ్చుకున్నాను.' అని యనెను.

'సరే; యేదీ ప్రయత్నం చెయ్యవచ్చును' అని అరీందమ్ అనుచు, ఆ గది తాళము తీయించి, వానిని బైటకు రమ్మని కొందరు పోలీసువారిని, చుట్టును ఆయుధపాణులై యుండ నియమించి, ఆ యినుపసందుకము కడ కాతని బొమ్మని యని ఆతని ప్రయత్నముల జూచుచు, నిలచియుండిరి.

చాలాసేపు ప్రయత్నము చేసినాడు ఇంకను ప్రయత్నము సేయుచునే యున్నాడు. పెక్కండ్రు చూచుచున్నారు పోలీసు ఠాణా ఆవరణభాగములో నప్పటి కామార్గమున బోవుచుండిన పెక్కండ్రు ఏమోవింతయని చూచుచుండిరి. సాయంత్రము 5 గంటలు సమీపించుచున్న బాగా యెండ యున్నది. చాలా వెలుగున్నది. ఆయుధపాణులై, దండధరులై, అప్రమత్తులై, రక్షకభటు లున్నారు. కనురెప్ప వాల్పక, ఈతడు చేయు నుపాయమే మని చూచుచున్నా డరీందమ్; సర్కిల్ ఇన్‌స్పెక్టరుగారును ఆ పెట్టెయొక్క సాపుమోపులును, దాని చేత యందలి పనివాసితనమును బరిశోధించుచున్నారు బ్రాకేట్, షెల్లాక్, మంగలేసినులు, సర్కిల్ ఇన్‌స్పెక్టరుగారి ప్రక్కనే నిలచి, చూచుచుండిరి. ఇంతేకాక, ఇందరిలోనుండి యీ నేరగాడు తప్పించుకొని పారిపోవునేమో యను సంశయమున గాబోలు, ఏడెనమండుగురు రక్షకభటులు, ఠాణాగేటు వద్ద నాయుధపాణులై, కావలియున్నారు. వారున్నారు. వీరున్నారు, ఇం కెంద రెందరో యున్నారు. ఠాణా ఆవరణలో

నున్న పూలనెత్తావులచే భారమైనదేమో యన, మెల్లన మంద మారుతము వీచుచున్నది

బుర్రను శబ్దమును ఇనుపమందసము మరి లేదు. ఏదీ! ఎందును కానరాదే! అయ్యో, మింటమార్గమున విమానమై విచ్చలవిడి విహరించుచున్నది! ఏదీ — మద్రాయి? ఏదీ? ఇనుప మందసము? ఇనుప మందసము మరి లేదు గాని,

'అమారా ఔరత్ కా చాలక్ దేఖో!

ఏక్ సె ఏక్ జాదా ఉపార్ హై'

అను ధ్వనిమాత్రము గగనమార్గమున వినవచ్చెను

ఔరౌరా! ఎంత దారుణము! ఎంత ఘోరము! ఎంత పన్నాగము! నిన్నేమన గలము? మా పోలీసువారి యజాగ్రత యందుమా? అరిందమ్ మందు డందుమా? ఇందెవరి లోపము? లేక నాతరుసలిగాని పన్నుగడయే ప్రధానమా ఎంతో లయకాని మాటలన మేర్పడబల్కి, మందసము తెలుపు దెంతు నని, ఇపు డెందును గానరాక, దూసి మింట కెగసితివే! తన భార్యయొక్క సాహసమును, సామర్థ్యమును గూడ జూడు మని యధిక్కరించి మరియు నెగిరినావే! నిజముగ వీరిరువురు నొకరిని మించినవా రొక రగుదురు. ఆహా! ఈమె బుద్ధి జాతియు మెచ్చుకొనదగినదియే! అబ్బా! ఎంత వాడవు! సీత లేసి పర్ణశాలం జేసితివే నీ యినుప మందసపు టుముగుభాగమును! ఓహో! ఏమి కల్పనాచాతుర్యము! ఏమి పన్నాగపు చమత్కృతి!

ఏమి ! అరిందమ్, 'ఆకాశం కిం ప్రయోజనం ?' అను నటుల మింటిపైన జూచుచున్నావే ! కళావిహీనమైన మోముతో, వణకుచున్న తనూలతతో, నాందోళనాసాగరమ్మున నీదులాడుచున్న మానసముతో, సుమారు రెండు నిముసములట నిలచి, యేల నంత తొందరగా స్టేషనులోపలికి బోవుచున్నావు ? ఆహా ! ఏమి వింత ! ద్రోహి, తా జేసిన నేదో నేరమున కాతని బట్టి తెచ్చి, రిమాండున నుంచియు నింకను వాఙ్మూల మైన దీసికొన నవకాశము లేకుండగనే, యాతడు మరింత ద్రోహియై, యీ యినుపమందిరమును పవన విమానముగ మార్చినోయున, నం దిమిడియున్న ఏరోప్లేనున నెక్కి గగనమార్గముం దనకు రాజమార్గముగ జేసికొని పోవుచున్న, యాతనిం బట్టుటకు మారుగ, పోలీసు ఠాణాలోనికి బోయి, నీ పెంపుడు పావురమున కేదో దగల్చి, దాని నొక చేతను, రెండవ చేత నొక తుపాకియు నై కొని, స్టేషనునుండి సత్వరము వచ్చి, మింటివిమానమై శరవేగమున బోవుచున్న ఏరోప్లేను దెస దృష్టి సారించి, గురిచేసి, 'ఢా' మ్మని పేల్చి, కాన్‌స్టేబిలును బిలచి, తన కొక విమానము తక్షణము దెమ్మని నియోగించి, మింట జూచుచు తదేకధ్యానమున, నిలచితివేల ?

ఏదీ, విమానము! మరి కానరాదే ! ఎందుబోయెనో గడ! ఆకస మంతయు నిబిడాంధకారబంధురము! గగనమార్గము ధూమావృతము! దుర్గమము! దుర్భేద్యము! దుర్బో

ధ్యము! గూరూహ్వాము' ఏదీ, విమానము! ఆకసమున నెంతో దూరము కాపిరి గ్రమ్మినది. దృక్పథము నగమగోచరము కాకున్నది.

'అయ్యో, అరిందమ్‌బాబూ! ఏమి టది? మీ ఘనతకు దగనిపని జేసినారే!' అనెను సర్కిల్ ఇన్స్పెక్టరుగారు.

'ఊఁ, ఏమి పని జేసినారు? మనిషిని పట్టవలెను గాని, ఇదియా పని?' అనె షైలాక్.

'మరే మున్నది? కథ కంచికి—మనము మన యింటికి; ఇంత తొందరపాటు పని అరిందమ్‌బాబుగారె చేయుదురని, ఒకనాడైన, కలనైన, నుహింపజాల కుంటిమి. ఈపాటి పనికి అరిందమ్‌బాబే కావలెనా? ఈమాత్రము మేము చెయ్యలేకనా! ఏమైనా సరేగాని, అరిందమ్ బాబుగారి బహద్దూరీకి తగనిపని చేసినా'రనె బ్రాకెట్.

'అయ్యో, అరిందమ్ బాబుగారు తొందర పడవలసిన వారు కారు. గాని, ఈ సమయమున తొందర పడినారేమో తెలియదు. ముద్దాయిని రిమాండులో నుంచినపిదప, నీతని శిక్షను గూర్చి ప్రసంగవశమున నే నడుగ, 'తన నేరముల నొప్పికొని, పశ్చాత్తాపము నొందినచో, నీతని శిక్షింపక, నొకచో గూరుచుండజేసి, సత్ప్రవర్తనమును, దైవచింతనమును, బోధించి, పంపివేయుదు' ననిన అరిందమ్, యిపు డిట్టి కార్యము జేయు నని, చిరకాల మీయనతో నెంతో యనుభ

వముగలనే నను కొనజాలను' అని మంగళ్సేన్ వారి మాటల నపవారించెను.

'యూ, టెలిస్కోప్ యిదర్ లావ్' అను నరీందమ్ పలుకు బయట బడుటయు దడవుగ, టెలిస్కోప్, ఆయన హస్తముల నలంకరింప—ఆహా! ఇదియ దర్శనము, ఆయన యాననము చూచితీరవలసినదే గాని, ఏ భాషలోగాని ఏ పండితుడుగాని వర్ణింప దలపెట్టినను, ప్రారంభించినను, మనోభావములు, వస్తునిజతత్వములు యథాస్థితి ననుసరించి, వ్యక్తీకరింప బ్రయత్నించినను, తద్రసనుబోధకశబ్దములు మృగ్యము లౌట తుద కోటము నొందవలసినదే! సత్యమునే వర్ణించవలసి వచ్చినపు డీ భాషా ప్రౌఢిమలు, నీ యలంకార విశేషములు, నీ కవిత్వములుకు నిలువ వని, మరల వ్రాయవలసివచ్చినది.

సర్కిల్ ఇన్‌స్పెక్టర్, షెల్లాక్, బ్రాకెట్ల యూడిపోయు మాటలుగాని, జామీలియాకాలమునుండియు దన నెరిగియున్న మంగల్‌సేనుని స్తుతిపూర్వ కావవాక్యములుగాని, అరీందమ్ బాబుగారి కర్ణపుటముల బడెనో లేదో గాని, యవి యన్నియు, నిద్దురపోయినవాని కాళ్ళకు మ్రొక్కుటలే యయినవి. వీ రెన్ని రీతుల మాటలాడినను, బెల్లముకొట్టిన రాతి రీతి మాటాడడు.

టెలిస్కోపులో ఆకసము దెస దిలకించి, 'ఆ!' యని, తన దగ్గర నున్న మంగళ్సేనున కా టెలిస్కోపు నిచ్చివేసి,

మరల దత్తరమున దుపాకి నెత్త, సర్కిల్ ఇన్‌స్పెక్టరుగారు ఆయన చేయి పట్టికొని, తుపాకి నెత్తనీయకుండ జేయ యత్నింప, అరిందమ్‌బాబుగారు, 'ఊః' యనుచు నాయన చేయి విదలించుకొని, మరల దుపాకి నెత్తి 'ఢా' మ్మని పేలించెను. మరలగానిరి. గాఢతమ మగు నీ పొగ గ్రమ్ముటయు, రెండు సారులు గురిచూచి దుపాకి పేల్చినను, పొగ గ్రమ్ముటయే గాని, పే రొద్దియు గానరాక, అరిందమ్ చేతల నర్థము జేసికొన జాలక, పర్యవసాన మూహించుకొనలేక, అరిందమ్ మాటలాడమి కెంతగా విను గొందక, దా నెటుజూచిన నటు జూచుచు, నేకార్య మొనర్చు మనిస నయ్యాడ యవలీల సేయుచు, తగు సాయ మొనర్చుచు నీతని వింతచేతలకు సమాధానము లడుగ వలె నని, వీరు వేచియుండిరి.

అల్లదే, మరల టెలిస్కోపులో జూచుచున్నా డరిందమ్. రెండుమూడు నిముసము లటుల దిలకించి, యిటు దిరిగి, సర్కిల్ ఇన్‌స్పెక్టరును సంబోధించి, 'అయ్యా, మీరు కోపము వచ్చినది గాబోలు! మీ మాటవినక, మీచేయి విదల్చుకొని తుపాకి పేల్చినందుకు—నేను తొందర పడితి నని యూహించిరి గాబోలు?' అని యనెను.

'అయ్యా. ఇదిగో తెప్పించినా నిదిగో తమ కొరకీ విమానము—' అని యొక కాన్‌స్టేబిలు అన, 'ఔర్ జరూర్ సహీ హై' అని అరిందమ్ బాబుగా రనిరి.

'కాదా, మరి, మీ ఊహ యేమోగాని, మీరు చేసిన పనినిబట్టి, మాకు దోచినది మీతొత్తరపాటే'

'అయ్యో, అటుకా దటు కాదు. ఈ తుపాకి చంపుటకు కాదు. పోవుచుండువానికి దృక్పథము గానరానీయకుండ కావిరి గ్రమ్మించుటే దీనిపని. ఆ ముద్దాయికి ద్రోవ గానరానీయ కుండజేయ బ్రయత్నించితినిగాని, వాడా అసామాన్య చాతురీధురీణుడు; వీని యిల్లాలో, యీతని మించినదే! ఔరా! కాలూరాయివి నీవే యైనచో, నీకు దగినభార్యయే యీమె; నీవు కాలూరాయివి కానిచో, నీమె కాలూరాయికి భార్యగా నుండదగినదియే! ఆహా! ఎంతదూర మాలోచించెనో గాని, చూడుడు: ఈ ముద్దాయి మనచే బడునెడ, యాతడు దప్పించుకొను మార్గము నాతడే యాలోచించుకొను నక్కర లేకుండగనే, యాతని భార్య సృష్టించిన యీ విచిత్ర పవన విమాన గర్భిత మందనము నంపి, యెందుకైనను మంచి దని యెంచి గాబోలు, అందే సెర్చిలైట్ కూడ నుంచినది. అదే! మంటవలె నున్నది!! చూడుడా వెలు' గని యీగాపరి దగ్గిరకొలది పలుచుబడుచున్న ధూమము మధ్యమునుండి యొక వింతకాంతి ప్రసరింపనది జూచి, 'ఉన్న' రను విసుగుదల సూచించు మోముతో, ఆశ్చర్యము దోపజేయు కళతో, ముంగల్నేనున కదివర కందిచ్చిన తన పెంపుడుపావురము నందుకొని, దానికి దగుల్పబడిన, యంత్రమున నొక మీట నొక్కి దాన వెలుగు

రానిచ్చి, ఖేచరమార్గమున బోవుచున్న నా ఏరోప్లేన్ జెన జూపి, యీ పావురమును వదలెను.

ఇది యొక యన్నాగ మగునా? ఏమో; నీవు బహు కుశాగ్రబుద్ధిశాలి వట గదూ!

రిహాండులో నున్న ద్రోహీ, అందరి మధ్యనుండి యె ల్లరును జూచుచునుండ, దప్పించుకొని దివిమార్గమున బోవు చున్నపుడు, అక్కడ పోలీసుముఖ్యుల యొక్కయు, అరీందమ్ యొక్కయు మానసతత్వమును వర్ణించుచు, వారివారి విచార ముల నెల్ల జూచుచు గూరుచుంటిమా, మన మిక నాద్రోహిని బట్ట ప్రయత్నములే సేయనక్కర లేదు.

స్టేషనునుండి వినమితవదనుండై, తన యింటికి అరీందమ్ మరలెను. సత్ప్రవర్తనుడును, దైవభీతి గలవాడును నగు నరీం దమ్ విచారకరమగు నాశము జూచి, దా భరింపజాలకనో యన, దన కరాళిస్మ్రుడుచుకొని, పూర్వభాగమున, మెల్లన, నదె జారుచున్నాడు సూర్యుడు!

అరీందమ్యును దనయిలునేరి, యొకచో గూరుచుండి, 'ఔరా! నీవు కాపీద్రోహివి యని నిర్ధారణ యగువరకును, ఎన్నెన్ని క్రొత్త పేరులతో నీవు వ్యవహరించినను, అన్ని యెడ లను 'కాలూరాయి' యే మూలమని యెంచుచు, నిన్నే సంబోధించక మానజాలను. ఔరౌరా కాలూరాయి! నిన్ను గూర్చి, నేను జమీందారిడియావలన, చాలా సంగతులు వినియే

యున్నాను కాని, అన్నిటికన్నను ముఖ్యమైన మాట, 'కాని మా గురువుగారు అజేయులు సుమా!' అను జమల వాక్యము సార్థకపరచుచున్నావా? నీపట్ల, నీమాట సత్యమైయైనచో, నేను జీవించియుండగా మరి నీయాటలు సాగనీయను సుమా! ఇదియును నీ వెరిగియుండుము. నేను నీజాడ లెటనైనం గనుపట్టు నేమో యని జూడ గొందర బంచితినికాదా! అందున మా చౌధరితో—

'నీవు మాత్రము తొందర పడకుమా! ఆజాగా, ఎలా గుంటుందో, వాళ్ళ చర్య లెలాటివో, మరేమయినా దిమ్మలు అచ్చులు ఉంటాయో లేక సాధారణంగా ఇల్లులా గుంటుందో, అంతా, జాగ్రత్తగా కనుక్కొని రావాలి—మహా జాగ్రత్తగా కనుక్కొని రావాలి—మిక్కిలి జాగ్రత్తతో మెలగాలి సుమా వెళ్ళు' అని కూడా చెప్పి పంపినాను. తిరిగి వాడు నాదగ్గరకు వచ్చి చెప్పిన భోగట్టా నా కేమిన్ని తృప్తికరముగా లేదు. అంతగా సహాయకారిగా కూడా లేదు.

'అంతమాత్రముచేత నీవు తృప్తి పొందిపోకు. నేను బ్రదికి యున్నంతకాలమును, నీకు, నేను పక్కలో బల్లెమునే యని దలంపుమా! ఇప్పుడు తప్పించుకున్నానుగదా యని సంతసింపకుమా! ఇల్లలికినం బండువ యయ్యెనే?

'ఇదిగో! గరపేలాపలయిత మగు నియ్యాలాతలమున నెక్కడ నీవున్నను, 'కాని మా గురువుగా రజేయులుసుమా'

యను జామలవాక్యములు గల్లలు సేయ, అరిందమ్ యింకను జీవించియే యున్నాడు సుమా! ఇప్పు డిప్పుడే నేను సంధించివచ్చిన ఆ యాగ్నేయాస్త్రమును, నీవు తప్పించుకొని నచో ఘటికుడవే!

'అమారా జొరత్ కా చాలక్ దేఖో' అని యంటివే! దాని బుద్ధి కౌశల్యమునకును, నీ సామర్థ్యమునకును, సరి పోయినది. ఫ్రాల్ సాహెబు జమీలియాలు శిష్యుడును, శిష్యు రాలును అయి యుండ, నీవును నీభార్యయును, వారికి గురు వును, గురువమ్మగారును నై యుండు టెంతేని సమంజసము; నీ శిష్యుడును, శిష్యురాలును వలెనే, మీ యిరువురు భార్యా భర్తలును, నీ ప్రపంచనాటకరంగస్థలమున తాండవ మొనర్చు చున్నారు. కాని నీ కొక్క భార్యయే సహాయ మొనర్చుట లేదు. మఱియు, నీ కింకెందరో తోడునన్ను లున్నారు. కా వున నిక 'సహేంద్ర తక్షకాయనమః' కావలసియున్నది.

'ఏదియె టున్నను, నీవు లోకకంటకుడవే యైనను, నీవు మిక్కిలి ప్రజ్ఞావంతుడ వనియును, ధీశాలివి యనియును, నేనును 'ఔ' నని యనక తప్పదు. కాని నీకున్న బుద్ధివిశేషమునకు, నీకు మంచిస్వభావమే యున్నచో, నిన్నుదక్క వేరొకనిని లోకము, సెబా సనదు. ప్రజ్ఞతో కార్యము లేదు; ధీశాలిత్వ ముతో పని లేదు; ప్రతాపముతో ప్రయోజనము లేదు. స్వభావమే ప్రధానము; సత్ప్రవర్తనమే ముఖ్యము;

'ఉ. నీరము తప్తలోహమున • నిల్చి యనామకమై నశించు, నా
నీరమె ముత్యమట్లు నళి • నీదళసంస్థితమై తనర్చు, నా
నీరమె శుక్తిలోఁబడి స • ణిత్వము గాంచు......'

ననునటుల 'మేధ' యను వస్తుతత్త్వ మొకటే యయినను, దానట్టి స్వభావము గలవారి ననుసరించిన నా స్వభావమున కా పరిణామమున నుత్కృష్టత గలుగఁజేయును. తా ననుసరించిన క్షేత్రపు యోగ్యతాయోగ్యతల ననుసరించియే మేధస్సు యొక్క ప్రతిభ గదా! సూర్యకిరణము ముక్కోణము గాజున బ్రవేశించి, తా నేడు రంగులై, సూర్యుని సప్తాశ్వము లనియు ఇంద్రధనస్సురూప మనియు, వాకొనబడుచున్నది ఆ కిరణమే జీవులకు తేజస్సును, మానవకోటి కారోగ్యమును, చెట్లుచేమలకు వెరకవయును, గలిగించుచున్నది. ఆ కిరణమే భూతయద్దమునం జొరి, తత్కాంతి బడినచోట మంట బెట్టుచున్నది. కావున ప్రజ్ఞావిశేషము లెట్టి స్వభావము గలవారియం దధిరోహించిన, నా స్వభావము ననుసరించి, యా ప్రజ్ఞావిశేషము పరిఢవిల్లును గదా! కాని యేది యెట్లున్నను, నీకును నాకును మాత్రమే జత సుమా!' అని యనుచు దన ముందుచేతుల నాలోచింపుచుండెను.

ప్రథమభాగము సంపూర్ణము.

# కోలహారాయి

## ద్వితీయ భాగము

## ప్రథమ ఖండము

## మొదటి ప్రకరణము

### మోహాంధత

'ఔరౌరా! ఇ వ్వరారోహ యెంతటి గొంటుతనంబు గలయది! న న్నెన్ని వెతల గుడువజేసి, ఈనాటికి నాచే బడిన ని య్యన్నులమిన్న యిం కెందు బోగలదు?'

*   *   *   *

సాయంకాల మగుచున్నది. తరణికిరణవారము జల్లారు చున్నది. పంకజబాంధవుడు, తన రథము పశ్చిమ సముద్రము జేరబోవునవుడా మున్నీటం గల యాడు గుఱ్ఱము (బడబ) ను జూచి, నప్తాశ్వరథారూఢుం డగు సూర్యుం డెక్కిన యరదపు గుఱ్ఱములు మితిలేని వేగమున, నద్దాని నీడ్చుకొని బోవుచున్న వేమో యన, నపరాంబుధిం గ్రుంకనున్నాడు.

కాల మను ప్రయాణస్థుడు, పండుకొనుటకు సూర్యుడను నవరత్నఖచిత మగు కుండను, పశ్చిమ దిగ్భాగంబున వ్రాలు తరణి కిరణము లను బంగారు పగ్గములతో, నీరు దోడుచున్నాడు, 'ఇరుగురు అన్నదమ్ములలో పెద్దవాడును, ప్రతాపవంతుడును, శిల్పుడును అగు సూర్యుడు, దృక్పథము దాటి యస్తమింపబోవు చున్నాడింక, నీ రాక కభ్యంతరము లేదు; త్వరితమున ర మ్మని చెప్పబోవు చున్న, రాత్రి యను యామినీదూతికలం బోలె, నీడలు (ఛాయలు) తూరుపుదిక్కున కెం తేని పొడవుగ బోవుచున్నవి. రవి మఱి గానరా కున్నను, సాంధ్యరాగరుచి కన్నుల కానంద మొదవం జేసి, తానును మఱి గానరాక, తొలుత చిరిచీకటి గానవచ్చి, కాటుకపిట్టలను, నల్లహంసములను, కారుమబ్బులను మించు చీకటు లలమికొని, లోక మంతయు చీకటితెర యై యుండెను.

ఆకసమున పొనలదీరిన జాతిరత్నముల సొంపున, దారకలు మెరయుచు, గన్నుల మిరుమిట్లు గొల్పుచున్నవి. పథికులకును, నావికాయాత్రాపరులకును, నావికులకును చుక్కలే మార్గదర్శకు లగుటం జేసి, వారి పనుల కెంతేని సాయ మొనర్చుచు, రాబోవు రాజురాక కెదురుసూచుచున్న, భటవర్గముం బోలె, కైవారంబుల నొసంగుచుండ, నల్లదే, చందురుండు తూరుపు దిక్కున దోబూచు లాడియాడి, ఆకస నాటకరంగస్థలమున నీలమేఘశిలావినిర్మిత గగనవేదిక నలంకరించుచున్నాడు

కైరవదళశ్రేణి విరబూచి వికసించుచున్నది. చంద్రకాంతశిలల నీరూరుచున్నది. వెన్నెలపులుగులు, తమతమ ప్రియులం గూడి యానందించుచున్నవి. సముద్రుడు పొంగుచున్నాడు. ఇరులు పటాపంచలై, పారుచున్నవి. దిశలు వింతవెలుగు నందుచున్నవి. చక్రవాకీచక్రవాకములు, తామరజొంపముల దూరుచున్నవి. ప్రణయకలహములు మాని మిథునములు, స్వచ్ఛందవృత్తి నివ్విహరించుచున్నారు. మన్మథకుమారుడు, దన పంచబాణముల వెలికి దీసి, పదును బట్టుచున్నాడు. హిమము పేరుకొని గట్టిబడుచున్నది. విరహిణీ స్త్రీజనము కుమారచంద్రుల కోడి, వగ జెందుచుండ, జార, చోర, లోకసంచార మిపు డిపుడ యుడుగుచున్నది.

* * * * *

'పంచబాణు డటు పదునుబట్టిన బాణములను, ప్రప్రథమమున, నామీదనే సంధించవలెనా? ఇక, వీని సహించుటెటుల? ఈ మరుశర సంహారిణి, నన్నుం జేపట్టి, వీని బాణముల కాహుతి కానీయక, నను దూరము సేయరాదా? అబ్బా! నే నెన్నిసారులు ప్రయత్నించినను, నన్ను కాదని, వానినే పరిగ్రహింతు నను పంతము బూనియున్నది; తన పంతమే నెగ్గు నను భ్రమ, పాప మీమె నెన్నెన్ని యిక్కట్టుల బాల్పడ జేసెను! అరిందమ్ పట్టు చూచుకుని, నిర్భరముగా, నిర్భయముగా, నిశ్చింతగా నుందును గదా యని యనుకొనుచు

కాలము పుచ్చెను; గాని ఇక నేమనగలదు? కాలూరాయి ఆజ్ఞల ననుసరించి, సంచరించవలసిన ఫ్రూల్‌సాహేబు అధీనములో నుండియుండి, అవకాశము దప్పుటచేత, తుదకు, అరీందమ్ చేతబడి, దా వలచినవాడే తనకు నాథుగా దొరకెగా యని, యానందించుచున్నది! జమీన్‌దారీ తన కొకటి, తన తండ్రిమూలమున వచ్చినదియు, తన వలపుకాని మూలమున, నింకొక జమీన్‌దారీ కూడ వచ్చె గదా యనియు, సంతోషించుచున్నది; కాని, నామూలమున గూడ నంతకన్న మిన్నయా జమీన్‌దారీయే తనకు జెందు నను నూహ పొడముటకి మాత్రము విచారించుచున్నాను. మఱియు, తన ప్రేముడికాడేమి రూపసి? ఏమి సామర్థ్యము గలవాడు? ఎందున నన్ను మించగలడు? పట్టిభ్రమ! ఫోటోగ్రాఫులు తీయు నేర్పున్న మాత్రాన, నేమి? గొప్పవిద్వాంసుడా? వ్యవహారములయందారితేరినవాడా? ఇం కేందున నన్ను మించగల డని, నన్నుకాదని, వానియందే మక్కువ నిలిపియున్నది? ఔరౌరా! ఇవ్వారారోహ మెంతటి గొంటుతనంబు గలయది! నన్నెన్నెన్నో వెతల గుడువజేసి, ఈనాటికి నాచే బడిన నీ యవ్వనన్నలమిన్న యింకెందు బోగలదు? ఏది యెట్లున్నను, ఇట్టి తరుణీమణిని నందర్శించిన, నంతియు చాలు. ఆ మోము సందము, ఆ నాసపొగను, ఆ చెక్కిళ్ళ నునుపోయగము, ఆ నగవుమొగంపు తీరు, ఒక్కొక్కటి ఒక్కొక్క కోటి సేయు గదా! సర్వాంగ సౌష్ఠవము గలిగి, 'రూపొందిన స్మరు' డనియు, 'చిలుక రాణా

రువమును, చెఱకువిల్లును, కుసుమసాయకములును, ఏమఱు పాటున మఱచి, యఱదెంచిన మఱు డనియు నింక నెన్నెన్నో విధముల, కామినీలోకము, తమ ననివిదీర నను గొనియాడు చుండ, ని మ్మాఱుకటారి ననునగ్గించిన మాత్రాన, నా కేమి లోపము !

‘క్రొంచెపుపెంట లేరితిను ♦ కుక్కుటముల్ నిను ‘కంఠగిజ గా’
దంచు త్యజించి నంతనె యు ♦ హా! యపకీర్తి యొనీకు రత్నమా!
కాంచనపీఠి నిన్ను నిడి, ♦ కాంత కిరీటము లందు నిల్పి, య
భ్యంచితరీతి, మస్తకము ♦ లందు ధరింపరె రాజశేఖరుల్!’

అని యుండ లేదా !

‘ఇంతకాల మెటుల గడచినను గడచిన దేః ఇక ముందైనను, నను గామించి ననువార్త వింటినా, తనకును, నాకును గూడ, కష్టపరంపరలు దాటినవని దలంతును; కానిచో, తన వగకానిని, తన నమక్షమునసే దెగటార్చి, త న్నింక నెన్నో విధముల వెతలం గుడువ జేసెద నంతెకాని, వినుగు జెంది, ‘ప్రాప్తము లే’ దను పామరజనముం బోలె విడుచు వాడను గాను. ప్రాప్తము లేదను జనులు, మూర్ఖులే యగుదురు; కానిచో — ప్రాప్తములేని దియ్యల లేనేలేదు. కృషి, ప్రయత్నము లేని దేదియు ఫలింప దని, గీతలయందు శ్రీకృష్ణుడే జెప్పియున్నాడు కాడా ! మఱియు, కార్యములపట్ల వినుగొందువారు మూర్ఖజనశిఖామణులు.

'తనిసిరే వేల్పులు దధి ర • త్న ములచేత ?
వెఱచిరే ఘోర కాకోల • విషముచేత ?
విడచిరే యత్న మమృతంబు • వొడముదనుక ?
నిశ్చితార్థంబు విడువరు • నిపుణమతులు'

అను భర్తృహరి భావ మభావ మగునా ? కావున, నా ప్రయత్నమున నేను సఫలిత నందగలను. సంశయము లేదు. అరీందమ్‌చేత 'దేవిపూర్ కానికి కాగితములు' అని లేబిల్ వేయించి, చమత్కరించిన పెట్టెనుండి వచ్చిన, ఎలెక్ట్రిక్ స్ప్రింగులచే బంధింపబడుటకు పూర్వము, యోగిని యగు జమల, మా ఆచార్యు లగు కాలూరాయి గారిపేర వ్రాసి, కరీమ్‌ద్వారా పంపిన చీటియం దెంత గౌరవము గలదో కాని, పాప మామె చనిపోయి యింతకాల మైన నాయమ వ్రాసిన చీటి ప్రకారము కార్యము నెన్నెన్నో యుపమలవన్ని జయప్రదముగ జరిపి జరిపి, నా విశ్వాసమునకు పాత్రుడైన కాలూరాయి గారి పట్టుదలకు, నా వందనశతంబులు; చిరకాలము నుండి, నా మనోభీష్టము నెరవేర్ప గంకణము గట్టుకొని, తుద కెట్టకేల కీనాటి కైనను, నా యాప్సితము నెరవేర్ప నెన్నియో యిడుమలంబడి, ఇప్పటి కింకను రెండవ కంటివానికి దెలియ రాకుండ, నాకందరాని ఫలము, నాకంద జేసిన యాయన నేర్పరితనమున కెంతేని యభినందనములు !

'గురూజీ ! నీ కడ నెన్నెని వనమూలికలు, ఓషధు

లు, వశీకరణయంత్రములు, తంత్రములు, మఱియు, నేమేమో రహస్యప్రయోగములును గల వని, వలుతెరంగుల వింటిని. అం దేదేని బ్రయోగించి, సునాయాసముగ నిక్కామినీమణి నను కామించునటుల సేయరాదా ? న న్నొల్ల నని భీష్మించు కొని కూరుచున్న దీ యెలనాగ: ఇయ్యిద్దుగుమ్మ దక్క నొండొరు ప్రేమింప నను శపథము నాయది. నేను గెల్వకుందునా, ఈమెను మరి మనసీను; నేం గెల్చితినా యిక్కలికి యును దలం దొలంగు నేమో: ఇట్టి ప్రమాదముల నేదియు నను కూడనీయక, నాకీ మోహానలక్ష్మియు, జయలక్ష్మియు నేకుర జేయరాదా ! 'ఇదుగో, నీ నలచిన కాంత; ఇక నీమెను నిను గామింపజేసికొను భారము నీదే! యని నన్నొల్లని కాంతను నాకొనంగుటకన్న ప్రేమింపజేసి, నాయొసర్చిన సమయాను సారముగ, నీ పొందవలసిన బహుమానము నందరాదా! ఓ కుటిలాలకా, నీకింతటి కౌటిల్యముగల మానస మేల! ఓ నిలుకడమెరపా, నీ కింత నిలుకడ లేని మన నేల! చంద్రుడో, పద్మమో, ముకురబింబమో, కాక ముఖమోయన దగిన, నీమోము నందమునకు దగినవాడు సిరాజ్‌హీనా! చక్రవాకములో, పూబంతులో, బంగారుగిండ్లో, కుచములో, యను భ్రాంతి నొందింపగల నీ చనుగవ యందమునకు దగిన వాడు, కొంకినక్కవంటి సిరాజ్‌హీనా! బంగారులతయో, విద్యుల్లతయో, యను సంశయ మొనగూర్చు, నీ తనూలతను

మెచ్చుకొనదగినవాడు, ఎంచరాని యువమాన మందినవాడు, నీగోరువాడు సిరాజ్‌హీనా? కామినీజనము సౌందర్యపక్షపాత యను నానుడి నీయెడ మిథ్య యగుచున్నది! ఏమిచూచు కొని వాని వలపను యురులలో జిక్కి, నన్నింత యలజడి నొండజేసితివో తెలియకున్నది! పండితరాజవేదండ మగువాకు గాక, మఱియొక పాటివానికి దగని మోహనాంగీ, నీయాత్మస్వాతంత్ర్యమును గోలుపోవుచున్నావుగదా యని యే నెంతేని విచారించుచున్నాను.

'స్త్రీలను వర్ణించునపుడు, చంద్రమండలముం బోలు మోమును, కమలములను గేలిసేయ గల నేత్రయుగమును, బంగారును మించిన మేని సొగసును, మత్తభృంగమ్ముల గెల్చు కొప్పును, ఇభకుంభమ్ముల సొంపుదెగడు కుచయుగమ్మును, అనంటిదిన్నెవంటి పిఱుందలను, తేనెలొలుకు ముద్దుం బలుకు లును ననుచు, పెక్కండ్రు కవులు వాకొనియుంట, నిట్టి యలంకారము లేవియును, నాకు, దృష్టికరముగ లేవు త్రొక్కిన త్రోవలే ద్రొక్కుట పాడినదేపాడుటయు నగునుగదా! ఇంత కును, సహజ సౌందర్యాలంకార భూషితయగు నీకు సాలంకార శబ్దములను నలంకారములేల?

'దేనిని గమనించినంతనే తన హృదయమున జెప్పరాని యానందము గలిగి, తానదివరకు జేయుచున్న పనిని మాని, తదేకధ్యానమున మైమరచి, దాబూచుచున్న వ్యక్తిస్వరూప

మన దన మానసము తనకు దెలియకుండగనే యెందు లగ్నమగునో వివాహకార్యముల యెన్నికల కేది ప్రథమగణనీయ విశేషమో దేనిని జూచినంతనే, తరుణవయస్కుల మానస పుండరీకములకు భగ్నములై దనరారునో, రతీదేవి యేరూప విశేషతత్త్వమునకు పెట్టినదిపేరో, విశ్వామిత్రాది మహామునులును, గంధర్వ, కిన్నర, కింపురుషాది ఖేచరు లేవ్యక్తివిశేషమునకు లోబడి, తపోభంగములనై సగావించుకొనిరో సుమములలో గులాబీ, యే కారణమున 'రా'జని పేర్కొనం బడుచున్నదో, మహాకవు లేవ్యక్తితత్త్వమును నిరూపించి, తమతమ గ్రంథరాజముల జీవకళ లొనరుచున్నారో, కరీమ్ మతిభ్రమణ, దేశభ్రమణాద వైరివైరి పనులకు, జామలయొక్క, యేవ్యక్తివిశేషము ముఖ్యకారణమో, ఈ నాప్రయత్నావళిలో ద్వితీయ భాగమున, నీ చిత్రకథలో, గుల్సుమ్ సుమకోమల దేహస్వరూపముయొక్క యేవిశేషమునకు లోనై, లెక్కకు మిగిలియున్న ధనము వెచ్చించుటేగాక, నారాజ్యము నైనను గోల్పోవ నిచ్ఛగించు చున్నానో గుల్సుమ్ దైవనిర్మిత మైన, యేస్వరూపవిశేషమునకు, నేనె న్నెన్ని వెతల గుందజేయబడుచున్నానో; ఆ స్వరూపవిశేషము, ఆ వ్యక్తివిశేషము, ఆ రూపము, ఆ చిత్రితము, ఆ చమత్కృతము, అదియే సౌందర్యమని యందు: నంతియకాని, 'లోకో భిన్నరుచిః' యనుట నొక్కొక్కని కొక్కొక్క రూప మామోదదాయక మగును

గనుక, సౌందర్యమునకు ప్రత్యేక లక్షణము నిరూపింప నే నే మహాకవికి గాని, ఎంత నామసుకైనగాని, వలనుపడదు గదా!

'ఓ కామినీరత్నమా, శశికాంతమణిమయ మగు నీ మోము నందమునను, మహానీలమణి మయ మగు నీ కురుల సొగసును, పద్మరాగమణిమయము లగు కరముల సొంపును గల నీవు, సంపూర్ణ మణిమయం బౌట నీవు కామినీమణివే!

*　　*　　*　　*

'ఇదిగో, నే నంపిన నీలాంబరి యిదే మరలి వచ్చు చున్నది—వికోపములు కనుగొనవలసియున్నది 'ఏమి! కాయా; వండా; ఏ మైనది?' యని యా తరుణవయస్కుడా నీలాంబ రిని ప్రశ్నించెను.

'చెప్పుట కే మున్నది? ఎంత చెప్పినను, ఎంత బోధించి నను, పిలినవారిని కాదనుచు, సిరాజ్ హీనుని గొనియాడుచు గాలము బుచ్చుచున్నది. చెప్పవలసిన తెరంగున జెప్పితిని; బోధించవలసిన మార్గముల బోధించితిని. మరియు, నమరక్తి, విశ్వాసము, బాంధవ్యము, హితము, అంతఃకరణము, సఖ్యము పోరామి, నెన్నము, చెలిమి, నెరు, ప్రేమ, చల్లదనము, వాత్సల్యము నేర్పడ బల్కితిని, కలుపుగోల్తనము, ప్రీతి, మంచి తనము, మైత్రి, ప్రాణపదము, తాత్పర్యము, గారాము, నను గుణ్యము, ననుబంధము ననుసరింపు జూపితిని. మచ్చిక, జుట్టరికము, నైక్యము; నిచ్చకము గనుపరచితిని. మీయెడ స్నేహా-

ము, ననురాగము, నాసక్తి, మోహానియతియు బొడసూప బలికితి, నింతియగాక, అనేకవిధముల స్తుతులొనర్చి, ఎన్నెన్నో ప్రసంగముల జేసి, మంచిమంచి కథలు జెప్పి, సుద్దులు నేర్చి, వార్తలు వినిపించి, చతురతరేతిహాసములు వినికిరి జేసి, జాతిగాథల దెలిపి, సతకడములును, పురాణములును, సామెతలును, సుబోధకములుగా జేసితిని. హాస్యము జేసితిని. పరిహాస మొన ర్చితిని. వేయేల! జారజారిణుల కేళీవినోదముల స్వాచి చితిని. ఇంక నెన్నివిధముల మనం బలరనేయునగునో, అన్నివిధముల నల్ల మూచి జూచితిని; కాని యేమియు గార్యము లేకున్నది. మఱియు నిక నావలనగాని, యింకెరివలన గాని యీ కార్యము జక్కబడు ననుకొనుట, మనకు వట్టిభ్రమ పలినవారు తగిన మఱియొక మార్గము ద్రొక్కుటయే మేలు. లంకలో రేయింబవళులు నిద్రాహారములు మానియుండిన సీతాభామామణి, శ్రీరామునియందుంబోలె, నామెయు సిరాజ్‌హీన్‌పై, తన మానసము లగ్నము జేసికొని, తదేకధ్యానమున నున్నది. ఆపైని తమ చిత్తము' అని నీలాంబరి యనెను.

'సరే, ఇక మా చిత్తమున కేమున్నది? సరి—ఇక దాని యాయుఃకాలము సరి. రేపే మా గురూజీతో చెప్పి, సిరాజ్‌హీసుని చంపి, యాతని శిరము తన పాదములపై దెచ్చి పెట్టుదు మనియు, నాపై నేమిసేయునో జూతుమనియు, మా మాటలుగా బోయి నివ్వార్షపరువుము. పొమ్ము' అనుటయు, నామెయు వెడలెను.

'అయ్యో ! నా కెందుకీ పట్టుదల ? కాంతయు, కవితా కాంతయు, తమకు దాముగా వలచివచ్చిననే గాని, కానిచో, సారస్యముగను, మనోరంజకముగను, సౌఖ్యదాయకముగను నుండవుగదా ! ఈ బలవంతమువలన వలవంతయే గాని, సంతత మును సంతసము గొలుపదే! ఇంక నీ ప్రయత్నము మాను కొనుటయే సర్వవిధముల మేలు.

'ఆఁ—ఒక స్త్రీ నన్ను గాదని నాకన్న మిన్నగాని వాని న్మిన్నగ నెంచి, వానిం బరిణయమై, నన్నవమానించిన, ఇక్కలకంఠి కంఠమేల ద్రుంపరాదు ? మానసమా, తొందర పడకుమా ! ఇప్పట్టున నేయదగినది నను మన్నింపనని నను గాదని యనుచున్న నీమెను గడతేర్చుటకన్న, వానినే పరిపూర్చినచో నీమె తన 'అనన్యగతిక' మ్మని దోచిన నన్నే చేపట్టును. కావున నే నటులనే నేయుదును

'అబలల మనమ్ములతి మృదులమ్ము లని దలంచు చదువు లేర్చిన పండితాధముల వాక్యమ్ము లప్రమాణమ్ములని సిద్ధాం తీకరింపవచ్చును. కానిచో నెంత ధన మిచ్చినను, కనకము గ్రుమ్మరించినను, వస్తువాహనము లొసంగినను, నను పరిగ్ర హించుటను మారుగ దృణీకరించుచున్నది ! తనకు గులాబీపూ లన నెంతేని యానందము గదా యని నేన న్వాయముగ పూల యంగడికిం బోయి, ప్రతిదినమును గులాబీలను దెచ్చి యిచ్చు

చున్నాను. నావంతయు నాపై మక్కువగాని, యానుమతులు జూడ, దానానందము బొందుటగాని, నే జూడనైతి. ఈ మోహనాంగికొరకు నెన్నెని యిడుముల గుడిచితిని. ఎందఱెందఱినో బ్రతిమాలితిని. నిరూప కౌర్యాత్ముం డగు నరీందమును గూడ బ్రతిమాలితిని. కొన్ని గ్రామములు జాగీరుగా నొసంగెద నంటి. సిరాజ్‌హీన్ కన్న పూర్వమునుండియు గుల్‌సుమ్‌ను బ్రేమించుచుంటి నంటి. మఱియు, నే నెన్నెని యంటి గాని, యేరికిని సాధ్యముకాని పని యని కొందఱంటిరి. తగని పని యనియు, నీ యుద్యమము మానుకొనుటే మానితంబనియు, నా యరీంగమ్ నా కక్కఱకు రాని సలహానిచ్చి పొమ్మనియె. అనా ప్రయత్నకాలమునకు పాటియైన నా కనుభవయోగ్యత లేదా! తాను యుజ్జయినిలో నున్నానుకదా: తన కరీందమ్ చక్రరక్షకుడుగదా, యనియు గర్వించుచున్న దీ కుసుమకోమలగాత్రి!

'ఏది యెట్లున్నను, నేటి సాయంకాలము గూడ గులాబీలను దెచ్చియిచ్చి యామె మన్నన నే నొందుటో, కానిచో గడు నీచుం డగు దన వలపుకాని ఖండితశిరమును దెచ్చి, యామె పాదకమలమ్ములపై నునుచుటో, జరిపి తీరవలెను. తదుపరి దానేమి సేయునో జూచెదగాక!

## రెండవ ప్రకరణము

---

### పూల యంగడి

'ఏమిరా, ఎంత కిచ్చెద వా పూలదండ? ఇంకను మరేమైనా రకము లున్నవా?'

'మఱి రకముల కేమున్నది? నావద్ద గులాబీలు దక్క మఱియొక రకముపూ లుండవు. గుచ్ఛములుగా నున్న గులాబీలును గలవు. కాని అవి మిక్కిలి ఖరీదైనవి. జమీందార్లు మొదలయిన గొప్పగొప్పవారికే దగినవి.'

'ఏమిరా, జమీందార్లకే గాని, మఱెవరికిని దగవా? ఇక్కడ జమీందారు కానివా రెవరు? ఏవీ, చూతము?'

'చిత్తము. ఇదుగోనండి? తమిజుద్దీన్ జమీందారు వారు జీవించియుండు కాలములో, ఈ గులాబీల విలువ; వీని సొగసు; ఇప్పు డేమున్నది? అంతపాటివా రేరీ?'

అనుచు నాతడు తన పూసిబ్బలో చేయి నిడుచుండెను.

'ఏమిరా, తమిజుద్దీన్ తన తలలో నిడుకొనువాడా గులాబీలను?'

'మగవారికి పూ లేల? ఆయన యేకపుత్రిక, గుల్ సుమ్, గులాబీ లన నావి గోసికొనును. ఆమెకొఱకిట్టి గుచ్ఛములు, ప్రతిదినమును రెండును, మూడును గూడ, తెప్పించు

చుండెడివారు. ఈ తీరు గుచ్ఛముల గట్టు నేర్పు నాకు నేర్పి, నాకు జీత మిచ్చి పోషించుచుండెడివారు. నేను తయారుచేసిన గుచ్ఛము లన నామె కెంతేని యానందము. కనుక నారోజు లలో, నేనును, నాకుటుంబమును ఇంత దిని, జీవించుచుంటిమి. ఇప్పుడో: ఆమె తన యత్తవా రింట నున్నది. ఈ గుచ్ఛముల నిక నీ పట్టణమున గోరువా రెవరు ? ఏరీ అంతటి నరనులు ? చచ్చి స్వర్గముననున్న యా తమిజుద్దీన్ వంటి మహామహుడు గదా మృతజీవుడు ! తదితరులు జీవన్మృతులే !' యనుచు నీ పూలవర్తకుడు తన పూసజ్జలో నుండు పెద్ద గుచ్ఛము నొక దానినిదీసి, 'అయిదు రూపాయిలు దీనివెల' యని యా యావనునికా పూలయంగడివా డొసంగెను. దాని మూల్యము నేత డిచ్చి, యా గుచ్ఛముం గొని, పోవుచు, 'నీ పే రే' మన నాతండును, 'గోపాల్ చంద్' అని యనెను.

సుమగుచ్ఛమును గొని, యాతడును మరలెను.

కాముకత్వము, మోహాంధత, స్త్రీలోలత, నెట్టిపండితు నైన నంధుం జేయు నను నానుడి సత్యమేయగున గాబోలు కాముకా, నీ విపు డీవు డా పుష్పలావికకు సమక్షంబున, 'ఇక్కడ జమీందారు కానివా రెవ' రని ధిఃకరణ మొనర్చి, నీదళకును, నీస్థితికిని, నీపదవికిని దగునో, తగదో యను చింతన లేకనే, సామాన్యజనముం బోలె, నీవే స్వయముగ పూల యంగడికి పోయి, పూగుత్తి నెత్తుకొని, బుత్తెంచుచున్నావు !

ఇంతటను, నీ వ్నన బనియేమి? నీ వెంత విద్యాంసుండవైన నేమి? ఎంతవాఁడ వైననేమి? నీలోనున్న ప్రత్యేకపదార్థము ప్రమాదకరమై యున్నది పాపము! నీవుమాత్ర మేమిసేయ గలవు? రామ, రామ! రామామణీ లగ్నమానసాంధు లుచితా నుచితముల నెఱుంగజాలరు గదా!

---

## మూఁడవ ప్రకరణము

---

### సుమగుచ్ఛము

'ఏమే, నీలాంబరీ, ఏమనుచున్నది? గుల్‌నుమ్ ఖులా సాగా నున్నదా? తన తండ్రికాలము నుండియు, తన కొఱకు ప్రత్యేకముగ గులాబీగుచ్ఛముల దశ్శుసు చేసి యిచ్చుచుండు వానియొద్దనే కొనితెచ్చిన, యీగుచ్ఛము గొనిపోయి యామె కిమ్ము, ఏమనునో, ఏమి చేయునో విని, చూచి, రమ్ము.'

'చిత్తము' అనుచు నా నీలాంబరి, యాగులాబీ, గుచ్ఛము గై కొనిపోయి, యాప్రక్కగదిలో, విరియబోసిన శిరోజములతో, మాసిన వలువతో, నిద్రాహారములులేమి శుష్కిత తనూలతతో, కటికనేలను బన్నుండి, తారకబ్రహ్మమంత్రంబు బఠింపుచు దపము సేయుచు, నీలాంబరి యుపమించినటుల, సీతా భామామణిం బోలె, పరితపించుచుండు నా నారీమణిని నమీా

పించి, 'అమ్మా, మీకొఱకు బాబుగారు స్వయముగ పూల యంగడికి బోయి, గులాబీగుచ్ఛమును గొని తెచ్చినారు. ఇది గో—మీ తండ్రిగారి కాలమున, మీ కెవడు పూలగుచ్ఛముల నిచ్చుచుండెనో, వానివద్దనే పుచ్చుకొంటిమని, చెప్పిరి.' అనుచు నా గుచ్ఛము నా నీలాంబరి యామె కొసంగ, దోడన నా గుచ్ఛము నందికొని, యథారీతిని జింపివేయక తన తండ్రి కాలమునాటి వానియందు గల నెనరును బరిచయమునో, గాక యింకేకారణమునో గాని, యాగుచ్ఛము నందుకొని దన మేజాపై నుంచ, నది జూచి, నీలాంబరి తత్క్షణము పోయి, మదన్ మోహన్ పటేల్‌గారికి నివేదింపబోయెను.

ఈమెయు, మరల దన కేమి దోచుటనో గాని, చివాలున లేచి, యా పుష్పగుచ్ఛమును చింపివేసి, పూల నెల్ల చిందరవందరగా నేల పరబల్ల, నందుండి యొక చిన్న కాగితపు చీటి నేలరాల, నది జూచి, ఏ మిది యని యనుకొని, అద్దాని నందుకొని, జూచి, గుప్తముగా నుంచుకొనెను.

తన తండ్రికాలమునాటివానివద్దనుండియే తీసుకవచ్చితి నీ కుసుమగుచ్ఛ మని పటేల్‌గారి మాటలుగా, నీ నీలాంబరి చెప్పినంతనే, తన తండ్రియందు గల గౌరవమును, పుష్పలావికు నెడ బరిచయమును జూపుటకో యన, తొలుదొల్త బ్రీతి స్భద్రపరచిన నా పూగుత్తి నిపుడు దీసి, త్రెంపివేయుటకేమి కారణమై యుండునో కద! బహుశః దనకు విషప్రాయము

డుగ దా దలంచుచున్న పటేల్ గారి హస్తస్పర్శను నొందిన యీ సుమగుచ్ఛము, తన యాదరమునకు దగ దని దోచి యుండుట, జించివేసియుండునా? ఇంతవరకును, సుమగుచ్ఛ మొనర్చిన పాప మేమి? పటేల్, తనకు శత్రుడుగా దోచినదోచు గాక! కాని, శత్రు డని తనకు దోచినవాని కార్యములన్నియును శత్రుకార్యములును, వాని చేత లన్నియును శత్రుత్వములును, గా దలంచుట యెట్టి పట్టుల మానవసహజములై యుండునా? కాక, తన తండ్రికాలమునాటివాని యొద్దనుండి తెచ్చిన పూ గబ్బ యని యనుటచేత, తోటదొడ్ల నా గుచ్ఛము నామో దించి, తన మేజాపై నుంచి, పిమ్మట పూలు మొదలగు మంగ ళద్రవ్యములు పరపురుషుల చేతినుండి వచ్చుటయు, నందునను, తన భర్తయగు సిరాజ్‌హీంగాను దూషించుచు, తన్నరికట్టిన అరికరముల స్పృశత్వము నొందుటయు, మానధను లగు పతి వ్రతారమణు లొల్లమినో, దైవకృత నిగూఢనియోగముననో ఇందేది కారణమైనను, గాకున్నను, నియ్యామయా కుసుమ గుచ్ఛము జించివైచి, పూల విరజల్లుట మాత్రము తప్పని సరి యైన ఫలితమయినది.

మరల నియ్యామ యేమిసేయుచున్నదో చూతునుగాక యని, నీలాంబరి గదిలోనికి వచ్చి, తుత్తునియలుగా నేయబడి విరజల్లి యుండిన పూలజూచి, యొక్క గంతున నీవల కరు దెంచి, యా పండితపుంగవుతో, తా జూచినది, తన భ్రమనము తొంటున నవినయమ్ముగ మనవి జేసికొనియెను.

నీలాంబరిచే నివేదితుండయిన నా కాముకు డుగ్రుడై, మండిపడుచు. 'సరే ఇక దానిని గూర్చి మరి నాతో చెప్పకుము. రేపొక్కదినమే గడు విచ్చితి ననుము. తప్పినేని తన పగకాడు, సిరాజ్‌హీనుని శిరస్సు, తనకు దర్శింపవచ్చునని చెప్పు దాని విషయమున నెట్టి సదుపాయములును, మీ రెవరును, జేయనక్కరలేదు. ఆగడివైపే పోవలదు. భోజనాది సదుపాయము లైనను, చేయనక్కరలేదు.'

## నాల్గవ ప్రకరణము

### స్వగతము

'ఔరా! ఏరోప్లేన్‌లో తప్పించుకొని, నీ మార్గము ననుగమింపజాల నని యెంచితి వేమో! పాపము! నీదే మంచి యెత్తు మరి యెరికిని నా పై యెత్తు, తెలియనే తెలియ దను కొంటివిగా! నిన్నన బని యేమి! నిన్ను సృజించిన వానికి నాలుగు శిరము లున్నను—ఊః—నే నంపిన పావురము, నా కొనర్చిన సాయమున నీ మనికిపట్టుల దెలిసికొనియు, చీకటు లలమికొనుట, నీగమనిక యతి త్వరిత మగుట, నెంత విద్యుద్దీపకాంతి సాయమున్నను, ఆ రివాల్వింగు కెమేరాలో కేవలము స్వచ్ఛముగ గాకున్నను, నీ పథము దెలిసియు, నీదిగిన తావునే

బోల్చికొనియు, నిష్ఫలమాయెగదా యని యనుకొనుచు నున్నాను. నీదిగిన తావునకు నేబోయి, చూడ, నీవా భవనమున లేకుంట, నీవక్కడనుండి నీతావును, తప్పక మార్చుకొంటి వని దలంచితిని, కాని నీచేతలు గర్భనిర్భేదకరములు! నీ యూహాలు హిమవన్నగాంత రాభవములు! నీపన్నాగము కలనాగులతో జెంగాటములు! నీయెత్తులు పరజనచిత్తమ్ముల గొత్తుడులు.

'ఎంతయు గాకుండిన, నీదూసిపోకడకు పన్నిన పన్నాగమూ, ఇనుపమందసపు చేతియూ; అం దిమిడ్చియుంచిన పవన విమానమూ, ఏది యని యెంతును! నీకృత్యము లన్నియు నన్నియాణిముత్యములు! నా పేరు వచ్చిన టపాలుదప్ప, పార్సిల్సు పెట్టెలు, ఇతర కన్‌సైన్‌మెంట్సు మొదలగునవి యెల్ల నే నెన్నడును నా యింటికి దెప్పించుకొను వాడుక లేదని మా స్వజన బృందములోనే, యెంతకాలము నుండియో గాని, దాగియుండిన నీ పరివార మను స్వచక్ర భయంకరులచే నివేదితుడ వౌట నట్టుల జేసియుందువు. అటు కానినా డింకేమి జేసియుందువో! కావుననే, ఆ యినుపమందసము నా యింటికే తెప్పించుకొని యుండిన నీ వెటుల దప్పించుకొనియుందు వని యైన నే ననుకొన బనియే లేదాయె గదా!

'నీవు మింటికెగసినపిదప మిగిలినది నీ చెప్పినటుల నీ భార్య చమత్కరించిన యినుపమందసపు టడుగుభాగము తప్ప

దాని యితర భాగము లన్నింటితోడను, ఏరోప్లేన్ మింటికెగసి గాబోలని పెక్కండ్రు నుడివిరి! అది యెటుల సంభవమగును? అంత భారముతో నా పవనవిమాన మెటుల మింటి కంటగల దని గూడ ననుకొంటిరే గాని నీమాట నొక్కట యైనపిదప నే విధమున నది విచ్చెనో దాని ఆరు ప్రక్కలును ఒకదాని కొకటి యేవిధమున ప్రాస్వీకృతమై దాని యడుగుభాగము లోనికి తామే (బే) టి కాళులవలె లోనికి బోయి యం దిమిడి పోయెనో, అప్పటి కచ్చట నున్న వారిలో నొక్కడైన గుర్తించి నటుల దోపదు; కాని బుద్ధిమంతుడగు మంగిశ్నేక్ మాత్రమే యది గమనించి దానిని మరల యథారీతిని సమన్వయింప జేసి అందు దిగి చూపెనుగదా! ఏదియెటు లున్నను నీ బుద్ధి కసాధ్యము గాని అసంభవము గాని యున్నటుల దోపదు

'నీ సర్వంకష ప్రజ్ఞ దశదిశల వెలుంగుచున్నది. నఖు ముఖముల బరువెత్తగలవు. వేయుకాళ్ళ జెర్రివి నీవు. కానిచో పాపము! సిరాజ్‌హీన్ జాబున కేమందును? నెత్తియు నోరును గొట్టుకొనుచు వార్త నంపెనే!

'లాలు సింట నీ పని జేయుటపూర్వమే, సిరాజ్‌హీన్ గ్రామాంతరమున నున్నతరి సిదియు యుద నని గుల్‌సుమ్‌ను తన కప్పగించినచో చానా కిచ్చెద ననిన జాగీరుల వడయు గాబోలు, పలేల్‌స కామెను ఒప్పగించితివో! కానిచో నంతలో నా జైన దేవాలయమున స్వజనమధ్యమున నిదురించుచున్న

పాప మా గుల్ సుమ్ మరి కానరాకుండుట కేమి కారణము! ఇదియు నీ హస్తలాఘవము యయి యుండనోపు. ఓపిన యంత వట్టు సేయుచునే యున్నావు. పరేలున కప్పగించక నీ గృహమం దుంచియుందువా? కాదు; కా దటు సేయ నీకు ప్రయోజన మేమి? ప్రయోజనముల కొలది దూర మున్నను నరకు సేయవు. మరియు నా మెనా నీ యధీనమైన గొన్ని దినము లుంచుకొని యామె పరేలునకు వశ్యమగుటకు నీ మంత్ర యంత్ర తంత్రముల ప్రయోగించు దైవ నిచ్ఛావాప్తికొరకు ప్రయత్నించు చుంటివా? నిన్ను నీ మోము పామరజనముం బోలె దలంచుచుంటి వేమో! దేహబలము మనోబలము నుపయోగించి జబ్బుపుష్టి గనపరచి వశీకరణాదివిద్యల నెరపి దైవ సాహాయ్య మున్న పట్టుల నీ పట్టిన పట్టులు నెరవేరెనా ఆత్మకృతం బని యెన్ని యెంతేని యానందింతువో; కానినాడు నీ కాలునకు బుద్ధి గరుపుదువో! ఎంత తెంపరివి! ఏక కాలమున నెన్నెన్నని దుండగములు సేయజాలుటకు నీ కడ శ్రీరాముబలగ మున్నది. కానిచో నంత యాగడములో నీకడ నూడిగములు సేయుచున్న వారును నీయంత వారలే! మరి సంశయింప బనిలేదు. కార్యాచరణములపట్ల నేమి, కార్యాంతపు బర్యవసానముల పట్ల నేమి, క్రౌర్య సాహిత్యము లయ్యు, నీ ప్రజ్ఞాప్రకీర్షలు, బహు చమత్కారములు! నా యోపినంతమట్టు నే శంకించినంతవట్టు, నాయనుమాన నివారణార్థము, ముందు

దాని యితర భాగము లన్నింటితోడను, వరోప్లేన్ మింటికెగసి గాబోలని పెక్కండ్రు నుడివిరి! అది యెటుల సంభవమగును? అంత భారముతో నా పవనవిమాన మెటుల మింటి నంటగల దని గూడ ననుకొంటిరే గాని నీమాట నొక్కట యైనవిదవ నే విధమున నది విచ్చెనో దాని ఆరు ప్రక్కలును ఒకదాని కొకటి యేవిధమున ప్రాన్స్వీకృతమై దాని యడుగుభాగము లోనికి తామే (బే) టి కాళులవలె లోనికి బోయి యం దిమిడి పోయెనో, అప్పటి కచ్చట నున్నవారిలో నొకడైన గుర్తించి నటుల దోపదు; కాని బుద్ధిమంతుడగు మంగిస్సేన్ మాత్రమే యది గమనించి దానిని మరల యథారీతిని సమన్వయింప జేసి అందు దిగి చూపెనుగదా! ఏదియెటు లున్నను నీ బుద్ధి కసాధ్యము గాని అసంభవము గాని యున్నటుల దోవదు

'నీ సర్వంకష ప్రజ్ఞ దశదిశల వెలుంగుచున్నది. నఖ ముఖముల బరువెత్తగలవు. వేయికాళ్ళ జెర్రివి నీవు. కానిచో పాపము! సిరాజ్‌హీన్ జాబున కేమందును? నెత్తియు నోరును గొట్టుకొనుచు వార్త నంపెనే!

'లాలు సింట నీ పని జేయకపూర్వమే, సిరాజ్‌హీన్ గ్రామాంతరమున నున్నతరి నిదియు యుద్ద నని గుల్‌నుమ్‌ను తన కప్పగించినచో దానా కిచ్చెద ననిన జాగీరుల వడయ గాబోలు, పటేల్‌న కామెను ఒప్పగించితివో! కానిచో నంతలో నా జైన దేవాలయమున స్వజనమధ్యమున నిదురించుచున్న

పాప మా గుల్ సుమ్ మరి కానరాకుండుట కేమి కారణము! ఇదియు నీ హస్తలాఘవము యయి యుండనోవు. ఓపిన యంత వట్టు సేయుచునే యున్నావు. పతేలున కప్పగించక నీ గృహమం దుంచియుందువా? కాదు; కా దటునేని నీకు ప్రయోజన మేమి? యోజనముల కొలది దూర మున్నను సరకుసేయవు. మరియు నామెను నీ యధీనమున గొన్ని దినము లుంచుకొని యామె పతేలునకు వశ్యమగుటకు నీ మంత్ర యంత్ర తంత్రముల ప్రయోగించి దైవే నిచ్ఛాప్రతీకారకు ప్రయత్నించు చుంటివా? నాప నామెను పామరజనముం బోలె దలంచుచుంటి వేమో! దేహబలము మనోబలము నుపయోగించి జబ్బువృష్టి గసపరచి వశీకరణాదివిద్యల నెరపి దైవ సాహాయ్య మున్నపట్టుల నీ పట్టిన పట్టులు నెరవేరెనా ఆత్మకృతం బని యెన్ని యెంతేని యానందింతువో; కానినాడు నీ కాలునకు బుద్ధి గఱపుదువో! ఎంత తెంపరివి! ఏక కాలమున నెన్నెన్నియో దుండగములు సేయజాలుటకు నీ కడ శ్రీరాముబలగ మున్నది. కానిచో నింత యాగడములా నీకడ నూడిగములు సేయుచున్న వారును నీయంతవారలే! మరి సంశయింప బనిలేదు. కార్యాచరణములపట్ల నేమి, కార్యాంతపు బర్యవసానముల పట్ల నేమి, క్రౌర్యసాహిత్యము లయ్యు, నీ ప్రజ్ఞాప్రకీర్ణలు, బహు దుర్భరములు! నా యూపినంతమట్టు నే శంకించినంతవట్టు, నాయనుమాన నివారణార్థము, ముందు

రేపు రాత్రి, పతే లిలుజొచ్చి, చూడవలసియున్నది గదా యనిగదా, కుసుమగుచ్ఛము నమ్మి వచ్చితిని. పాపమామెను 'పతేలునకొప్పగించిన, నాతడు సేయున దేమి? ఏమిచేయుటకును నామె యొక్క వెర్రిబాగులది వెర్రిబాగుల దనియు, గులాబీలన జెవి గోసికొను ననియు, బోల్చికొనియేయుండువు పోల్చి కొనియే యుండిన, గులాబీలను దెచ్చెనో, తెప్పించికొని యామె కిచ్చి, యామె మనం బలరఁజేసి, త న్మన్ననల నంద నెంచక తప్పదు. కావున, నా నమ్మి యమ్మివచ్చిన సుమ గుచ్ఛము నామె శిరమున ధరించెనా దా శయనించునప్పు డయి నను పూ లినుమంత నడలినను, అం దుండిన చీటి యామె కంట బడకతప్పదు. ఆమెయే నా చీటి జూచుట సంభవించెనా, సర్వమును జయప్రదముగ సంభవమగును. కానినాడు ప్రమా దము లేదు—ఐననాడు ప్రమోదము తప్పదు. కానీ, చూచెద గాక తొలుత పతే లిలు; నీ వెంకి, అనంతరము మరి కొంచెము శ్రమమైనను ఓపికతో నీకొర కు త్తర క్రియల నెన్నెదగాక!'

అనుచు నరేందమ్ పూలయంగడి మార్గమునంబడి దల పోయుచు, తన మానససంద్రమున దన యూహాపోహాలను గభీరమగు నలల నడుమ గొట్టుకొనిపోవుచు, తన యిలు సేరెను.

# ఐ ద వ ప్ర క ర ణ ము

---

## వెఱ్ఱివాడు

### హిందూస్తాని—ఫీల్వా—ఆటతాళము

మక్కా-మదీనా దేశా హమారా
    మేరా నామా హై, కారిమ్ ఫకీరా॥
యాందమె జోగినీకె ఫిర్తాహుం
    ఇష్కు-మె ఉస్కె మై ముబె లాహుం ॥మక్కా॥
చార్ దిన్కు మై ఘాకా రహో హుం
    రాహె హోక్ మె కూచ్ ముజ్కు దేనా ॥మక్కా॥
జోగిన్ ముజ్కు రోఖ ది యాంథీ
    లేకె ఉస్కొ దుకు మేరే దేనా ॥మక్కా॥
బాదె ఆనేకె, తుమ్‌సె మై, షాది
    కర్నెవాలే హుం, తుమ్ యాద్ రఖ్నా ॥మక్కా॥
ఐసీ బా తోంక దే ఖర్ బరోసా
    ఉమర్ సబ్ మేరీ ఖద్ మత్మే గైనా ॥మక్కా॥
మైతో ఫిర్తాహుం హరకూచ జంగల్
    నాహీ దిస్తే హై, క్యా మేరా జీనా ॥మక్కా॥
రహోసె జానే వాలే అజీజో
    జోగినీకు కోయి, దేఖేతో బోలో ॥మక్కా॥

కై హజా రోంసె అఫత్ ప్రాతు
    ఆఖరష్ వృస్కి తస్వీర్ ఛాయ ॥ మక్కా-మదీనా॥ 18
జే హిరాసా కియా కాలూరాయ్
    అరజ కరతాహూం తుజసే ఖుదాయ్ 20

(భావము)

నేను మక్కా-మదీనా దేశవాసుడను 1
నాపేరు కరీమ్ ఫకీర్ 2
యోగినిని పొందుటకు తిరుగుచున్నాను 3
ఆమె సౌందర్యమందే నా మనసు లగ్నమైయున్నది 4
నాకు నాల్గు దినములనుండి తిండిలేదు 5
తిండి కేమైనను నాకొసగుము 6
యోగిని నాకొక యుత్తర మిచ్చినది 7
దానిని గురూజీ కిమ్మని నన్నంపినది 8
నీవు మరలి వచ్చిన పైని, నిన్ను పెండ్లి జేసికొందు
ననియు నన్నది స్థిరముగా నమ్ముమనియు, వాగ్దానము
చేసినది, 9-10
కొన్ని వాగ్దానములచే నా శాన గొలువ, తుదకు
నేను నాసర్వస్వమును గోలు పోతిని 11-12
ఆమెకొరకు నేనెంతో వెదకి వెదకి తుద కడవులును
దిరిగి నాను 13
ఆమె యెందుకు గానరాలేదు. నేనేమి చేయుదును— 14

ఓ పథికులారా, మీలో నెవరైన నను యోగినిని జూచి
యుండిన, నాకు దెల్పరాదా! 15-16
ఆమెకెన్నో వేల యాపదలఁ దొలగింప సహాయమొనర్చి
నాను 17
తుదకు నాకు దక్కినది ఆమె యొక్క ఈ రూప
పటము మాత్రమే! 18
కాలూరాయి నాకు చాల మోస మొనర్చినాఁడు 19
ఓ భగవంతుఁడా! నీతో మొఱపెట్టుకొనుచున్నాను. 20

అనుభావముగల ఈపాట బాడుచు, పురవీధులంబడి యొకానొకఁడు, చేతనొకనాగరికపు డప్పు వాయించుకొనుచును, భిక్ష మెత్తుకొనుచు, నింటింటికిని బోవుచు, ప్రతిగుమ్మము నెక్కుచును, దిగుచును, పాడినపాటనే పాడుచుండెను. 'ఇపుడు వేళ కా' దను వారును, 'చెయ్యి తెరిపి లే' దను వారును, 'మరల ర' మ్మను వారును, 'పో—పో' మ్మను వారునే గాని, 'అయ్యో! పాప' మను వారుగాని, 'ఇదిగో, ఇది పుచ్చుకొను' మను వారుగాని, ఒక్కరును గానరారైరి.

ఈతఁడు తన చేత నొక స్త్రీ రూపపటము పట్టుకొని దిరుగుచు, నాపటముజూపుచు, 'మాయోగిని నెఱుఁగుదురా?' యని గొంతెత్తి యరచుచు, దిరుగుచు, ఈశ్వరచంద్ర మిత్తర్ వీధిని బడి పాడుచుండ, నొక యింటినుండి నడిమి వయసించుక మీరీ మీరని వాఁడొకఁడు తనకలమును కాగితమును నటనునిచి

యీవలకు వచ్చి, వీనిపాటలను, పాటలోని మాటలను వినుచు నిలచియుండ, నీతండును, సహాయముపొందునూహతోనన వీని యెదుటకు వచ్చి, తనచేతిలోని పటమును జూపుచు, మరలనా పాటనే తొలినుండియు బాడుచు, నిలచెను. ఇప్పటి కేరును నింత శ్రద్ధగా వినలేదే యనియో, నింత శ్రద్ధగా వినుచుండిన నీతడు, తనకు సాయ మొనర్చి, తన యీప్సితము నెరవేర్చు నేమో యనియో, లేక, మరి యేయూహనో గాని, నిలువబడి పాడుచుండినవాడు, తన్నేరును గూరుచుండు మని యన నక్కరలేకయే యటనున్న యరుగుపై గూరుచుండి, మరల మరల నదే పాడుచుండెను.

'అయ్యా, నీ వెవరు?'

'యోగిని చేసిన జోగిని నేను—'

'యోగిని యెవరు?'

'నను జోగిని జేసిన యోగిని'

'ఔను—కాని, యా యోగిని యెవతె?'

'ఎవరయిన నేమి? నను జోగిన జేసిన యోగిని జూప గలరా?'

'ఆయోగిని యెవతెయో చెప్పినచో, నాలోచించగల నేమో,'

'యోగిని—నను జోగిని చేసిన యోగిని—'

'పోనీ, నీవెవరు?'

'జోగిని'

ఔనయ్యా; కాదనలేదు; నీ మొదటి పేరేమి?'

'కరీమ్—'

అన గోపాల్ చంద్ పూర్వోత్తర సందర్భములను గాబోలు, కొంచె మాలోచించి, 'సరే; నే నడిగిన భోగట్టా నీవు చెప్పినయెడల, నీయోగిని గూర్చి నేను, చెప్పగలను.' అని యనెను.

'యోగిని గూర్చి మరి చెప్పనక్కరలేదు. నేను చెప్పి నంత 'మీరు చెప్పలేరు చెప్పుటతో లాభములేదు నాయోగి నిని జూపగలరా?'

'నీ యోగినిని జూపినగాని నేనడిగినదానికి జవాబు చెప్పవా?'

'యోగినిని జూపిన గదా!'

'యోగినిని చూపుటయే ముఖ్యమా?'

'ఔను; కానిచో, మీప్రశ్నలవలన నాకేమి లాభము?'

'సరియే, రా—లోనికి రా—'

అని తన యింటి చావడిలోనికి గొనిపోయి, యోగిని రూపపటము నాతనికి జూపెను. ఆ రూపపటమున నాతడు జూచిన యది సుందర వదనారవింద యగు నొక్క పరిపూర్ణ చంద్రవదన; ప్రోత్ఫుల్ల సరోరుహాయతాక్షి; శిరీష కుసుమ కోమల శరీర; అత్యంత సౌకుమార్యంబున నవనవ లాడుచు

జిగజిగ మెరయుచున్న దంతపు విగ్రహము. హరినీలముల కన్నను మించియున్న నీలిమగల నునుగొప్పును, చూచువారల ముఖముల ప్రతిబింబింపజేయు జిగిగల నిగ్గుటద్దములో యను గండఫలకములును, వికసిత కమల నయనములును, కోడేరు చేసినరీతి నున్న తిలపుష్పముల దృణీకరించు నాసయు, గల నా రూపపట చిత్రిత మోహనాకృతి జగన్మోహన యన కవినమయముగాదు. బంగారు బొమ్మయుం బోలు నన నుపమానము కాదు. తటిల్లతయో యనుభ్రమ గొలిపించునన, భ్రాంతిమంతము కాదు. ఆరూపము నిలుకడ మెర పన వర్ణనము కాదు. రూపొందిన రతీసతి యన నతిశయోక్తి కాదు. ఇది యంతయు పొగడ కాదు. ఇట్టి నా రూపపటముం జూచిన యంతనే, మరల నీతడు—

మక్కా—మదీనా దేశా హమారా
మేరానామూహై కారిమ్ ఫకీరా.

అని పాడుచు, లాస్యము జేయుచుండ, నా లాస్యము తన కెరుకలేకయే నృత్యముగా మారి, తుదకది తాండవమై, యొడ ల్దెలియని తమకముతో, నా చిత్రపటము జూచుచు, పాడినదే పాడుచుండ, నాతని మనోవిభ్రమణము తేటతెల్లమయ్యెను. అంత నీ గోపాల్ చంద్, యాతని తాండవమున కడ్డు వచ్చి, 'ఏమీ, ఇప్పుడు చెప్పగలవా, యీగిని యెవతెయో?' అని యడిగెను.

'ఈమె—నా ప్రేయసి'

'యోగిని ఒకనికి ప్రేయసి యెట్లు కాగలదు ?'

'అయ్యో! యోగిని అనగా యోగినికాదు. యోగిని దాని మారువేసము'

'అయిన దాని మొదటి—అసలు వేస మేది' అని గోపాల్ చంద్, ఏమో వ్రాసుకొనుచునే ప్రశ్నించెను.

'అసలు వేసము కాదు; అసలు జగన్మోహనావతారమే.' అనుచు, సిపుడు తా నే పటమును జూచి తాండవ మాడుచుండెనో, ఆ పటమును, జూపెను.

'ఔనయ్యా; జగన్మోహనావతారమే కాని, దాని మొదటి పే రేమి?'

'ముద్దవాలు'

'అనగా?'

'భానోజీ'

'నీవు సరిగా చెప్పకున్నావు; వెర్రివెర్రి మాట లాడకు; బాగా తెలివి తెచ్చుకొని మరీ చెప్పు'

'ఏమీ! వెర్రా? మీకు బోధపడ దనండి'

గోపాల్‌చంద్ కొంచెము నిదానించి, తనలో దానా లోచించి, పోనీ, నీ వా యోగినిని, ఎప్పుడు, ఎక్కడ, ఆఖరు దఫా చూచినావు?' అని ప్రశ్నించెను.

'దాని కేమున్నది! తాను యోగినిగా అరిందమ్ యింట

నుండి, కాలూరాయికి వుత్తరము యిమ్మని నన్ను పంపినది. నేను వెళ్లి, ఉత్తరం యిచ్చి, తిరిగి 'వచ్చేనరికి, మరి యోగిని లేదు—నేను మాత్రము జోగినై, ఇంకా ఉన్నాను.

గృహస్థు తన ప్రాతపని జరుపుచునే యున్నాడు.

ఉత్తరము కాలూరాయికి యిచ్చి; నీవు తిరిగి వచ్చిన తరువాత, ఆమెను గూర్చి భోగట్టా చేసినావా?'

'ఆc—భోగట్టా చేసినాను ఏమి లాభము? అరీందమ్ యింట్లో పట్టుబడి, చనిపోయిందని కొందరు చెప్పగావిన్నాను'

'అయితే చచ్చిపోయిన మనిషి మళ్ళీ యేలాగు రాగలదని నీ విటుల వాపోవు చున్నావు?'

'అయ్యో! ఆ త్రిలోకసుందరి చచ్చిపోవడ మేమిటి?'

'ఏమి టామాట?—త్రిలోకసుందరులు చచ్చిపోరా?'

'అంటే నా జగన్మోహానావతారము చచ్చిపోవలసిన వ్యక్తి కాదు. ఎక్కడో జీవించే ఉంది'

'సరే, కనుక్కుందాములే నీవు అరీందమ్‌ను యెరుగుదువా?'

'అయ్యో! ఎరగడమూ! నిష్కారణంగా, పాపం—నా కేమిన్నీ అపకారం చెయ్యలేను సుమండీ ఆ అరీదమ్—దాని మాట విని, నన్ను ప్రేమిస్తున్నది గదా అని, దానిని శిక్షించుదా మని, మనప్రళయ మైనంత ప్రయత్నం చేస్తూ, ప్రపంచాలు తిరిగేస్తూ వున్న అరీందమ్‌సి, పాపం—అన్యా

యంగా, నిష్కారణంగా మత్తులో వుండి, ఒళ్ళు దెలియని సమయంలో తీసుకొనిపోయి, తాను సంతోషించి, వేగంగా 'నీకు, నీశా చేసుకుంటానంటూంది, గదా అని, అతన్ని తీసుకొనిపోయి రైలు వచ్చేసమయందరి పట్టాలమీద పడిశేశాను. ఆమాట తీరా చెప్తే, తనకి నిజంగా ఆపని యిష్టంలేకనో, లేక, అదో విషమో, గాని నేను చేసినపనికి తాను, చాలా పశ్చాత్తాప పడ్డదని ఆ తర్వాత విన్నాను. దాని ప్రేమకోసం, దాని ముద్దుకోసం, దాని మంచికోసం—ఇంకను చెప్పకే—నేను యెన్నెన్నో శ్రమలు పడ్డాను; ఎంతెంత పనులయినా చేశాను. ఎంచేస్తే యేంలాభం! నేను చేసిన ఘోరాలే నాకు దక్కటయింది గాని, మరి నా కది దక్కలేదు. దాని భోగట్టా మీా కేమయినా తెలుసే చెప్పాకూడదూ నాయనా?

'తెలియడ మేమిటి; నీకు సంపూర్ణమైన భోగట్టా యిచ్చి, నీకు వీలైనంత సాయంకూడా చేస్తాను. ఔనుగాని, ఉత్తరం పట్టుకుని కాలూరాయి దగ్గరకు వెళ్లానని అంటున్నావు గదా: అతడు యెక్కడ వుంటా డయ్యా?'

'ఎక్కడవుండడ మేమిటి! వాడికి, ఒక యిల్లు, ఒక గుహ అంటూ లేదు. ఎక్కడచూచినా వాడే. వాడు తిరగని స్థలం వుందా? ఇప్పుడు మీా యింట్లోకూడా వున్నాడనే నాకు నమ్మకం గాని, కొండల్లోను, సాధారణంగా చిరకాలంనుండీ జనసంచారం లేని సముద్రం ఒడ్లను, సభలు చేస్తూవుండడం

కలదు. పాపం యిత్తన్ని కూడా, ఆ అకీందమ్ పట్టాలనే ప్రయత్నం చేస్తూవున్నాడట. అయితే యీయన సాధారణంగా దొరికేమనిషి కాడు. నేను వుత్తరం యిచ్చిన మరికొన్నాళ్ళకి, నా జగన్మోహిని, నా త్రిలోకసుందరి యెక్కడవుందని నేనడగ్గా, 'పాపం చచ్చిపోయింది' అని—యీ చెప్పడం మొదటే చెప్పి, నన్ను పంపించేసినా బాగుండును. అలా గ్గాకుండా, అడ్డమైన చాకిరీ చేయించుకొని, గుల్‌సుమ్‌ని పాపం సిరాజ్‌హీను వద్ద నుండి తప్పించి, తన విహితుడయిన మదన్ మోహన్ పటేల్‌న కప్పగింత చేయించుకొని మరీ నన్ను పొమ్మన్నాడు. ఆ పొమ్మనడంలో యోగిని మరిలేదు—పొమ్మన్నాడు. నా చేత అరవ చాకిరీ చేయించుకున్నాడన్న దుఃఖం యేమిన్నీ లేదుగాని, యోగిని మరి లేదన్నాడు. అయితే వీ డొక అబద్ధాలకోరు; దగాకోరు; నమ్మలేము. యోగిని చనిపోవలసిన మనిషి కాదు'

ఇంటి యజమాని తన వ్రాతపని జేసుకొనుచునేయుండి ప్రశ్నించుచుండెను.

'మఱి నీ వందుకు విచారించకు. నీ తెలివితేటలకు మెచ్చుకున్నాను. నీవు కొద్ది రోజులపాటు మాయింట్లో వుంటే నీకు తగిన సదుపాయము చేయ బ్రయత్నించెదను. నీకు కావలసిన సహాయము చేయగలనేమో చూచెదను.

'మీ యింట్లోనే కాను. న న్నెక్కడ వుండమంటే, అక్కడే వుంటాను; ఎన్నాళ్ళుండమంటే, అన్నాళ్లుంటాను;

ఏమిచెయ్యమంటే, అది చేస్తాను; కాని నాకు ఆ యోగినిని తప్పకుండా వప్ప చెస్తారా ?'

'ఔను; యోగిని గూర్చి, తగిన భోగట్టా చెయ్యాలి కదూ మరి; అందుకు కొంచెము ధైర్యము కావాలి; నీ మాట సాయము మాత్రమే కావాలి.'

'అలాగే, తగినంత — అంటే — నాకు చేతనైనంత సాయం చేస్తాను — కాని, నాకుమాత్రం యోగినిని వప్పగిస్తారా ?'

'అలాగే—తగినంత ప్రయత్నం చేసి, ఆమెను నీకు వప్పజెప్పవలెనని యున్నది. కాని, ఒక్కమాట వుంది. నీవు చెప్పినమాటలు చూస్తే, ఆమెను గూర్చి సందేహంగానే వుంది. నీ మాటలవల్ల, ఆమె చావవలసిన మనిషి కాదనిన్నీ, కాలూరాయి మాటలవల్ల, ఆమె చనిపోయిన దనిన్నీ, తేల్తూ వున్నది. కాని, ఆమె జీవించియుంటే, క్షణంలో పట్టి తేగలను.'

'అలాగే—ఉంటాను. ఏదో, మీరుకూడా అడ్డమైన చాకిరీ చేయించుకొని పొమ్మంటే, అక్కడికి సరిపోతుంది— నాబ్రతుకు తెల్లవారిపోతుంది.'

'అలా గెప్పుడూ వుండదు. నేను కాలూరాయిని మాత్రం కాను సుమా! నాకు నీ సేవనిన్నీ చేయనక్కరలేదు. మా యింట్లో వుండి, నీకు కావలసిన సదుపాయములు పొందుతూ నాకు కావలసిన భోగట్టా లిస్తూ, ఆమాత్రం మాట సాయం చేస్తే, అంతే చాలును.'

'అలాగే, అదిన్నీ నాపనే గదా! గాని నా యోగినిని యెప్పటిలోగా నాకు వప్పజెప్పగలరు?'

ఇంటిమీరాయన తన వ్రాతపని మానలేదు.

'అ దేలాగు సిద్ధారణ చెయ్యగలను? నా ప్రయత్నము; ఆమె జీవించియుండుట, తుదకు నీయనుగ్రహము—ఇన్నింటిపై నాధారపడి యున్నది నీ యీప్సితము. మఱియు నవుడవుడు, నే గోరుచుండు విషయములకు, నీ విచ్చుచుండు భోగట్టాలు అన్నింటికి, ముఖ్యములు సుమా!'

'అయితే, మీకు కావలసిన సంగతు లేవో, వేగం అడిగెయ్యండి నాకు తెలిసినంతమట్టుకు, ఇప్పుడే చెప్పేస్తాను. అక్కడికి నాపని అయిపోతుంది.'

'అలాగు ఒక్క మాటే అడిగివేయుటకు, ప్రశ్నలు నిర్ణయించబడి, యుండలేదు అయినను, అడుగుచును చుంటిని కావున, నిదిగో చూడు—సిరాజ్ హీన్ భార్య......'

'ఎవరు—గుల్ సు మేనా?'

'ఏమీ! నీ వామె నెరుంగుదువా?'

'అయ్యో! ఎరుగ కేమి! ఒక వర్షాదినమున, సీప్రా నదీజలముల స్నానము జేయబోయిన గుల్ సుమ్ ను, మాయోపాయమున దీసుకునివచ్చి, కాలురాయికి వప్పగించినది, నేనే. ఆ తరువాత కాలూరాయితో కలిసి, వెళ్ళి, గుల్ సుమ్ ను షకేలునకు వప్పగించినదియును నేనే.'

'ఇంత శ్రమలు పడినావుగదా ! గుల్‌సుమ్‌ను సంపాదించడములో—నీకు అతి డేమైనా సహాయము చేసినాడా ?'

'అనగా, నాకు తోడెవరినయినా పంపినాడా అనా, లేక, నే నాపని చేసినందుకు, నా కేమయినా బహుమతీ చేసినాడా అనా—ఏది మీ అభిప్రాయము ?'

'ఔను—రెండును—'

'అలాగా; నా కొక చిన్న సబ్ మెరీన్ యిచ్చి, ముగ్గురు మనుష్యులనుకూడా తోడిచ్చి, పంపినాడు ఇది యొకటి ఇక రెండవదీ, నాకు యిచ్చిన బహుమతీ, 'యోగిని లేదు— చనిపోయె నని చెప్పి, 'పో' పొ మ్మన్నాడు. ఇదే బక్షీష్.'

'అబ్బా ! ముగ్గురు యితరు లున్నా, నీవున్నా కూడా కలిసి వెళ్ళవలసి వచ్చినదా ?'

'కాదా మరి; బ్రహ్మాండ మైనంతపని. ఆ చిత్రకథ అంతా చెప్పినయెడల, మీరే ఆశ్చర్యపోతారు. యోగిని, మొత్తానికి నన్ను పెళ్ళి చేసుకుంటానని నమ్మించి, గొంతుక కోసే శింది ఇదిగో, ఇలాగు దానిపేరు పెట్టుకుని జోగి నైనాను '

'అవునయ్యా, ఇప్పుడు యోగిని కథ యెందుకు ? గుల్‌సుమ్‌ను గూర్చికదా మాట లాడుకొనుచున్నాము !'

'ఆఁ—అవును. అయితే అదంతా యిప్పు డెందుకు ?'

'అయ్యో ! అలా గనకూడదు. నీవు చెప్పే ప్రతిమాట యును, నాకు అవసరమే ఏల నందువేమో, యోగినిని కని

పెట్టుటకు ఏ సందర్భంలోనైనా భోగట్టా, దొరకు నేమోయని, చూచుచున్నాను. నీకు యిష్టం వుంటేనే చెప్పు; లేకుంటే లేనేలేదు ఇప్పుడు నాకు మించిపోయిందేదీ లేదు.'

'ఆ—అయ్యో! చెప్ప కేమి; నా యోగిని దొరికే మార్గం వుంటే, ఏమైనా చెప్పగలను.'

'ఏమో, అ దెవరు నిర్ధారణ పరచగలరు? నీవు, జరిగినది జరిగినటుల, చెప్పవలెను—నేను వినవలెను; అందుపైని, నీవు చెప్పినదానిలో పనికివచ్చే భోగట్టా, ఎంతకలదో, చూచుకొనవలెను. ఇంతపని ఉన్నది కనుక నీవు చెప్పవలసినది చెప్పు.'

'సరే—చెప్పెదను. కాని, మళ్ళీ మీ ప్రశ్న అడగండి.'

'ప్రశ్న కేమున్నది? నీ వెటుల గుల్‌సుమ్‌ను తీసుకొని వచ్చి, కాలూరాయికైతే నేమి, పటేలునకైతే నేమి, వప్పగించగలిగితివో—అదీ—నాకు కావలసిన భోగట్టా.'

'ఇంతేనా? సరే; యోగిని—కాదు— కాదు. గుల్‌సుమ్ సీప్రా నదీస్నానముకొరకు పడవమీద పోయియుండగా నదివరకే పాటలీపుత్రమునకు, లౌకిక కార్యములకొరకు, సిరాజ్ హీఁగా పోయియుండెనని, మొరుగును గాబోలు — వాడెక్కడండీ, ఇంద్రలోకపు భోగట్టా అయినా—తనకు కావలసి ఉండాలి గాని—సముపాల్లో తెప్పించుకుంటాడు—నన్నున్నూ, మరి ముగ్గుర నున్నూ, ఒక చిన్న నబ్ మెరీఁగా యిచ్చి, పంపినాడు. మేమున్నూ వెళ్ళి, ఆ పడవతో సమముగా పోసిచ్చి,

మా నబ్ మెరీణా కోరి ముంచివేయుచు, తనకు దానుగా మునుగుచున్నట్లును, అవ్యసహాయాపేక్షితులముగా నున్నట్లును వారికి దోపజేసి, వారిచే రమ్మని పిలువబడి, వారి పడవనెక్కి, నేనే ఆపడవను నడుప వారి యనుమతి వడసి, సరియైన మార్గమున బోనీయక, అప్పటికి వీచుచున్న ఝంఝూమారుత సహాయమున, నా యీప్సితము నెరవేర్చుకుని. జైన దేవాలయ సమీపమున నున్న ఒడ్డున నాపి, రాత్రిపూట మరిప్రయాణము చేయరాదని చెప్పి, ఆరాత్రిని దేవాలయమున నందరమును పరుంటిమి—సరేగాని, ఇప్పటికి చెప్పినదానిలో యోగిని యెక్కడయుండునో, మీరు చెప్పుటకు తగిన భోగట్టా దొరికినదా?'

(స్వగతము) 'అన్నా వీనికి యోగిని వెర్రి బాగావట్టినది.' (ప్రకాశముగ) 'లేదనుమా.' ఇప్పటికి దొరకలేదు. కాని, ఇకముందుకు, నీవు చెప్పబోయేదానిలో దొరకు నేమోయని, కనిపెట్టి చూచుచున్నాను. ఔనుగాని, మీరునల్గురును వారి పడవపైనె ట్లెక్కగలిగితిరి?'

'ఏమీ, వెళ్ళిన మేము నల్గురమును, స్త్రీ వేషములను ధరించితిమి. అం దొకతె ఇందూర్ రాణి—తక్కినవా రామె పరిచారకులును—నేను నావికురాలను—'

'సరే: తరువాత—'

'తరువాత అంటే?'

'దేవాలయములో నందరును పరుండిన తరువాత—'

'ఆ—అలాగు చెప్పండి మరేమున్నది వారందరును నిద్రేకదా! పెద్దపని మీద పెట్టుకొనియున్న మా నలుగురికిని, నిద్ర పట్టదుగదా. నా కదివరకే కాలూరాయి యిచ్చియున్న క్లోరోఫారమ్‌సీసా, తువాలును, ఉండనే ఉన్నవి మంచి రాత్రిప్పుడు, క్లోరోఫారము తువాలున జల్లి, గుల్‌నుమ్ ముక్కువద్ద కొంచెము సేపు, నిమూసు చూచుకుని, ఉంచి, ఆమెను, నేనును మరి ముగ్గురును యెత్తుకొనిపోయి, పడవలో వేసి, నడుపుకొనిపోయి, ఆ సబ్‌మేరీన్ వద్దకు పోయి, అందామె నుంచి, కాలూరాయికడకు గొనిపోతిమి.'

'అనగా, ఎక్కడికి?'

'కాలూరాయి వద్దకే—'

'అవును—అతనిప్పటి కెక్కడ నుండెను?'

'మెడ్రాస్ బ్రాంచి మీటింగున—'

'బాగా చెప్పకుండా వున్నావు—'

'ఇంకా యెలాగ చెప్పడం! ఇక యోగిని లేదంటారు గాబోలు! అలాగే కనపడు తూంది' అని, 'మక్కా-మదీనా దేఖా హామారా' అను పాటను మరల పాడుచుండెను

'ఔ నౌను, అయితే, నీవును కాలూరాయియును కలిసి గుల్‌నుమ్‌ను పఠేలున కప్పగించినపుడే గదిలో నుంచెనో?'

'మే మిరువురమును గలసి, ఆమెను పఠేలున కప్పగించగనే, ఆయన ఆమెను, తన మేడ పై భాగమున, తుంర్పుదెనను,

రాచమార్గమువైపున నున్న గదిలో, నుంచియుండెను. ఇప్పుడచ్చటనుండి యెక్కడకు మార్చియుండెనో చెప్పజాలను. ఇంతకుమించ మరి నా కేమిన్నీ తెలియదు. సగియా—ఊం; యోగిని భోగట్టా? ఇంకా కావలెనా?'

'లేదుగాని, చాలాపని చేసినావు కాని—'

'అదుగో, నా పాపమే నన్ను కొట్టేశింది. ఇంతపనీ చేయించుకొని, ఇప్పటికైనా నా త్రిలోకసుందరిని నాకు వప్పజెప్పాడా? ఎంత హంతకు డనుకున్నావు కాలూరాయి!'

'అయితే గుల్నుమ్ యిప్పుడు పటేల్ గారి ఆశాలో వున్నదిగదా! ఆయన కామె లోబడ్డదా?'

'గుల్నుమా—పటేల్‌కి లోబడ్డమా—కల్లోనా ర!'

తన వ్రాతపని చేసుకొనుచునే యింటి యాతడు—

'అయితే, మరి పటేల్ చేసేపని యేమిటి?' అని యడిగెను

'ఏమిటి చేస్తాడా? బుర్ర కొట్టుకుంటాడు. ఇంతకన్న మరియేం చెయ్యమన్నారు?'

'అదికాదు. వరే బామెను లోబరచుకొనుటకు తగిన ప్రయత్నం చెయ్యడం లేదా?'

'ఓ, చెయ్యకేం! చేస్తూనే వున్నాడు; ప్రత్యేకం గదిలో వుంచాడు; తగినన్ని సమపాయాలు, ప్రయత్నాలు చేస్తున్నాడు. ఒక చెలికత్తెవంటి దాసీదాన్ని వప్పగించాడు. రోజూ సాయంత్రం, తాను స్వయంగా పూలదండలు, పూలగుత్తులు,

అందులో ముఖ్యంగా గులాబీ పూలచెండ్లు కొని, పట్టుకొని, వెళ్తావుంటాడు.

'ఔనయ్యా, నాకు తెలుసును'

'అయితేనేం ఆవిడకిప్పుకోటుందా? ఇలాంటిపన్లకు లొంగుతుందా? పోపొమ్మంటుందిగాని! ఎంతో కష్టపడి, పూబంతులు మొదలయినవి తీసుకవెళ్ళి పాపం యిస్తాడా— అన్నీ చింపిచింపి పారేస్తుందిగాని, ఎక్కడయినా ఆనందంగా వంతోషిస్తుందా?

పూగబ్బలను చింపివేయునుకదూ!'

'ఏ దెలాగున్నా, కొనకి నా జగదేకసుందరిని నాకు వప్పగించేశాడా? ఇలాగ నేను వటారించిపోతున్నాను గాని— నేను అందరికీ పనికొచ్చాను గాని, నా కెవరూ పనికొచ్చారు కారు గదా అని మాత్రం నేను దుఃఖపడక దప్పదు.'

'సరే, అట్టేవిచారించకు. ఏదో పనిచేసి చూదాములే; నీఅదృష్టం ఎలాగుంటే అలాగుజరుగుతుంది అక్కడేవుందు.'

---

## ఆరవ ప్రకరణము

---

### నాటకాంతర్నాటకము.

'ఏమే, నీలాంబరీ, ఏమి చేయుచున్నావు? రా—ఇటు రా. మొన్న సాయంకాలము సుమా రేడు గంటలకే గదూ,

నా దెచ్చిన సుమగుచ్ఛము జింపివైచి, చిందరవందర జేసినది! నే నిచ్చిన గడువు నిన్నటి రేయితో సరి. రాణీర మ్మను, గుల్సుమ్‌ను—ర మ్మనుము. ఇదిగో, తన వలపుకాడు సిరాజ్ హీను డిట, తన కొర కెదురు తెన్నులు జూచుచు, వేచియున్నా డని చెప్పి, తోడ్కొని రమ్ము.'

'చిత్త' మని ఆప్రకక్క గదిలోనికి బోయి, నలుదెసలును గలయంజూచి, యొక్కగంతున నీవలంబడి, 'బాబో!' యని పెద్ద యరపరచి, కంపితదేహవల్లితో, నా నీలాంబరి నోట మాటలేక యూరకుండెను.

పిదప, తా నా గదిలోనికి బోయి, మరలివచ్చి, స్తంభించిపోయెను.

'అయ్యో! ఏమి యాశ్చర్యము! ఎంత విడ్డూరము!! ఎంత మోసము!!!' అనుచు పటేల్ అన్నుడయ్యెను.

ఔ నౌను; నాటకమున నంతర్నాటకమే!

'గుల్సుమ్, ఎం దేగితివి? తొలినుండియు నిను, ప్రాణసమానురాలుగ నెంచిన నను గాదని, ఎందు దాగితివి? నిను గూర్చి నే నానవడిన యన్ని వాళ్లు, నీకొరకు నే వెత లందినన్ని నా ళ్ళయినను, నను, నీ యంపాగవీక్షణముల, నీ కడగంటి చూపులనైన జూడవైతివిగదా! ఏమిది! సిరాజ్ హీనే యింత దారుణకార్య మొనర్చియుండునా? మొన్నరాత్రి పదు గంటల సమయమునకు నిన్ని గదిలో నుంచియే స్వయముగ తాళము

వేసి యుంచితినిగదా! తరువాత తలుపుదీయుటయు నివుడిపుడేగదా! అదియు నేనేగదా! మరి నీ వెందేగగలవు? ఈ గదినుండి నీ వెట కేగుదమన్నను మరి మార్గములేదే! గాలి వచ్చుటకు మాత్రమే అంతయెత్తున గిటికీ కలదు. దాని కమర్చి యున్న యినుపగజములు లూడనీయు నేరికిని వశముకాదుగదా! కానిచో నిందు కేమందు? ఇక ముందున కెటు ముందు? అయ్యో! ఇది గారడీవిద్యాప్రభావమా? గజకర్ణ గోకర్ణవిద్యల యమోఘఫలితమా? కాక ఇంద్రజాల మహేంద్రజాలముల పర్యవసానమా? లేక నా కనులకు గుల్సుమ్ వలె నగుపడిన ఆ బంగరుబొమ్మ—ఆ మాణిక్యపు ముద్దుగుమ్మ—యొక భూతమా? ఇవి యేవియును గాక గజకర్ణ గోకర్ణవిద్యా నిపుణుడును ఇంద్రజాల మహేంద్రజాలముల నెరింగినవాడును అని వాకొనం బడుచున్న గురూజీ నాచే బహూకృతు లంది బహుమాన మందద మానసమున నెంచి కనికట్టొనరించి నాకుగాను తయారుచేసిన గారడీ బొమ్మయా! ఏ దేటు లున్నను నే నిపుడే పోయి ఈ కలకత్తాలో జరుగనున్న మదరాసు బ్రాంచి మీటింగునకు రాగల గురూజీని తప్పక గలుసుకొని జరిగిన దంతయు సవిస్తరముగ విస్తరించి ముందుసేతల నడిగి చూచెదను. ఇంతకును దైవవశమున గురూజీకి సొమ్మొందలేదుగదా!

---

## ఏడవ ప్రకరణము

### అమోఘసమావేశము

'జయ్ శాంకరీ! జయ్ భగవతీ! జయ్ కాళీ! జయ్ మహాకాళీ! భూత ప్రేత పిశాచ భేతాళ మోహినీ కామినీ శాకినీ ఢాకినీ లోకభయంకరా! జయము! జయము!! ఇదే సర్వదిగంగనామణులచే నీరాజనం బంది దశదిశల వెలుగొందు తన కీర్తికాంత యను సంచరావాహుపమ్ముం బోలు తన పవన విమానమున నిదే సభాధ్యక్షత వహింప నిలాతలమ్మున కరు దెంచు చున్నాడు.' కరతాళధ్వనులమధ్య సధ్యక్షు డుత్తమాసనము నధిష్ఠింప నాతని యర్ధాంగి యగు 'మాయల' సవినయమ్ముగ నాతని పాదరాజీవమ్ముల కెరగి 'పంచభూతాధినాథా నాథా! మీరాక రాకయుం బోలె అన్మద్లోచనచకోరంబులకు బెనుపండువ యొనర్చుచున్నది. ఏ ముగునో ఎట్టి యవాంతరములు వాటిల్లునో యని బెంగటిలి పునర్దర్శనం బగుదాక నా మనోవ్యధకు మితిలేదు. ఇనుపసుందనము మీరు దొరచు నవసరమును నవకాశమును గలుగునంత వరకును నా గుండియ లదరుచునే యున్నవి నాకు చేతనైన పని చేసితిని గాని నే ననుకున్నటులనే జరుగు నను నియమము లేదే! ఏమో పనివానిచేత దీయించు బ్రయత్నమే వారి వారి ప్రసంగము

దాని కాళ్ళముకొరకు తంతి నంపుట లేక లేఖ వ్రాయుటలోను గాగల యూహాలే బలవత్తరమైనను నా యూహా లన్నియును నా పన్నాగము లన్నియును వృధా కావలసినవే గదా! మఱియు మీకు దరుణమే చిక్కకుండునే! ఇంతయేల? మీ రదివరకరీందమున కంపిన తంతి మనియార్డరు మిథ్యయని చంద్రమౌళి తంతివలన నరీందమ్ తెలిసిన పిదప—దైవవశమున శాంకరీ కృపవలన నా మంగళసూత్ర మహిమవలన—మీకు తప్పించుకుని రాగలిగి తిరిగీ నాకంట బడేరిగనుక సరిపోయినది గాని కానిచో మీపని యేమగును?—నాగతి యే మగును? అరీందమ్ బుద్ధి గడ్డి తిన్నదిగనుక సరిపోయెను గాని—కథంతయు నడ్డముగ దిరిగి అంత ప్రయత్నమును నింతలో గడ్డిపరకవలె నెగిరిపోవలసినదే గదా! కాని నేనుమాత్రము నా జాగ్రత్తమీద నుండకపోలేదు. మెకానిక్ చేత తీయించుటకు వా రాలోచించి 'ధర్మోమియాను' తెప్పించి ప్రయత్నము చేయుచుండినంత సేపును నే నదియంతయును గనిపెట్టుచు నుంటచే నాకు నవ్వు వచ్చుచుండెను. బుర్ర కొట్టుకున్నను వానివశమా? బ్రహ్మ దిగి రావలసినదే గాని వానికి చేతకా దని వెనుకకు తగ్గగనే త్రివిక్రమరావునకు వ్రాయ వా రాలోచించుచున్నపుడు గూడ నేమి తేలునో చూతు మని యుంటిని. వారి యాలోచన మీ చెవిని బడుటయు నాపనికి మీరే సంసిద్ధు లగుటయు జూచి తెలుసుకొని సంతసించితినిగాని కానిచో నదివరకే మెకానిక్

వేషమున నాందోళనతో నెప్పు డెప్పు డని వేచియుండిన నేనే ముందుకు వచ్చి ఆ పని నేనే చేయవలసియుండును. అప్పటి స్థితిగతులు కేవలము మారిపోయియుండును.'

'నీబుద్ధికుశలతకును నీ ప్రేమకును నాధన్యవాదములు.'

'మంట కెగయుచు మీా రాడిన మాటలును వింటిని.'

'ఔను. నీ బుద్ధికుశలతకు నాకు కలిగిన యానంద మందువలన నీకు దెలిసికొనియుండును' అని జరిగిన చర్యలను గూర్చి మఱియు మఱియు ప్రశంసించుచు 'ఔనుగాని నా కొక్కసంగతిమాత్రము బోధపడలేదుసుమా' యని యనెను.

'ఏమీా; ఏది మీాకు బోధపడలేదు ?'

'నేను ఇన్ష్యూరెన్సుకవరు బటువాడా (డెలివరీ) పుచ్చు కొనుటకు మన 'యమానో'ని మధుసూధనలాల్ అను పేరుతో కార్ మీాద నంపగా నాకంటెను ఇన్ష్యూరెన్సు కవరు డెలివరీ పుచ్చుకొని వచ్చి నాకా కవరు నిచ్చుట నే నెరుంగుదును. నేనా కవరును పుచ్చుకొని అది చింపుటకూడా నే నెరుంగుదును. నరి ఆపై కథ మరి నే నెఱుంగను. మసగుహలో నున్న నీవును మరి యిరుగురు ప్రయాణీకులు యీాడవాండ్రును ఏమి జరిగినదో చూచియుందురుగదా అది సవిస్తరముగా చెప్పగలవా ?'

'అయ్యో ! చెప్పుటకేమి ? ఎంత చిత్రమైనా జరిగినది. మీారేమిటో అరిందమునితో లోపల తలచుచున్నారు గాని మీాలోకూడా కొన్నికొన్ని లోపాలు లేకపోలేదు. అందులోను

లోపాలన్న లోపాలా! కొంపముంచే లోపాలే; కొంప ముంచడ మేమిటి? చివరకు వీళ్ళమీదికే వచ్చినది కాదా? ఇంకేమి కావలెను? ఆ ప్రయాణస్థుల ఆడవాండ్రను ఆడవాండ్రను కొనుచున్నారుకదా అమ్మో! వారున్నూ మనకు శత్రుకోటి లోనివారే. మొదట తెలుసుకోలేకపోయినాము గాని—'

'నేను అనుమానించినట్టులే అయినదా? అబ్బా! ఎంత పని! మొదటే అనుమానించినాను కాని—'

'ఔ నౌను. మీ రా కవరు చింపుట నే నెరుగను. మీరు క్రింద పడియుండగా, మీకు కొంచెము దూరముగా, ఒక సీళ్ళతో నుండిన కవరు పడియుండెను. మన 'యమానో' మీకు శైత్యోపచారములు చేయుచుండగా చూచి, నాకు దోచిన సదుపాయములు నేనును, జేయుచుండగా, అకాత్తుగా కొందరు గుంపుగా వచ్చుచుండుట యెరింగి, నేనును దూరముగాపోయి, అన్నిచర్యలును గమనించుచుంటిని. వారినిచూచి, వెంగటిలి, 'యమానో' యను దవ్వ్యాల కరుగ, 'నాకా! యజమాని నొంటరిజేసి, అవిశ్వాసి, వై నీ క్షేమమును, నీ సౌఖ్యమును, నీ సౌకర్యమును జూచుకొనుచుంటివా?' యని నేను వానిని నిందించి, దొడ్డాప్పులనుండి గమనించు చుంటిని గాని, నాథా! యేమని చెప్పుదును నా మనోవ్యథాభరము!! మరి చేయుటకు నా కేదియును, దోపక, మనవద్ద నడివరకున్న ప్రయాణీకుల యాడువాండ్రను సహాయముకొరకు వెళ్ళుమని

చెప్పుటకు వారికొరకు చూతును! ఏరీ, మరి!! ఆ వచ్చిన దొమ్మిలో సత్వరము జేరి, వీరును వారును గూడ గలిసి, తెలివి దప్పియుండిన మిమ్ముల నొక్కసారిగ నెత్తుకొని, పోవుచుంటిరి మనవారెవరును సమీపమున లేరు కావున మన 'యుమోటా' అయినా లేదు. ఏమిచేయుటకును పాలు పోలేదు సరిగదా, ఆ కవరునం దేమి యుండెనో మీకు స్మృతి దప్పినదో ఆలోచించుటకు గాని, ఊహించుటకుగాని, అప్పటి కవకాశము చిక్కలేదు సరేగదా, ఇప్పటికిని నాకు బోధపడలేదు. మన 'యమానో' ను—ఇదుగో, ఇక్కడే ఉన్నాడు—యమానో ఏమిరా! ఆ కవరున నేమియుండెనురా?'

'ఏమో, బాగా పరిశీలించుటకు వీలు లేకపోయెను గాని, అందొక చిన్న పట్టుదారముతో కలిపి యుంచిన బహు పలుచని పట్టుసంచి యున్నటుల గానవచ్చెను. అదియైనను బాగుగ పరిశీలింతు మన్నను, దాని నైన నుండనీయక, ఆ వచ్చినవారిలో స్ఫురద్రూపియగు నొకడు దానిని తన జేబున నిడుకొనిపోయెను. ఏమి యేర్పాటు! ఆ వచ్చినవారును, ఇక్కడ నుండిన యిరుగురు స్త్రీలును, నోట మాటగాని, కాలి సవ్వడిగాని లేకనే, కను రెప్పపాటున నంతయు జేసి, మిమ్ములను దీసికొనిపోయి, నన్నంధకారమున ద్రోసిరి'

'ఆఁ—ప్రయాణస్తు లనుకొని, మనవద్దనే మీరుంచిన స్త్రీలు, స్త్రీలుకారు, మీకు దోచకుండుట మీ లోపములలో నొకటి కాదా!'

'నే ననుమానించక పోలేదు మఱియు, లాల్‌చంద్ యింట గది తాళము తెఱువబోవునప్పుడు గూడ, నే నెవరిని నావెంట దీసికొని పోయితినో, వా డరిందమ్ అయి యుండ నోపునని యనుమానించియే వానిని దీసికొనిపోయితిని. తక్కిన వారును వానియనుచరులై యుందురనియు దలంపక పోలేదు కావుననే వానిని నావెంట దీసుకపోతిని. నా డా గదిలో నుంచ బడినపిదప, వానిని నే ననుమానించుచునే మరలితిని, నే ననుమానించినటులనే, వానివలననే, ఇంత కొంపమునిగినది!'

'సరే—ఎవరివలననైన నేమి? కాలిగ్గదే అయినది. అయిన దానిని గూర్చి అంవిగా విచారించుట సుజన పద్ధతి కాదు. ప్రతిహాతను యుండినచో, యెత్తుపై యెత్తులు వేయ గలిగినచో నవి గమనించుటే గదా కర్తవ్యము.'

'మఱియొక మాట—మీరు పరోక్షములో పోవుచుండగా, అరిందమ్ యెంతపని చేసెనో చూసినారా!'

'ఔనౌను— మిన్‌టు గన్ ప్రేల్చినాడు!'

'అందుకు నాప్రతిహాతమో!'

'చెప్పుట కేమున్నది! నీ వందుంచిన సెర్చిలైటు నందుకొని, నా మానసమున, నీకు ధన్యవాదములిడి, నీ సాహసమునకును, నీ బుద్ధికౌశల్యములకును, నాశిఃపరంపరల నొసంగితిని. అపుడా సెర్చిలైటు సహాయమే లేకున్న, నా కేమియు దిక్కును దెసయును దోపక యేమగునోగదా! మఱియు,

నీ యరిందమ్ మొన్న మొన్ననే అమలులోనికి వచ్చిన నామిస్టు గన్ యెంత వేగము దెప్పించి వాడుచున్నాడు!'

'అది సరేసరి; తుపాకితో మిము గాల్చి చంప బ్రయత్నించు చుండెనని ఆమొద్దులు తలంచి, సర్కిల్ ఇన్‌స్పెక్టరు మొదలగువారు, వానిని వారింప బ్రయత్నింపగ, 'నయ్యో! బుద్ధిహీనులా' యని యనుకొంటిని. కాని ఆ మంద యంతటికిని, అరిందమ్ తరువాత, ఇప్పటికి నిలచియున్నవారిలో, ఒక్క మంగళ్సేన్ మాత్రమే, యాతని చతురిమ గొంతవరకైనను నెరుంగ బ్రయత్నించుచుండును. మీరు మింటి కెగసినపిదప, నాయనుప మందనపు చేతనున్న నేర్పరితనమును గనిపెట్టనెంచి, మంగళ్సేను దాని పలుక లన్నియు నెటుల ప్రాస్వీకరింపబడెనో పోల్చుటం జేసి, మరల వానిని సమన్వయింప జేసి, మీదికప్పు వేయక, అందుదిగి, పరీక్షించి, చూపెను. మీరుమింటి నంటుటయు, నరిందమ్ ఆశ్చర్యమును, విచ్ఛిన్న మనోరథత్వమును, సిగ్గును, విచారమును, అవమానమును సూచించు మోమున, మీదెస జూచుచుండ, మెకానిక్ వేసమున, చిదృతుడు లోనొక్కడనై, అంతయు బరికించుచు, నేను నవ్వుచు నిలచితిని.'

'ఔనౌను. వాడక్కడ— జమలకాలము నుండియు బనిచేయుచున్నాడు. కాని, మొదటిమాటు మిస్టుగన్ నాకు మిన్న మాన్పులు మఱి గానరానీయలేదు. విమాన మొగురు నప్పుడం దేమిగలవో, చూచుటకైనను, వీలు చిక్కలేదు.

మన గోట్టముతో నీ రుండుట జూచితిని, మఱియు నేమేమో కలవుగాని, నాకు మఱి దేనియందు దృష్టి లేకుండెను. నాత్రోవ నీబుద్ధి నైపుణ్యమును మాత్రమే, నాకు దృక్పథముగా యుండెను. కావిరి దగ్గ నారంభింపగనే విమానమునందున్న వస్తుచయము దిలకింప, నందా సెర్చిలైటును, మఱియు నేమేమో కలవుగాని, యనియెల్ల నాకేల? బ్రదుకు జీవుడా యని యనుకొని, సెర్చిలైటుకు పవరీయ బ్రయత్నించుచుంటిని. మరల మిస్టుగన్ ప్రేల్చివాడా సాహనుడు! 'ఇంకను— మఱియునింకను బేల్చుకొనుచుండుము' అని యనుకొని, ఫుల్ పవర్, గేజ్ చూడకనే, యొకేసారి యిచ్చితిని, సరి; మరి—మిస్టూ లేదు— గన్నూ లేదు— నేను పవరూ, గేజ్ మొదలగునవి చూచుచు జాలము జేసితినా, తాను తుపాకి బేల్చునో, తానును నొక విమానముతో, పను వెన్నాడునో యను ననుమానమున, తుపాకి లేటున కందనంతదూరమును, తన పవనవిమానము నను వెంట నంటజాలనంత దూరమును, బోవలె ననుదలంపున, మొదటి సంపూర్ణ కాంతిప్రసారము (Gush of Light) లోనే చాలదూరము పోనగును గదా యని, వెనుమును లాలోచింపకయే ఫుల్‌పవర్ యిచ్చితిని.'

'ఔనౌను—మీ యనుమానమును నిజమే. మాటలనందడిని మరచితిని. తానును ఒక విమానము సిద్ధము జేయక పోలేదు. కార్యము లేదని దోచినది గాని, కానిచో, మిము

వెంట దరిమియేయుండును తెచ్చిన విమానమును మరల గొనిపోవునని చెప్పెను. అన్నియును నేను జూచుచునేయుంటిని. అరిందమ్ చేతలకు విస్మయ మందుచునే యుంటిని.'

'అబ్బా! ఆ ప్రయత్నమును గూడ జేసెనా?'

'అయ్యో! అంతటితో నూరకుండెనా! ఏమి చేయుటకును దోపక గాబోలు, మఱెట్టి కార్యకారియని యెంచియో గాని, మెడకో, కడుపునకో గాని, యేమో దగిలించిన యొక పావురమును, మీ విమానముదెసజూపి, వింటి కెగురవేసెను. దీపము పెట్టు వేళవరకును జూచుచుంటినిగాని, పిదప దృక్పథమే దాటుట, నేమియు గనుంగొనజాలక, నాత్రోవను బోతిని.'

'ఇదియొకటి గూడ జేసెనా! అబ్బా! కాకతాళీయముగా నాబస, మార్చివేయుటే, మంచిపని యైనది'

'ఔను గాని, మీయట్టిమాయలమారులకును, అరిందమ్ నను మాత్రమే జోడీ! ఇంకెవరు లేకున్నను, రెండవవాని బుద్ధికుశలత గానరా వీలులేదుగదా యని దలంచుచుందును.'

'ఔనౌను; నన్నలజడి నొందజేసి, నాకొత్తుడు గలుగ జేసి—మనసున కొకింత శాంతి దెచ్చిన దెచ్చుగాక, గాని—వాని సమయస్ఫూర్తికిని, వానిదూరదృష్టికిని, వానిబుద్ధినిపుణతకును, దప్పక వానిం గొనియాడి, ధన్యవాదము లొసంగవలసినదే నా యెత్తులును, వాని పైయెత్తులును, నా యెత్తుపై యెత్తులును, ఒండొంటిని మించియున్నవి గదా!'

'అయిన దేమో అయినది గాని, అరిందమ్‌నీ విూరింత కలత జెందించుట కేమి కారణము ?'

'అరిందమ్‌నకు కలతయా! ఏమి వెర్రిమాట! ఆతడన్న నో మిన్నులు విరిగిపైబడినను, తన మన మొకింతయైన జలింప నీడు. హిమవన్నగ ధైర్య మాతనిది. నే నంత పంతము పూనుటకు గారణమా? ఓ—కావలసినంత కారణ మున్నది. మన ప్రియశిష్యుడును, అలహాబాద్ బ్రాహ్మణకుమారుడును నగు బిన్నాతును, నే నెన్నెన్నో శాస్త్రముల నారితేరినవానిగ జేసి యుండ, నాత డీతని కారణముననే ప్రమగ్గెను. పిదప, నానా ములు దయూరుచేయుచున్న నన్ను బట్టుటకు బ్రయత్నములు సేయుచుండ, లజపతిమోహన దేవు భార్యయు, చంబేలీ బాయికిని, మదన్‌మోహన్ పఠాణ్‌కర్ నకును బుత్రికయు, జగదేకసుందరియు, నసామాన్య శేముషీధురీణయు నగు జుమలను బట్టి, దాని యంతమునకు గూడ కారణం బయ్యెను. జుమల మఱికొలదిదినములలో చనిపోవుటకు పూర్వము, గులాబ్ సింగ్ ద్వారా, నా కొక చీటి పంపుచు, నందుగూడ, నీ యరిందమ్ పొగరణువ బ్రయత్నించుచుండెను గాని, తా నందు జయ మొందజాల నని శంకించుచున్నట్టులనే తెలియ వ్రాసినది. మదన్‌మోహన్ పటేల్‌నకు గుల్సుమ్‌ను అప్పగించు నా బ్రయత్నములకు నెన్నేని యంతరాయములు గలుగజేసి యుండెను. ఈతని జంపు ప్రయత్నము నాకు నా లేదు గాని, 'జితోస్మి' యని యనిపించవలె నను బ్రతిజ్ఞ నాయది.

అటులనే, అరిందమ్ గూడ బ్రయత్నించు చున్నటుల గాన వచ్చుచున్నది. కాకున్నచో, నన్ను జెరలో నుంచుటకు పూర్వము, మనగుమాసుంగి తీసికొనిపోవు సామర్థ్యము, నన్నేమి జేసినను జేసియేయుండునుగదా! ఎంతకైనను, యేమైనను, మిక్కిలి ఔదార్యవంతుడును, ఘనమైన తలపులు గలవాడును అగు అరిందమ్ నాలుజనన సవతికూడే యగును.'

'కాకేమి! బహ్మార్థము పట్టకగిన మేధాశాలి! కాని, నాథా! నీబుద్ధి సామర్థ్యమున నది లేదే!'

'నీవు నాయందు గౌరవ ముంచి పలుకుచున్నావుగాని, నీసాయమున గదా నా వన్నాగములు ఱాణింపు!'

'సరే; ఈ యుపచార వాక్యములు కేటిగాని, మీరు ఏరోప్లేనులో, అందరిమధ్యనుండియు దప్పించుకొనుట జూచిన అరిందమ్, మిమ్ములవాల వీడడుగదా! ఏమి యాలోచించినారు? పోనీ, ఇంతటితో నీవ్యాయోగము గట్టిపెట్టరాదా?'

'తప్పక యూతండిన్నని యుపమల వన్నకమానడు. నేనిట్టి తరుణమున, 'జోసీ' యని యూరకుంటినా, సరి; మరి; లేదు. ఇంక నను మన నిచ్చునా? ఊరకుండదలంచినచో, నిది వరకే, ప్రప్రథమమునందే, యూరకుండవలసినది. అటునేయక గ్రంథము కొంతనడుపనిచ్చి, మొకట బిన్నాతుచే నాడించిన నాటకమున, వానిని 'వాండేమీ' డిపించి, జూములచే యితి కొంతదూరము నడిపించి, యనృతకార్యములకు 'సేనే' దక్షు

రాలనని దానిచే ననిపించి, ఇపుడు నేను ప్రథమభాగమున, దనకు బాధకుడనై, యాది పూర్తిజేసి, ద్వితీయభాగమున, నను సంరక్షించుకొను ( Defensive ) తెరుగున, చేతగాని పందవలె నూరకుండ దలంచుటకన్న హైన్యమును, ఆత్మగౌరవమునకు లోపమును కలదా? కొంతగ్రంథము సాగనిచ్చి, ఇపు డూరకుంట నా ప్రతిభకు కళంకము కాదా? కావున, సర్వవిధముల నీ గ్రంథము పూర్తిగ నడుపనీయవలసినదే.'

'సరేగాని, ఇప్పు డాత డేదోయొకయెత్తు, యెత్తియే యుండునుగదా! దాని కేమి యాలోచించితిరి?'

'ఆత డిపుడు నాతప్పుడు కారణముచే నేదో యెత్తు వేయు ననుకొన నక్కరలేదు. జూముల ఉత్తరము ప్రకారము, సిరాజ్‌హీక్ యింట సుఖముగ గాపురము సేయుచున్న గుల్‌సుమ్‌ను దప్పించి, మదన్‌మోహన్ పటేల్‌నకు నే నప్పగించిన దాదిగ, నావిషయమై, దనకు నభిమాన కుటుంబమును, తనచే నుద్ధరింపబడిన గాపురమును నగుట నా గుల్‌సుమ్‌ను, మరల సంపాదింప నెన్నని యురు లొడ్డుచునే యున్నాడు. ఎప్పుడును యేదోయొక ఒట్టితగిలిపో యున్నది.'

'ఆఁహా! అప్పుడే రంజకము అంటుకునే యున్నాదా? అయిన మరి ఆర్పలేము. లంకాదహనము కావలసినదే!'

'ఇంతేకాక, నా 'కోటీ' యింకనుపూర్తి కాలేదు.'

'ఏమీ, బారిదోపిడులవలన, లాల్‌చంద్ మొదలగు

ధనికుల యొద్ద కొల్లగొట్టుటవలన, మీరు స్వయంతయారు చేయుచున్న నాణెములవలన, మొత్తము 'ఒక కోటి' రూపాయి లింకను సమకూడనేలేదా?'

'ఏదీ ... ఏ పనియైనను, నాకుదృష్టికరముగ, నొకర్థ- వరుసను, ఏకబిగిని, జరుపనిచ్చిన గదా! ఏదో యవాంతరము, నేడో యాటంకమును గలుగుచుండ, మనోవాంఛ సిద్ధించు నటుల, సంపూర్ణప్రయత్నము జరిపితి ననుయానంద మైనను లేదే! ఏదీ సమయము? ఏదీ వేళ? ఏదీ యవకాశము?'

'పోనీను. ఆ 'అకరాచీ' ని కోర్టుండ్లనుండి పోలీసు లో నుంచినారే! ఏమేమిచేసెనో చేసినాడో ప్రశ్నింతువుగా?'

'అది నీపని; ఇప్పుడు నాకు సమయముకాదు.'

'సరే; పోనీగాని, లాల్ సూపరింటెండెంటుకు యిచ్చి న టెలిగ్రాము నేవిధమున సరికట్టగలిగితిరి?'

'అకరాచీ, నీవుచెప్పు, నేను వేగుపనిచూచుకుందును.'

'అమ్మా! తాను తంతి ఆఫీసుకు పోవుచు, నన్ను లాల్ చంద్ తోడు రమ్మనుమన, నే బోయి, సంగతి నెరిగి, పౌం డరు సహాయమున, కర్రెంటు నాపి, సమయము నెరిగి, భూమిలో న్యూట్రలైజ్ చేసితిని.'

'అబ్బా! నీవే దైనికముగ నచటి కేగుట తటస్థించకపో యిన, నా యీకథయంతయు నడ్డముగ దిరుగవలసినదేకదా!'

'ఎందుకూ? నాది 'పప్పుమీది ఫులగా' మైనది. అంతకు ముందే మన 'భీబోముకా' పోష్టాఫీసులో నున్నాడుకదా!'

'సరేగాని, సర్దోపియా స్వర్ణమయిని మీ రింతగా బాధించి, అరిందమ్‌న కింత వంత జేకూర్పనేల.'

'అతని శాంతమును బరీక్షించుటకు, మరియు, మూడు వేలకు తండ్రి మనియార్డరు మొత్తులో, సులభముగ దప్పించుకొనితిమి గదా; ఇక దీని కేమి ప్రతిహతము సేయగలుగునో చూచెద మనియే యీపని చేయించితిని. దీనిపై నాధారపడిన యొక పెద్ద మొత్తె తియుంటిని ఈతత్తరపాటు సమయమున, నాతడు తన భార్య వెంబడి బడి, పోలేదు గదా. స్వర్ణమయి యొద్దలి ద్రవణముల నాచికొని, సిగపూవైనను వాడకుండ నామెను, సురక్షితముగ, మరల విడుదల జేయ నెంచితిని.'

'ఔను గాని, రాణివాసము నవమానపరచుట, వీధికి లాగుట, అన్యాయముగ మనోవ్యథ కలిగించుట మొదలగునవి, మీబహద్దూరీకి లోపములని, స్వర్ణమయిని 'యమునో', ద్వారా, రైలున, తన తండ్రి గృహమున కేగునటుల జేసితి గాని, ఈయెడబాటరిందమ్‌నకు మనోవ్యథాకారణము కాదా?'

'అతనికి మనోవ్యథ యైన నా గాక గాని, నాకు దగిన భార్యవై, నా యాత్మగౌరవమును గాపాడితివి!'

'సరే; అంతయును బాగుగనే యున్నది. కాని యిక ముందుకు కావలసిన పని యేమి?'

'పనికేమున్నది! నీ పంపిన 'ఏరోప్లేన్‌లో' తప్పించుకొనుట' యను నాపని యైనతరువాత, పైమొత్తు వంతు, అరిం

దమ్‌దే గాని, నా కా సందర్భమున సేవనియుచు లేను అతని రొత్తు చూచుకొనిన, నాపై మొత్తు ఆలోచించుకొనవలసినదే, కాని మదన్ మోహన్ పటేల్ నా కీయవలసిన మొత్తముతో నా 'కోటీ' పూర్తియగును గదా యని యనుకొనుచుండ, నే ననుకొనిన లాల్‌చంద్ బహుమతీమొత్తము రూ. 1,11[illegible] లును పోయి, కంఠమున కురియె, మరికొంత శ్రమ తెచ్చిపెట్టినది.

'ఏ శ్రమయు సక్కరలేకనే, ఆ లోతక్కువ మీ టంకశాలలో భద్రీ చేసుకొని, లోకకంటకత్వము మానుటే వలహాకారి. 'కానుకాని, పటేల్ సేమించిక్క దెచ్చిపెట్టునో యని సంశయించుచున్నాను.' అని జమల వ్రాసిన చీటిదీసి, దాని వెనుకప్రక్క నేమో వ్రాసి, 'కేసరీ, ఇటు రా; ఇది తీసుకొని వెళ్ళి, నాకు సొమ్ము జరూరుగా కావలయునని పటేల్‌తో చెప్పుము' అని కేసరిని పంపివేసెను.

'నాథా, ఆ కేసరీలాల్ రోడ్ వీధిని బింబాములోమ విలోమముల ననుసరించి మీరుచేసిన యంత్రఫలిత మేమి?'

'మారులా అరిందమ్ నా వీధికి రానీయకుండ జేయు స్వాహాతో నది యమర్చబడెను. అదియైనది. అరింద మొక తూరిరా దేహ మొకింత చురుక తిరుగ నావీధికి రా సాహసింపడయ్యె. మరి మన అభవనము బరీక్షించలేము. తెలిసినదా.'

'ఇదియా; సరియే.'

   

కేసరి చీటిం బట్టుకొనిపోవుచు 'మీరే యెదురుపడితిరి. రండు' అని మగుడ సభాస్థానమున కిరువురును రా, నీ నూతనాగతుని సభాధ్యక్షుడు చూచి, 'పశేల్‌జీ' మీరే విచ్చేసిరే! ఏమి విశేషములా?' అని ప్రశ్నించెను.

'విశేషములా! కొంపే మునిగినది!'

'ఏమీ! ఏమైనది?'

'అగుట కేమున్నది! గురూజీకి గురువొకడు వచ్చి, మీరు ఎత్తుకొనివచ్చిన గుల్‌సున్నును, నాతడెత్తుకొనిపోయి, చెప్పరాని పరాభవ మొనర్చినాడు!'

'ఆ!—మయశంబరులలోని మాయ లెల్ల నెరిగిన నాకు—బ్రహ్మాదిదేవతలకైన నెరుంగరాని యంత్ర, తంత్ర, మంత్రము లెరింగిన నాకు—సృష్టికి ప్రతిసృష్టి గల్పించగల మేధాశాలి నా నాకు—అరీందమువంటి సరూప కాధ్యక్షుని గూడ 'జితోస్మి' యని యనిపించగల నాకు—నీ చరిత్ర వినవలె నను కుతూహలము కలదు; ఏదీ, వినిపింపు' మని యసంఖ్యాకులగు నాంధ్రమహా జనులచే చిరకాలమునుండి యభ్యర్థింపబడుచున్న, అద్భుత జీవచరిత్రగల నాకు—క్షణకాలమున సికతాక్షేత్రము కేళికావనముగా మార్పంగల కనుకట్టు లెరింగిన నాకు—గురు వొకడా! నాకు పరాభవ మొకటియా?'

'కాకున్న మీ ఇంద్రజాల మహేంద్రజాల విద్యా

ప్రభావమువలన మఱియు గుల్‌నుమ్‌ను నా కిచ్చి గుల్‌నుమ్‌వలె నా కగుపడజేసి తుద కేమియు లేకుండ జేసితిరి కదా !'

'ఓహో ! ఇదియొకటి గదా ! నాశిష్యుడగు ఫూల్ సాహేబు కాలమున నాతడు డాకించిన నాటకమున నరీందమ్‌ను మూడు చెరువుల నీరును ద్రావించు పట్టుల నెన్నో అమానుష కార్యములను, ఇంద్ర మహేంద్రజాలములను నెరవేర్చనని మానవ పికముగ ప్రవర్తింపలేదనియును; నా శిష్యురాలగు జూమల ఈ యరీందమ్‌ను ప్రతారింప ప్రయత్నించిన ఘట్టములు నాడించిన చిత్ర నాటకమున నీమెను దయ్యమనియును, భూతమనియును, మానవమాత్రురాలు కాదనియును, వారివారి చరిత్రల వినినవా రింతేని శ్రమపడి వారాడిన యాడిపోతల వినివిని, యటు గాకుండ నేను పంచభూతాధినాధుడ నయ్యు మా శాంకరీ కృపయే ప్రధానముగా నెన్నుకొని, కేవలము మానవికముగ, ప్రాపంచికముగ, ప్రవర్తించుచునే, నేనాతని ప్రతారింప ప్రయత్నించుచున్న యీనాకథలో లోపముల నెంచుచున్నారని నే నెరిగియు నట్టి కర్జముల నిసర్జింపక, ప్రచారము నేయుచున్నా నని యూహించి కాబోలు మీ రిపు డాడిన మాటల కింతేని నామనం బెరిగెసెడిని; గాని మీ సాక్షాత్పరిపాటియైన మీ రిపుడు నా పారితోషిక మొసవేయు తలంపున వచ్చిన పన్నాగము గాకున్న నేమి యీయయగణ్యాకాజై పుణ్యము !'

'గురూజీ, పారితోషిక మొసవేయుటకును, వాగ్దాన

ముల్లంఘించుటకును, అవిశ్వాసి నగుటకును, నేను లుబ్ధుడను, పాపిని, మూర్ఖుడను, కానని నమ్ముము'

'సరె—ఏదో సచోటాగా, సాఫ్‌సాఫ్‌గా, జరిగినసంగ తంతా చెప్పరాదా? అందుపై నాలోచింపవచ్చును.'

'మరి యాలోచనా? లేని గుల్‌సుమ్‌ను గూర్చియా!'

'గుల్‌సుమ్ పోయిన దన నేమి? మీ యజాగ్రత్తయే!'

'మరేమో! వ్యాయామంగ తాళము వేసి తెరచుచుంటిని. గదికిటికీలుతప్ప సందేమియు లేవు ఏమిఘోరమైనపని జరిగినది!'

'మీ రన్న కిటికీలు బాట కెంతయెత్తున నున్నవి?'

'నేను కొలవలేను.'

'పోనీ కిటికీగజముల కెం తెంత యెడ ముండును?'

'ఎంతయా?...జ్ఞాపకము—చాలదు.'

'మీ రామె నాఖరుదఫా ఎప్పు డెక్కడ నెన్ని గంటలకు చూచిరి?'

'మొన్న రేయి నాగదిలో 7—30 గంటలకు మా నీలాంబరియే చూచినది. మరల నేటి యుదయమున నామెయే చూచి నాతో గుల్‌సుమ్ లేదని చెప్పినది.'

'నీలాంబరి ఎవతె?' 'మాదాసి—'

'ఎన్నేండ్లనుండి మీ యాతాలో నున్నది?'

'నే నెరుగని కాలమునుండియును—కాని రామరామ ఆమె మనోనైర్మల్యమును, యామె యమాయి కత్వమును నెఱుంగకయుగాని కాని నా డిటువలె ననుమానింతురా?'

'సరే, మీ ఆందోళనలో సరియైన భోగట్టా యివ్వలే కున్నారు. స్వయముగానే వచ్చి చూచెదను.'

'ఏమి చూచెదరు? చంద్రుడు లేని ఆకాశమునా?'

'గుల్‌నుమ్ యేలాగు తప్పించుకొనియెనో మీ రామెనుంచిన గది వివరములును ఆ నీలాంబరి యెవతెయో, ఆ మెవంక పౌర్వాపర్యంబులును చూచి, ఊహించి, ఆలోచించవలెగాని అరీందమ్‌యే యీపని చేసినయెడ మెచ్చుకోదగును ఇంత సర్వతోముఖ ప్రతిభ గలిగి, నలుదెస లెట్టుల గమనించుచున్నాడో చూచితివా, మారుతీ! అరీందమ్ పై యెత్తు— ఇక నాయెత్తుపై యెత్తే మిగిలియున్నది అందుకు నేనిపుడు వీరింటికి పోవలెను; మరలి వచ్చునప్పటికి, రెండుదినములు కావచ్చును. నీవు భద్రముగా మాత్ర ముండుము. నేబోయి వచ్చెద.'

'అయ్యా, పటేల్ గారూ, ఇది నాపని కాదుసుమండీ! మీతో చెప్పకేమి మా జమల యేమి వ్రాసినదో ఆ ప్రకారమే చేసినాను. ఆమె యిచ్చినలేఖను మీకొరకు నెరవేర్చినాను. ఇక నేనేమిచేసినను నావిధికాదు మీకొరకు చేయవలసినదే గాని, జమల యాత్మవిత్యర్థము సేయుటగాదు సుడీ! చల్లకువచ్చి ముంత దాచనేల? చెప్పవలసినది మీ సమ్ముఖమునగాక రాయబార మేల?.........' అనియు నింక నేమో చెప్ప బోవుచుండ, పటేలా సురాజీ ధోరణి కడ్డువచ్చి,

'ఏదీ చూతము; తీయించండి—జమల చీటి—'

అనేక నమస్కారములువ్రాస్తూ

గురూజీ,

తమ ప్రియ శిష్యుడును నా ప్రాణ పతియును, అగు ఫూల్‌సాహెబు గతించి చాలకాలము కాలేదు; నేనిపుడు ప్రయత్నించి ఆ అరీంగమ్ ప్రోగరణబుంకు సెన్నినోన్కై యురుల నొడ్డుచున్నాను కాని అవి అంతగా వియమయినట్లు లేవు ఏది యెట్లున్నను, తమరిక మాత్రము మదన్‌మోహన్ పటేల్ గారికి గుల్‌సుమ్‌ను వప్పగించి, ఆయన నాకు వాగ్దత్త మొనర్చిన బహుమానము తాముపుచ్చుకుని, నాకుగాని, నాయాత్మకు గాని శాంతి గలుగజేయుమని పదేపదే ప్రార్థించుచున్నాను ఇదియేనా కడసారిదిగా గ్రహించి నన్ను సంతోషపెట్టుదురను నమ్మకముతో, వ్రాయు,

తమ ప్రియ శిష్యురాలు,
యోగిని.

యూదాసు

‘జమల వ్రాసిన ప్రకారమే నొనర్చితిని, గాని మీ వాగ్దానము చొప్పున, నాకు సొమ్మింతవరకును జేరనేలేదు. ప్రభువులుగాన, మరచి యుందురు. నాకు సొమ్ము చాలా జరూరు; గాన నీచీటిని జూచిన వెంటనేయీ ‘కేసరి’ ద్వారా సొమ్మంపిన, నేను మీకు చాల కృతజ్ఞుడను జరూర్—

కాలూరాయ్

‘ఓ, తీయించ, కేమి! ఏదీ, కేసరీ—తెమ్మిటు దెమ్మా చీటిని’ అని యడుగగ, నాతం డద్దాని నందీయ, సీతింమను తమకమున, ‘మీరాకే జాబునకు యుత్తరమును గూడ చదివి గ్రహించవలె ననియే, దీనివెనుక ప్రక్కనే, నా యాదాస్తును, గూడ వ్రాసితిని’ అని యనుచు పటేలున కాచీటి నందీయ నాతం డాయుత్తరము, యాదాస్తుతో కూడ చదివి, ‘అయ్యా! ‘జుమల వ్రాసిన ప్రకార’ మంటిరే; అనగా నీ భావము?’

‘నాభావమునకే మున్నది?’

‘........................తమరు మాత్రము మదన్ మోహాన్ పటేల్ గారికి గుల్నుమ్‌ను నప్పగించి, ఆయన నాకు వాగ్దత్తమొనర్చిన బహుమానము, తామువుచ్చుకుని......’ ఏమి, వింటిరా? ఇదీ—ఉత్తరములోని ముఖ్యభాగము కదా! మీరు దీని కిక నేమి వ్యాఖ్య చెప్పదలంచుకున్నారో కాని య్యండి.

‘ఓహో! ఏమి యర్థము! ఏమి భావము!’

‘అర్థభావముల కేమున్నది? గుల్నుమ్‌ను మీ కప్పగించుట నాపని, జుమల కిచ్చెదనని మీరు వాగ్దాన మొనర్చిన మొత్తము, నాకొనంగుట మీపని— ఇం కేమున్నది?’

అప్పగించుట అనగా నర్థమేమి?

‘ఎక్కడ నున్నదో, ఎవరి స్వాధీనమున నున్నాను, ఆమెను తప్పించి, మీ కప్పగించుట యని ‘అప్పగించుట’ కర్థము.’

'ఊరక 'అప్పగించుట' యన నిపతమూ నీనెత్తిని గొట్టుకో' యని యనుట వంటిదికాదే! ఈ 'అప్పగించుట' యనగా, ఎక్కడనున్నను, దీసుకొనివచ్చి, నాకు స్వాధీనపరచి నా అనుభవములోనికి దెచ్చుట— అనగా— నాస్వాధీనానుభవములోనుంచి, నా కుపయోగపడులాగున జేయుటే గాని, 'అదుగో' గుల్‌సుమ్ అని దేవతా వస్త్రముం జూపి, 'తే' నాపారితోషిక మనుట, జానులమాట కాదే!

'ఔర్ ఏహీబాత్ అమ్కా దర్కార్ నహీహై! లావ్, లావ్—జరూర్ సే, అమారా బక్షీష్ లావ్—జరూర్ ఝూట్ బాత్ మత్ కరో!'

'ఆః—అన్యాయం— ఘోరం—కేవలంధనకాంక్షే!'

'గుల్‌సుమ్‌ను మీకు 'స్వాధీనపరచు' పని, జమల వ్రాయలేదు. మీకామెను స్వాధీనపరచుటే అగత్యమైనయెడల అందుకు ప్రత్యేక బహుమానము నిర్ణయింప బడవలెను. మఱియు నిపుడు దప్పిపోయిన నామెను మరల దెచ్చుటకు వేరొక బహుమాన మేర్పడవలెను. ఇంతకును, మీవాక్శుద్ధిని నమ్మి, అడ్వాన్సైనను పుచ్చుకొనక; మందుడనై నేనీ కార్యమున దిగుట నాతప్పే—'

'అన్నా! ఇపుడీతనితో వాగ్వాదము పెట్టుకుంటినా కార్యభంగ మగు'నని, తన మనమున ననుకొని, 'మీకీయ వలసినది యిచ్చుటే గాక, ఇపుడీపనికొరకు, మీరుకోరునది

గూడ నోనంగెదను కాని మీకే యాదింకేటికిని ప్రతారింప రాని సమర్థుడగు అరిందమ్ యే యీపనిలో నున్నా డని సంశ యించుచు, వెనుకంజవేయుచున్న మీరే పేడియనను పెట్ట గలరు. 'అరిందమ్ గాలి తగిలినది—నావశము కాదు' అని మీరనిన, గుల్సుమ్ తప్పిపోయినందుకు కలిగిన విచారముకన్న యెక్కువ తృప్తి పొందియుందును—'

'అటులైనా!' యని దిగ్గునలేచి, 'ఇక రండని యాతని చేయి పట్టుకొని, త్వరగమనుడై, పోవుచుండెను.

మార్గమధ్యమున పటేల్, 'గురూజీ, ఇం దరిందమ్ గాలి తగిలిన దన్నారే! అదే సత్యముకాకున్న, మీతో చేయికలుప నింకొకనికి తాఖత్ లేదే! వెనుక నొకతూరి, 'గుల్సుమ్ను నాకప్పగించినచో, రెండు గ్రామములు జాగీరుగా నిచ్చెద' నని, నే నరిందమ్తో.........' అనుచు నింకేమో చెప్ప బోవుచుండ, 'ఆఁ—ఆఁ—ఇం కేమి! అరిందమ్తోనే! అన్నా వుట్టమీద నేమిపెట్టినను నాగమయ్యాదే పేరే! ఇం దరిందమ్ తప్పక నున్నాడు. ఇట్టి యసంగతకార్యము లొనర్చిన మీతో వ్యవహార మేమిటి?—ఏల—నాకేల నేగోల! లావ్, లావ్—అమార బక్షీష్!' అని యాతడు మరలిలో వెనుదిరుగ, 'ఇంతేనా—అరిందమ్ పేరు విన్న మాత్రాన, పిట్టలైనను నీరు ద్రావవనుమాట సత్యమే! చేతగాక, వెనుకకు మరలుచు, నాపై నేదోయొక దోష మారోపించుటకంటె, చేత కాదనిన నింతకన్నను సమంజసము కాదా!' యనె పటేల్.

'ఓహో! వచ్చినవాడు ఫల్గుణుడు ♦ విశ్వము గెల్చునంగ రాదు.........' 'నేను డబ్బియలేను—పని చేయించుకొన లేనని మీరనిన ని తకన్న బాగుండును.'

'ఏమీ డబ్బుకా?—దేనిదేని కెంతెంత నీయవలెనో, ఇపుడే నిష్కర్ష వచ్చినచో, ముందుకు మరి పేచీలుండవు.'

ఒకరి నొకరు జూచుచు మాటాడక నిలచిరి.

తన కోటి వ్రాత్రియగుటలో, నీత డీయవలసినదిగాక, లాల్‌చంద్ కేసులో తాళము దీయుటకు, తనకు రావలసినది యుగాక, తన పీకలమీదకే దెచ్చిన రూ 1,116 లును కలిపి, మరీ లాగవలెనను నూహా పొందె, కుల్సుమ్ పటేల్ గృహమున నుండు ననునూహా, అరిందమ్ పొందుటకైనను, ఇవు డిపుడే పటేల్ చెప్పిన కారణమే గాక, జనుల చనిపోయినదను వార్తచే మతిభ్రమణమున, దేశభ్రమణమొనర్చుచున్న గులాబ్ సింగ్ వలన, గుట్టు బయటపడునేమో యను ననుమానమున, తనమానసము తామరపాకుపై నీటిబొట్టగుటను, గురూజీయును; లేశమపి తప్పు దొరికెనా మరియు మరియు బారితోషిక మని వేధించుచున్న గురూజీతో కుసుమ గుచ్ఛము తాఁగొని తెచ్చిన చరిత్రము, నీలాంబరిచే తానదివర కంపిన కబురును, చెప్పిన వగ్గిపై గుగ్గిల మగుగదాయని, యాందోళనావస సంచలిత మనోలలితతో పటేలును, గాబోలు, నొకరి నొకరు జూచుచు, మాటాడక కొండొకతడ వూరకుండిరిగాని, తుదకు పటేలే,

'గురూజీ! వేయేల? ఆ రెండు గ్రామములను జాగీరుగా నిచ్చిన జాలునా?' యని ప్రశ్నించెను.

'ఏదీ! నిశ్చయముగ— శంకరీ సాక్షిగ— ప్రమాణముచేయుడు.'

'ఆహా! నిస్సందేహముగ నిరాఘాటముగ— నిర్వివాదముగ— సూర్యచంద్రులు సాక్షిగ— ప్రమాణము చేయుచున్నాను మరొక్కమాట; గుల్‌నామ్‌ను నా కప్పగించుటన, నన్ను ప్రేమించునటులగూడ చేయుటమడీ! తెలిసిందా?'

'సరే; ఇంకేకదూ! పదండి—పోదము'

---

## ఎనిమిదవ ప్రకరణము

---

### ఇవ్వాలి కథ

ఆర్యావర్తమునకును, దక్షిణాపథంబునకును, నడుమనుండు మాళవమునకు, పురాణసంబంధముచేతను, పౌరాణికత వలనను ప్రసిద్ధికెక్కిన యుజ్జయినియే రాజధాని.

ఇక్కాలంబున కాలమాననిర్ణయమున నాంగ్ల గణితశాస్త్రజ్ఞులు, పాశ్చాత్యదేశమున గ్రీన్‌విచ్ మాఖ్య మధ్యస్థానముగ నెంచుకొని, కాలమాననిర్ణయ వ్యవహారము నడుపు

కొను చున్నటులనే, హిందూదేశమున జ్యోతిష్కులచే, గణిత ములు నిమిత్తము, ముఖ్య మధ్యస్థానముగ నంగీకరింపబడిన నియ్యుజ్జయిని, అవంతి, విశాల యను నామాంతరములు గలిగి వ్యవహరింపబడుచు, గ్వాలియరు రాష్ట్రమునకు పూర్వ ముఖ్య పట్టణమై, సకలభువనగతుం డీశ్వరుం డగు విరూపాక్షు, మహాకాళేశ్వరాది దేవాలయము లుండుటంజేసి దీర్ఘయాత్రాపరుల కాలయమై, ప్రసిద్ధ పుణ్యక్షేత్రములలో నొకటియై దనరారుచున్నది

ఏ పట్టణావతంసము ప్రద్యోత మహారాజనందన యగు వాసవదత్తాదేవిని, తనపితృగృహమునుండి వత్సరాజుదీసికొని పోయిన చిత్రకథల కాలవాలమై యున్నదో, ఏ కటకసింహాము సకల కవివర గురుడని ప్రసిద్ధి గాంచి, లోక ప్రసిద్ధి వడసిన నాటకత్రయినిరచించిన మహాకవి కాళిదాసుచే, కుబేరశపితుం డగు యక్షుడు, మేఘునిమూలమున దన యర్ధాంగికి గబు రంపిన కథలోగూడ, నెంతేని హృదయరంజకముగ వర్ణింపబడెనో, ఏ నగరరాజము సంస్కృత వ్యాకరణమున గల గొరంతలు బూరించిన 'పాణిని' కిని, గీర్వాణవ్యాకరణసూత్రములకు వార్తికములు వ్రాసిన 'వరరుచి' కిని, మహాభాష్యమందలి లోపములు సవరించిన 'పతంజలి' కిని, బృహజ్జాతకాది మహాగ్రంథరాజ నిర్మాతయగు 'వరాహమిహిరు' నకును. సంస్కృతపద పారిజాతమనదగిన, నామలింగానుశాసనమునురచియించి, మృతజీవుం

డైన 'అమరసింహు' నకును, వైద్యశాస్త్రమును భూలోకమున కవతరింపజేసిన 'శ్రీమద్ధన్వంతరి' కిని, సుభాషిత రత్నావళి యను నామాంతరము గల నీతి, శృంగార, వైరాగ్య శతకములు రచియించిన భర్తృహారికిని బుట్టి నిల్లయ్యెనో; —అన్నా! రామాయణములో పిడకలవేట వలె మాకేల నీ గోల. కథనడుపనీయకుండ ననెదరా ? కానిచూచెదముగాక—ఏ నగరసామ్రాజ్యమునను, ఏ రాజు, హిందూరాజ్యరమపై దండెత్తి వచ్చిన, మ్లేచ్ఛకుల పాపాటవీ వీతిహోత్రుండై వారిని రూపుమాపి, వైదికధర్మమార్గంబుల పునః ప్రతిష్ఠాపన జేసి, భారతవర్షంబు నేకఛత్రముగ బరిపాలనం బొనర్చిన కతన నా ప్రభులకులశిరోమణికీర్తి యాచంద్రతారకముగ నియ్యిలనుండ, నాతనిపేర నొక 'శకము' స్థాపింపబడి, వాడుకలో నుంచబడి నదో, ఏ 'మహీశు' చిత్రవిచిత్రకథలు వినిన, వ్రాసిన, జదివిన, బాధ లడంగి జనులు సుఖములే గాంచుచుందు రను నానుడి, నాటికిని నేటికినిం గూడ వాకొనబడుచున్నదో; ఆ సాహస విక్రమాంకభూపాలు (జే వీషు) పాలించెనో, అట్టి యి యుజ్జయినీ నగరసామ్రాజ్యమున, నా కాలమున, బౌద్ధదేవాలయములును బెక్కులు గలవు.

అట్టి యి న్నగరమున నానా డుండిన భూస్వాములును జమీందారులును లోనగువారిలో నొకరుండగు బనరుహీంక్, మిగుల నైశ్వర్యౌదార్యవంతుడు. సాలుకు నాలుగులక్షలకు

పై బడిరాబడిగల యీాతనికి, కలకత్తాకు సమీపమున నున్న పెద్దదియగు నొక రాజ్యమున కధిపుం డగు తమిజుద్దీన్ అను జమీాందారుడు, స్నేహితుండును దూరపు బంధుగుండును నై యుంట, నపుడపుడు తన కుమారుడగు సిరాజ్‌హీన్‌ను స్నేహ మూాలమున, నా తమిజుద్దీన్ జమీాందారు ని౦టి కనుపు వాడుక గలదు. తమిజుద్దీన్ కుమారితయగు గుల్‌సుమ్ యును, బసరుహీాన్ కుమారుండగు సిరాజ్‌హీన్ యును, సహపాఠకులం బోలె, నిష్టాగోష్ఠిం దిరుగులాడుచుండిన కారణమున, ఒం డొరులకు గాటమగు బరిచితియు, స్నేహమును, వారివారి మనోలతల సంకురించియుండెను. కొంతకాలమునకు సిరాజ్ హీన్ జనకుండగు బసరుహీాన్, తన యావసానకాలమున, తన కొమరునకు ఫోటోగ్రాఫులను దీయు 'కళ' యం దభిరుచి య నియు, నందువ నాకళలో నాతనికి సంపూర్తియగా పరిశ్రమ గలుగజేయు సహాయపడ గోరుచు, తమ్‌జుద్దీన్ పేర నొక లేఖ వ్రాసి గతజీవుం డగుట, నీ సిరాజ్‌హీన్, తన తండ్రి మర ణానంతరము చాలాకాలముపర్యంతము, తమ్‌జుద్దీన్ అధికార మునసే యుండి విద్యాబుద్ధుల గరచి, రానురాను, తమ్‌జుద్దీన్ యొక్క కష్టపు రాణివానముగు, మోతీబీబీ వలనను, మఱియు నామె ప్రియశిష్యుడగు ఫ్రూల్‌సాహెబు వలనను, చెప్పరాని యిక్కట్టుల నొంది, ఎట్టకేలకు రిపుకభటశాఖావతంసుడును, నిరూపకాధ్యక్షుండును నగుఅరీందమ్‌చే రక్షింపబడి, గుల్‌సుమ్ నకు పరిణయతుడై, చల్లగ కాలము గడుపుచుండెను.

సిరాజ్‌హీన్ ఒకప్పుడు పాటలీపుత్రమునకు లౌకిక కార్యనిర్వాహణార్థము పోయియుండ, తన ప్రేయసి యగు గుల్‌నుమ్, ఒక పర్వదినమున, తన చెలికత్తెలతో, సీప్రానదీ జలములస్నానముజేసి, విశ్వనాథుందర్శింపగోరి, యంతఃపుర కాంతలు బహిరంగముగ స్నానముసేయుట కనుకూలపడమి, ఒక స్నానాలయముగల పడవను సిద్ధముసేయ తన యంగరక్షకుల కాజ్ఞయొసంగి, దా నొక పల్లకిలో నవ్వీడు వీడి, ఎంతో దూరమున నున్న సీప్రా నదీతటమునకేగి, పల్లకినుండి తన కాలు పడవమీదబెట్టగనే, లేడవను నదీమధ్యమునకుగొనిపోయి, యచ్చ నొరులకంట పడకుండ స్నానముసేయ, తన పడవ నమర్చి యుండిన స్నానాలయమున దాసికలు నడల్చినంతనే యొక నిలివెడు నీరందు జొరబార, నదీజలముచే పడవగాని, పడవలోపలివారికిగాని, అపాయముగాని, అసౌఖ్యముగాని రాకుండ, నందంగనామణు లంగరక్షకులై, యప్రమత్తులై గాంచుచుండ, నామె స్నానముసేయు సందర్భముననే, ఇందూర్ రాణిగారి పడవనడుపు నావికురాలై 'కరీమ్' ఆనాడు, జైనదేవాలయమున గుల్‌నుమ్ నపహరించి, మొదట కాలూరాయికిని, పదంపడి పటేల్‌గారికిని ఒప్పగించగలిగితి నని, కరీమ్‌వలననే విని యుంటిమి గదా. పాపము! సిరాజ్‌హీన్ పాటలీపుత్రమునుండి మగుడి రాకపూర్వమే, తన ప్రేముడికత్తియయ్యు, నెన్నో యిక్కట్టులం బడి పరిణయమైన యందకత్తియయ్యు నగు గుల్

నుమ్ స్నానార్థము సీప్రానదికిం బోయి మరలి రాలేదను వార్త తన వీనులంబడ, తన కర్జ మొగి దూరకుంచి, దూరమున నున్న దా బిరాన నరుదెంచి, విచారించి, యేమియుం జేయ దోపమి, దక్షిణము అరీందమ్‌ను కెరుక పరచి యాతని సహాయము నభ్యర్థించుచు, దన ప్రయత్నముల మానక నే యుచు, దిన మొక యేడాదిగ గడుపుచుండ, ననతికాలముననే,

'తక్షణమే బయలుదేరి రావలెను—పోయిన వస్తువు
దొరకినది—క్షేమముగ నున్నది— అరీందమ్'

అని తనపేర నొక తంతివార్త రా నయ్యది జదువుకొని, యొడ లెఱియని యానందసంద్రమున నీదులాడుచు, ప్రయాణసన్నాహమున నుండెను.

---

## తొమ్మిదవ ప్రకరణము

---

### నిరూపణ (1)

'ఇదేనా గది?' 'ఔను—'

'అప్పటినుండియు నీగదిలోనే యుంచిరా?' 'ఔను'

'గదైనా మార్చియుండిన కొంతబాగుండియుండును.'

'సరే—ఇదియొక తప్పా?'

'తప్పా—మరి లేస్పున్నరా! ముందు గది పరీక్ష చేయ నీయండి; అప్పటినుండి యిప్పటివరకును, ఈగదిలో నేయుంచుట తప్పే యని, మీచేతనే ఒప్పించగలను'

'కాబోలు—క్షమించండి. మాటాడితే నాతప్పే యని నిర్ధారణపరచుటకు మహాప్రయత్నములు చేయుచున్నారు'

'అయ్యా, ఈపూలేల నీలాగున పరజల్లి యున్నవి?'

'చూచితా, ఎన్ని విధాల ప్రయత్నము చేసియుంటినో? ఎన్నో రకముల పరీక్షలు, మనోల్లాసకరములును, శృంగారరస ప్రధానజనకములును, నగు వస్తువులను, సమర్పియుంటినో!'

'ఈ పూలమాట ముందు చెప్పక, నామాటమరలింప ప్రయత్నమేల?' 'పూలా—నావి; ఔను నేనే తెచ్చితిని.'

'ఎక్కడినుండి?'. 'పూలయంగడినుండి—'

'ఎవ రిచ్చిరి?' 'పుష్పలావికుడు—'

'ఓహో! అంతా! వేళాకోళమే? పతేల్‌జీ! ఇదిగో, నే నడిగిన ప్రతి ప్రశ్నకును సదుత్తర మీయకున్న, నా పారి తోషికము నా కొనంగుడు—నే పోయెదను.'

'పాపము! అప్పటి ఫల్గుణు డిపు డుత్తరు డైనాడే!'

'అయ్యా, కొరగాని మాట లేల? నేను, పది రూపా య లిచ్చిన, పది రూపాయీలపనే చేయుదును. నూ రిచ్చిన, నూటిపనే చేయుదును వెయ్యేల! ఎంత కంతే! ఇప్పు డీగది పరీక్షకు 200 అక్కడ పెట్టండి నిరూపణ మజా చూపెదను.'

'సామ్మ్కా నాకు భయము! ఇదిగో!' అని రెండువం దలు నట గ్రుమ్మరింప, నీ గురూజీ అందుకొని, 'ఇకనా ప్రతి ప్రశ్నకును నదుత్తర మిచ్చెదవుకదా?'

'నాకు తెలిసి, జ్ఞాపక మున్నంతవరకును—'

'ఆఁ—పుష్పలావికుని పేరు?'

మంచిపేరే—ఏదో 'చంద' అని చెప్పినటులయ్యాది'

'లాల్‌చందా?' 'కాదు'

'గోపాల్‌చందా?' 'ఆఁ—ఆఁ—అవు నవును.'

'పొట్టి, నల్లని, కురూపికదూ?'

'కాదండీ, పొడవగు స్ఫురద్రూపి; దిద్దిన యౌవయువ స్ఫురణ—కాని, గురూజీ! మీ రేమి నిరూప కాధ్యక్షునిం బలె నను బ్రశ్నించుచున్నారే!'

'నే నిపు డేమిసేయుచున్నాను? నిరూపణే కదా! ఆ గోపాల్‌చంద్ వద్ద నొక్క కుసుమగుచ్ఛ మేనా మరియు నింకే మైనను విలిచితిరా?' 'మరింకేమియు గొనలేదు.'

'సరే; పోనీగాని, ఆ సుమగుచ్ఛము బరీక్షించిరా?'

'లేదుగాని, ఈ సుమగుచ్ఛ బరీక్ష యేల?

'ఇదిగో, ఇదే మీకును నాకును నున్న భేదము ఇం దేదో మిత్రభేద మున్నది' అని యట నేల విరియజల్లియుం డిన పూల జూచుచు, 'ఏదీ, ఆ నీలాంబరి?' యన నా దాపున నున్న నీలాంబరియు నెదుటబడ, 'ఏమి, నీవేనా నీలాంబరివి? ఈపూలేల యిటుల విరజల్లియున్నవి?' అని యడిగెను.

'ఇది ఆ యమ్మకు మామూలే; బాబుగా రనుదినము ను పూల గోసితెచ్చి యిచ్చుటయును, నామె నిత్యమును జించి, త్రుంపి పరజల్లుటయును మామూలే.'

'నీకష్టమున కెంత బహుమానము దొరికినదే?'

'నా కేమి కష్టము? నా కేమి బహుమానము?'

'ఈ గుల్‌సుమ్ తప్పిపోవుటలో నీవు కష్టపడలేదా? అందు కరిందమ్ నీ కెంత బహుమాన మిచ్చెను?'

'అరిందమ్ డెవడు? నాకు బహుమాన మిచ్చుటేమి? మీమాటలు నాకు బోధపడలేదు'

'అరిందమ్ డెవరో నీకు తెలియుదేమి? నీ విక్కడ నెన్నేండ్లనుండి పని చేయుచున్నావు?'

'దాదా పిరువదియైదు వత్సరములనుండి—బాబుగారి పసితనము నుండియును'

'సరే; అయ్యా, ఇవేనా కిటికీలు? వీనికి తలుపులు లేవే—మ రేద్వారములును లేవే; అయ్యా, ఏదీ, ఒక పెద్ద నిచ్చెన దెప్పించండి; కిటికీ యినుపగజములు పరీక్షింపవలెను' అని గురూజీ పలుక, నొకడొక యినుప నిచ్చెన దోతేర, నీతం డద్దాని నెక్కి, కిటికీ గజములు పదునాల్గింటిని గూడ నొక త్రుటికాలము చూచి, గజములు గదలింప, కిటికీ కిరు ప్రక్కల నుండు చెరి రెండుం దక్క తక్కిన మధ్య పదియును కొంచెము కదులుచుండ, నిందొకటి సునాయాసముగను, నువ

కరణసహాయముమున, గొంచెము కష్టమున నం దొకటియు నూడ దీసి 'ఆహా రసాయనశాస్త్రజ్ఞా!' అనుచు నిచ్చెన దిగెను.

'ఏమండీ; సరియా, పరీక్ష?'

'చెప్పెదను తాళండి. ఈ గజములు చూచి, ఈ రెంటి కిని గల భేదము మీరు పరీక్షించుచుండుడు ఈగది లోపలి భాగ మంతయును చూచుట యైనది ఇదిగో ఈ గోడ వీధి వైపు భాగమును గూడ చూచి, నిర్ధారణ పరుపగల ననుకొను చున్నా' ననుచు బిరాన వీధిదెస బోయి ఆగోడ బరీక్షించి, ఆ సమీపపు నేలను గుర్తించి, నిదానించి చూచి లోపలికి వచ్చి, 'పటేల్ జీ! ఇక సందేహము లేదు అరిందమ్ యిందులో పనిచేయక పోయియే యున్నయెడల, 'ఆక్సో అసిటిలయిన్ వెల్డింగుతో', ఈ కిటికీకి యినుపగజములు కరగించుటయును, మరల నతుకుటయును, జేయ సమర్థు లెవరు?' అని యా నిరూపకు డనెను.

'ఔనండీ! ఆగాన్‌తో కరిగించిన [illegible] భాగము కొంచెము క్రిందికి దిగజారి [illegible] గురులా [illegible]'

'సరిగా పోల్చిరే—'

'కాని ఆమె నెటుల బైటకుకొనిపో గలిగెను?'

'ఓస్—చొప్పవంటప్రశ్న; ఇంత లొనర్చినవాని కది యొక కష్టమా? పదిగజము లూడబెరికి పెద్దపిచ్చిన సహాయ మున నామెను దీసికొనిపోయి యుండరాదా! నిచ్చెన దావు

గురుతులు చూచెదరుగాని రండు రండు—నాతో రండు. ఈ గోడ కావలవీధి వైపను జూడగలరు' అనుచు నాయనను దీసికొనిపోయి, తా నదివరకు చూచివచ్చిన గుర్తు లీతనికిఁ జూపి, 'ఏమండీ, నా నిరూపణాభాగమును గూర్చి పరితృప్తిం జెందితిరా?' యని యడుగుచు, గదిలోపలికి దీసికొనిపోయి, వ నా యినుపగజములపై నుండిన చిన్న చిన్న గుబురుల జూపుచు 'దీనితో నా నిరూపణ సంపూర్తి యైనదికదా; ఈ కిటికీమూలలను ననే ఆమెను గొంచబోయెను మీరీ గదిలో నామె నప్పటి నుండియు నుంచకపోయియే యుండిన నీ యవాంతరము వాటిల్లకపోయి యుండునే!' అని తన మాట నిలదీసికొనెను.

వీరీ తీరున సంభాషించుచుండ, నొకడు వచ్చి, 'గురూజీ' యని బిలచి యాయనతో నేమో రహస్యముగ నివేదింప, నీతండును యేమో వ్రాసి 'చూడు అకరాచీ, తత్క్షణ మీ యుత్తరము—రైలులో పోయి, చూడు—అక్కడ రైలు టపాలో వేయించవలెను సుమా; బహు భద్రము; మెయిలువాళ్లలో పడితీరవలెను......చూడు; నీవు పోవుచున్నావు గాన, మన 'యమోటాతో' పటేల్‌గా రిపుడే వచ్చెదరు. వారుకోరుపని నిర్దుష్టముగా సేయవలెనని, నా మాటలుగా చెప్పుము' అని యకరాచీతో చెప్పి 'పటేల్‌జీ, మరి మన మిక్కడ చేయవలసిన పని లేదు. మీ రిపుడే వీనితో పోయి, మన మిక చేయవలసిన పనులు కాయత్తపడవలెను. యమోటా

అన్నిటం జత్తురుసు ఇక మీ రరుగుడు’ అని చెప్పి, ‘అది నేను చెప్పినటుల రవానా యగునుకదూ!’ అని హెచ్చరించి వా రిరువుర నంపివేసి తన యత్నమున దా బోయెను.

‘ఏమ

---

సి రూ ప ణ 2

‘సరోజినీ, గుల్సుమ్ యేమిచేయుచున్నది?’

‘ఇప్పుడే భోజనముచేసి కూర్చుని గులాబీపూలు మాలగా తయారుచేయుచున్నది.’

‘ఏదీ, ఆమె నిటు రమ్మను. ఆమెపేర నొక యుత్తరము వచ్చినది.’

‘సరే; పిలచెదను గాని, మా అమ్మను పిలిపించరా, ఇన్నాళ్ళయినదికదా?’

‘అలాగే నమ్మా పిలిపించెదను. మీ తాతగారింట క్షేమముగా పిండివంటలు దినుచు, నిక్కడికన్న నక్కడనే యెక్కువ సుఖముగా నున్నది గదా!’

‘పోనీలెండీ; మీ రెప్పుడును ఏదో ఒక హాస్యపు మాటాడి, ఆమాట తప్పించేస్తూనే వున్నారు. ఇంకా యెన్నాళ్ళు అమ్మని అక్కడ వుంచెయ్యాలని అనుకుంటున్నారో?’

‘మరి చాలారోజులు మీఅమ్మ అక్కడ వుండదులే. మంగళ్ళనుని ఆ పనిమీదనే పంపినానులే. పిలు, పిలు, గుల్సుమ్ని, త్వరగా—’

'ఎందుకూ? ఉత్తరం ఇవ్వండి. నే నిచ్చేస్తాను.'

'అలాగు కాదమ్మా; రమ్మను.'

'అయితే పంపించండి మరి వెళ్ళుతున్నాను?'

సరోజిని నిష్క్రమించును. మరికొంచెముసేపటికి వగమల్లిన గులాబీపూలహారముతో గుల్‌సుస్ ప్రవేశించును.

'ఏమి బాబయ్యా, ఉత్తరము వచ్చినదట! ఎక్కడనుండి?'

'ఔనమ్మా; ఇదే కవరు ఉత్తరము ఎక్కడనుండియో తెలియకున్నది. పోస్టల్ ముద్రలేదు. కాని, రైల్వే మెయిల్ సర్వీస్ ముద్ర సెట్ నెంబరు అని యున్నది. అందువలన నిర్ధారణగా నేమియు దెలియకున్నది. నీ విక్కడ నుండగా, నీ పేర వచ్చుటచేత, సిరాజ్‌హీన్ వ్రాసియుండు ననుకొనుచున్నాను. ఏమో, ఏదానికైనను మంచిది. నేను పరీక్షించి, అందున్న సంగతులు చూడకయే నీ కిచ్చివేయుదును.'

'మీరు చూచిన నేమి తప్పు, బాబా!'

'అటుల కాదమ్మా' అని యనుచు నా యుత్తరమాత డటునిటు త్రిప్పుచు, దాని భారమును జూచువానిం బలె మరల దానిం బరీక్షించుచు, నొక సూదిచుక్క నా కవరుపై వేసి, కొంతసేపు నెరపి, చూచి, ఆకవరును చింపక, దానిమూతి యంటింపబడిన భాగముపై నించుక తడిచేసి జాగ్రత్తగా దానిని విప్పి, తన ముఖము దూరముగా నుంచి, లోన నున్నది కాగితమే కాని యింకొకటి కాదని నిశ్చయపర-

చుకొని గాబోలు, యుం దుండు కాగితము దీసి, దాని కొనను పట్టుకుని దులిపి, కవరుస్సైతముదులిపి, యామె కొనంగ, నామెయు చిర్నగవుగ నద్దాని దమకమున నందికొని, త్వరగమనమున లోనికి బోయి, యాకమ్మను జదువుకొనుటకు బూర్వము సంతకము జూచుకొని, విస్ఫురితముఖముతో, పులకాంకితతనూలతతో, నానంద వికసిత నయనాంబుజములతో, నుత్తర మెల్ల మెల్లగ జదువుకొని, నం దేమి బోధించుకొనెనో గాని, యానందపారవశ్యమున నన, మరలచావడి కరుదెంచి, 'బాబయ్యా, మీా అల్లుడుగారు బయలుదేరి వచ్చుచున్నా' రనెను.

'ఏదమ్మా, ఇటు తే—ఊఁ—పోనీ, నీవే చదువు—వింటాను.'

* * * * *

ఆఁ—ఆఁ—అరిందమ్, ఆగు మాగుము! ఎక్కడినుండియో వచ్చిన యుత్తరము, కాదు—కాదు—సిరాజ్ హీన్ వ్రాసె నని, నీ వసిన యుత్తరముపట్టుకొని, 'ఏదమ్మా, చదువు; వింటాను—' అని గుల్ సుమ్ ఉత్తరము చదువుచుండగా తీరుబాటుగా వినవలె నని యెంచుచున్నావు కాని, మా కొక విషయము చెప్పనిదే నిన్నా యుత్తరము విననీయము. మరియు గుల్ సుమ్‌ను చదువనీయము. నీ పనులును, నీ నిరూపణకార్యములును, నీయింతట నీవు చేసుకొనిపోవుచున్నావు. నిన్నను

నరించి పోయినచో నన్నియు దేటపడగలవని గాబోలు, నేది యు నుడువక, నిద్రపోవను బోవుచున్నావు. ఏ రీతుల జరిగి నదో, వివరముగా, నేదియు జెప్పవైతివి. మా గ్రంథకర్త యైనను జెప్పడాయెను. పోనీ యని, నీవా రగు సర్కిల్ ఇన్స్పెక్టరు మొదలగు నీ పరిజనులనైన నడిగి దెలిసికొందమన్నను. కాలూరాయి సన్నధికరించి తప్పించుకొనుటాదిగా వారేరీ, ఎందును గానరా రైరి. పోనీ, నీవు చెప్పినను, చెప్పకున్నను, ఇంతవరకును మీ మీ చరిత్రల దా నేర్పినయట్టుల, నోపిన రీతిని, మా కెరుక సేయుచున్న పాప మీ గ్రంథకర్త నే యను గుద మన్నను, దన కలమును వడిపడి బోనిచ్చుచున్నాడే! ఇంకెటుల? మా కెన్నో సందేహము లున్నవి. కాలూరాయి యెంతో నేర్పరియు, బహుమేధావంతుడపియు, నక్కడక్కడ నుడివియుంటివే! అరీందమ్, నీ వట్టి దుస్సాధ్యు నెట్టుల బట్టితివో చెప్పవైతివే! మా మానసకాసారముల నీ సందేహపవనము కలతవెట్టుచున్నది. ఇంకను మేము వేచియుండలేము. ఇక మా కోపిక చాలదు. పోనీ ఇపు డా గుల్ సుమ్ చేత నున్న యుత్తరము వచ్చిన నంచి (కవరు) నంతసేపు బరీక్షించితివే! ఉత్తరమో, అందలి యంశములో యేవియు నక్కరలేక, పోస్టు ముద్రయా నీకు గావలసివచ్చెను? నీ వేల నా కవరుపై తైలబిందువు నెరపి, ఎంతో బరీక్షించి, దానిని చింపక, దాని మూతిం దడిపి, మెల్లన దెరచుచు, నీవు పెదమోమున నం

దున్న కాగితముం దీసితివే! ఏమి, ఏల నంత జంకు నీకు? ఇందు గల విశేషము మొదట మా కెరుకపరచి, మేము బరితృప్తిం జెందినపిదప సుమా, నీ గుల్‌సుమ్ ఉత్తరము చదువుట— నీవు వినుట—ఏమి, చిరునగవున జూచుచున్నావు?

ఓహో! లోకములో జను లాత్మకృతంబుల మరువజాలరుకదా! అలనాటి నీ ఇన్ష్యూరెన్సు కవరుసంగతి యింకను మరవ నా లేదు కాబోలు ఇంతకును నీకును మాకును మరవరానిదేఅది! నీ వపుడు కాలూరాయుని పట్టుటకు రూ. 1,116 ల కరెన్సీనోట్లు గల కవరది యను భ్రమ గొలిపింప నేర్పుమెయి నంపిన ఇన్ష్యూరెన్సు కవరులో, చిక్కని నేతగల పట్టుసంచియు, దానిచుట్టును గుల్లదారమును, వీనినిండ రెప్పపాటు కాలమున బని సేయుగల విష వాయువుతో, నీ వానాడు నింపియుంచి పంప, పాప మాతడమాయికముగ దానిని చింప, నం దున్నని తెగి, ఆ వాయువు నాతని నాసాపుటముల బ్రవేశించి, వాని నుస్మృతుగా నొనర్చ, నాపట్టున వాని బట్టిన ఘట్టము మరుపమియా! మరి యామాటలయెన నోట ననవైతివి. నీపనుల జూచి, మము బోల్చికొను మందువే? మేమందరము నీయంతవారము కాగలమా? సరియే—పాప మెంత యాతురమున నాయుత్తరమును వినదలంచితివో; అడుగు మడుగుము—గుల్‌సుమ్‌ను—ఆ యుత్తరము చదువుమని—

* * * * *

'ఏదమ్మా, చదువు; వింటాను'

'తమరే చదువవచ్చును,' అనుచు నాలేఖనందిచ్చెను.

కమ్మ చదివెవ్వరోని, కూతురుయొక్క చిర్రుగవ్వుగ, అమ్మా ఈకమ్మలో 'ఉజ్జయిని' అని యున్నమాటచేత, ఉజ్జయినినుండి వ్రాసినట్టుల నున్నది: కాని తారీఖు లేదు మరియు, నాతంతి వార్త అందినతర్వాత, తాను వ్రాయుటకు తగినంత వ్యవధి యున్నట్టుల గానరాదు సందేహము, ఉన్మాదినియును, ఆయన వియ్యంబోలికయున్నది?'

'ఏమి, తామిట్టుల సందేహించుటకు? స్వాతంత్ర్యము విష యముల మార్చి కూడ, తమ సహోదర సామర్థ్యంబుల జూపు చున్నారుగదా యని విచారించుచున్నాను.'

స్వగతమున, 'అన్నా, ఈమె మనము నొవ్వనదియై యుండనోపు.' ప్రకాశమున, 'లేదమ్మా, నే నేమియు సంశ యించలేదు, నాతంతివార్త నందికొనినపిదప, నీ యుత్తరము వ్రాయుటకు తగినంత వ్యవధి లేదేమో యనియు, నీయుత్తర మున నుండిన కవరుపైమీద 'ఉజ్జయిని' ముద్రలేక, 'సెట్ కో' అని రైల్వే మెయిల్ సర్వీసు ముద్రమాత్ర మున్నదే యనియు, ననుకొనుచున్నాను గాని మరేమియు లేదు. ఐనను, నాతంతి వార్త నందుకొనిన తక్షణమే బయలుదేరుచు నిది వ్రాసియుండ వచ్చును, ఆ సమీపమున నున్న మరియొక యూరనాగుచు, నీ యుత్తరమును రైల్వేమెయిల్ వాగెనులో వేసియుండవచ్చును కావున నిందేమియు ననందర్భము లేదు.' అని సమర్థించుకో బ్రయత్నించుకొనుచు గాబోలు పలికెను.

'సరేగాని, బాబయ్యా, నీవువచ్చే తారీఖు మాత్రము తెలిసినదికాదు.'

'అయ్యో, తెలియకేమి? ఎల్లుండి' అని వ్రాసిరే! మొన్నటి దియుత్తరము అనగా నేడే యనుటకాదా! ఈ సాయంత్రము ౬ గంటలబండికి వేళకు మనము పోదము. నీవును సిద్ధముగ నుండుము.'

'బాబయ్యా.........'

'ఏమో చెప్పబోవుచు, సంశయించుచున్నావేమి?'

గుల్సుమ్ విస్మితవదనయై మిన్నకుండెను.

'ఏమమ్మా, దస్తులనుగూర్చి యాలోచించుచుంటివా? అమ్మా, తమిజుద్దీనును, నన్నును సమభావమున జూచుకొను నీ వేల నిటుల సంశయించుట!'

గుల్సుమ్ మారు పలుకలేదు

'ఇంట గింటన్నరలో నీకు తగిన దుస్తులు రాగలవమ్మా అప్పుడే పురమాయించినాను. నీ వివాహమునకు పూర్వము నీకు దుస్తులు తయారు చేసినవాడే— కాని, వచ్చుచున్నానని వ్రాసియు, వచ్చినతరువాత, నిన్నును, నన్నును, చూడక పోవునా? చూడకపోయినచో, దానిటకు రాబనియేమి? మనలను గలసికొనుటకును, ముచ్చట్లాడుకొనుటకును, కష్టసుఖములు గలపోసికొనుటకును గదా రమ్మని తంతివార్తనంపితిని. ఇట్టి పట్టున, నిన్ను వచ్చి తన్నెదుర్కొనగోర నేల?'

'వేరు ఏకేసములా? ఈ 778 తో సంబంధించి యున్నావా?'

'ఆఁ—778 యే—వాడే లేకున్న, లాల్ యింట్లో చోరీయే జరుగకపోయియుండును. దీనికంతా వాడే గ్రంథకర్త.'

'ఆ! ఏమది!! వింతమాట లాడుచున్నారు!!'

'మీకు వింత; నాకు వింత; లాల్‌కో వంత!'

'పోనులెండి-ఏదో కొంచెము సూచనగా చెప్పరాదా?'

'సూచనగా నేమి? పూర్తిగానే చెప్పవలసియున్నది. కాని ఇవు డేమియు నన వలనుపడదు. వేయేల! వాడే లేకుండిన, నింతవరకే ఘోరనేరములే జరుగకపోయియుండును.'

'అటులనా? అబ్బా! ఏమియాశ్చర్యము!'

'ఇదే ఆశ్చర్యకరమైనచో—

(i) పోలీసుస్టేషనులో మనమిరువురము 'జిగొమార్' అను సంతకముతో వచ్చిన యుత్తరమును గూర్చి యోచించి, నేను 12 గంటలు ఆప్రాంతములో లాల్‌చంద్ యింటికి వెళ్ళి, అదివరకే, అక్కడ ప్ట్రోల్ చేయుచుండుటకు నిర్ణయించబడిన మంగళ్సేన్ మొదలగువారిని ఢిలీస్ చేయుదునని, నేను మీతో చెప్పుచుండగా, అప్పటికి మనపద్దనే యుండి, వినుచుండిన 778 తనకు శెలవు కావలెననిన్నీ, జబ్బుగానున్న తన భార్యకు మందును మాకును చూచుకొనవలసియున్న దనిన్నీ, తన కారాత్రి ఆఫ్‌డ్యూటీకూడా నిన్నీ చెప్పి, మీవద్ద శెలవు

తీసుకునిపోయినవాడేడీ, మరి రావేలేదే, ఆసుదినము వరకును? ఇందు కేమందురు?

(2) నేనా రాత్రి మీతో ఏదో ప్రసంగవశమున, మాటల ధోరణిని స్టేషనులో నుండిపోయి, నియమిత కాలమున కక్కడికి పోకపోవుటవలననున్నా, మన నియమిత కాలము వానికి దెలియుటయున్నా, కారణములు కావా? నా కారునుకూడా వాడు వాడుకొనుటకు అవకాశము కలుగుటకు లేదా? ఆ మైర్సుగల మరియొక కార్నైసను వాడుకొని, అది స్టేషను దారిని లాల్ యింటికి తీసుకొని పోవుటకున్నా, వాడు కారకుడుగా నుండుటకు గాని సహాయకుడుగా నుండుటకు గాని, నమ్మతించి ఊరకుండుటకుగాని, అవకాశము లేదా?

3. మరియును, లాల్ టెలిగ్రాము యిచ్చి, మనవద్దకు తిరిగీ వచ్చినప్పుడు, అతనితో వీడును వచ్చియున్నాడు. మీరది కనిపెట్టనూ లేదు; నే నెక్కడనున్నా చెప్పియుండనూ లేదు గాని అప్పుడు నా సంశయము ప్రబలమైనది.

4. ద్రోహి నూపరింటెండెంటు రూపముతో వచ్చి, నన్నునూ, షెల్లాకునున్నా, రిమాండులో నుంచుమని చెప్పినతోడనే అదివరకే ప్రబలమై యుండిన, నా సంశయము మరింత వృద్ధియై స్థిరపడినది.

5. అనంతర మొకమారి—మీ రెరుగనే యెరుగరు, చూడండి—ద్రోహిని మేము పట్టి తెచ్చిననాటి రాత్రి, నేను

టెలిఫూన్‌లో పిలచి స్టేషన్ రైటర్‌తో మాట్లాడి నవ్వాడు, ఆర్డర్లీ సైకిల్ కాన్‌స్టేబిల్‌ని పంపుమని కోరగా, ఆర్డర్లీ మరియొక డుండగా కూడ, తానునా వద్దకు వచ్చినాడు. అప్పుడు; 'నరే నీవా ?' యని నాయనుమానము స్పష్టీకృతము గావించుకుని, ఇంకేమగునో చూతునుగా యని నేననుకొని వానిద్వారా తంతివార్త నంపితిని. కాని అంతవరకు నేమియు తేలలేదు.

6. ఆఖరికి ఒక చమత్కారము జరిగినది. 'గుల్‌సుమ్ యిక్కడ నున్నది; నీవు బయలుదేరి రావలె' నను తంతివార్త నంపుటకు స్టేషనునుండి ఒక కాన్‌స్టేబిలు నంప గోరగా మరల నీ 7[illegible]8 యే, నాయెదుట తయారయినాడు. అన్నా, ఇది బాగున్నది కాదురా యని, వాని నంపివేసి, మరియొకని ద్వారా పంపినాను. కాని—చూడండి, వాని ఉబలాటము! పిమ్మట నాకు రసీదు తెచ్చియిచ్చినవాని నడిగి తెలుసుకుంటిని. వీడును వాడును గూడ కలిసియే వెళ్ళియుంటిరట—నా మనోక్షేత్రమున నదివరకే నాటబడిన యనుమాన బీజము మొక్కయై, చిగిర్చి, వృద్ధియై, పూచి, కాచి, ఇపుడు ఫలోన్ముఖమునకు వచ్చియున్నదని తోచుచున్నది. ఏదో ఫలితము దేలుటకింక నంతగా నాలస్యము లేదని తలంచెదను. కాని నేను కోరగనే, ఆర్గురు కాన్‌స్టేబిల్సు తుపాకులతోనున్న, ఇద్దరు బేడీలతోనున్న నే నెక్కడనుండి టెలిఫూన్ చేసినను, నావద్దకు పంపవలసియున్న మీరును హుషారుగానే యుండవలెను.'

'సరే—అలాగే చేయుదముగాని, సిరాజ్‌హీన్ పేర మీరారంపిన తంతిసందర్భములో, వీని నెట్లుల సంశయించ గలుగుచున్నారు?'

'ఇప్పు డిపుడే సిరాజ్‌హీన్ సంతకముతో నొక యుత్తరము గుల్‌నమ్ పేర వచ్చినది. దాని పోష్టుముద్ర నాకు సందేహ కారణము; అందున్న సంగతులు విన్నారా? ఎంత చమత్కారమో! తాను వచ్చుచున్నాడట కావున, తన నీమె స్టేషను సమీపమునందున్న రాజకుమార్ రెస్టు హౌసులో కలుసుకొనవలెనట. ఎందుకో? వచ్చినాడు రాడా; చూడడా? చూచుటకు గాకున్న, నింకెందుకట తనరాక! ఊరి ముందరకు వచ్చినకొలదిని, ఉరుకు లెక్కలేవ యాతనలున్నదీ తొందర—ఈ తమకము—ఈ తహ తహ! నా పెల్లిగ్రామము చేరిన పిమ్మట, తాను బయలుదేరుచు నీయుత్తరము వ్రాయుటకు తగినంతవ్యవధి కలదా యని నా సంశయము.'

'ఔను—కావచ్చును మీరు చెప్పిన దంతయు పూర్వపక్షము సేయ బ్రయత్నింపను కాని, ఎవరైనా, తాను వచ్చుచు, దన భార్యను జూడ గోర్కెయుండ, తాను రైలు దిగినతోడనే, తన్నెదుర్కొన జూచువేడుక యుండరాదా! అందేమి యసంగత మున్నది? మరియు నుత్తరము టపాలో వేయునంతమైన ననన్వయము గాదే! ఏదీ దానిముద్ర?'

'Set No. 5 (సెట్ నెంబరు 5) అని యున్నదిలెండి.

అది ఉజ్జయిని సర్కిల్ తాలూకు నెంబరే. అందులో నేమియు సంశయము లేదు. కాని యీ యుత్తరమే అసంగతమనియు, అనన్వయమనియు నే దలంతును.'

'ఏమో; చూడవలసియున్నది!'

'ఔగాని, డిపార్టిమెంటలుగా మన మిచ్చిన టెలిగ్రాముకు సూపరింటెండెంటుగా రేమనిరి?'

'ఆయన రా వీలులేదనియు, డెప్టీ సూపరింటెండెంటు గారిని చూడమనియు, తంతి వచ్చినది. ఆయనయును వచ్చి, వివరములు కనుగొని, ఎంక్వైరీ పూర్తిచేసి, ద్రోహినివట్టి తనకు తెలియజేయుమని చెప్పిపోయిరి'

'సరే. కాని, మీ రొకసారి నాతో మా 'ఔట్ హౌను' కు వచ్చినచో, మరియొక విశేషముచూపెదను'

* * * *

'ఇతనెవరు?'

'చూచినారుకదా! అటు పదండి; సంగతి సావీపులాకముగా, అంతా చెప్పెదను.'

* * * *

'చూచినారుకదా; వీడు అసలుకే మొనరు పెట్టినవాడు. జుమిూలియాకాలమున నుండిన—ఇప్పు డీ సర్కిల్‌లో లేడుగాని—జత్తీబాబుకి బాగుగ తెలుసును'

'జతీ బాబు పరనపుజట్టీలో బాగుగ పని చేసినవాడు. అయితే పూర్వగాథ కేమిగాని, మన ద్రోహిచేత, విఫలమనో రథు డైనవాడు; చెప్పెదను రండని, తీసుకొని పోయెను.

అన్నా, అరిందమ్! నీతో చాల చిక్కుగ నున్నది. ఎక్కడికో దీసికొనిపోయి నీ వా సర్కిల్ ఇన్‌స్పెక్టరుతో మాట్లాడనేల? మేము విని దప్పా? పోనీ లే; ఆ కరీమ్ గులాబ్ సింగయి, జామలకాలమున చేసిన కార్యములును, ఆతని నిజనామమును, మే మెరుంగుటకు 'నేనే' యను గ్రంథము లేకపోలేదు లే! ఆతనితో ప్రసంగ మంత మయినపిదప, మరి యిటురాక, వానిం బంపివేసి, నీవు నీకార్యములపై బోవుచున్నావే! అన్నా! ఏదియు మొదలును గొనయు దెలియనీయవే!



కాబూరాయి

---

ద్వితీయ ఖండము

ఎదురుచూచ్చాపాటు

---

మొదటి ప్రకరణము

---

'సిద్ధముగా నున్నవి బాబూ, కార్లు—'

'రామకృష్ణా, ప్రస్తుతం ఒక్క కార్ చాలు.'

'అమ్మా, మనము బయలుదేరవలెను. సిద్ధముగా నున్నావా?'

గులీసుమ్ ఒక మాణిక్యపు బొమ్మయై, అరిందమ్ యెదుట నిలచెను. ఈమాణిక్యపుబొమ్మను వర్ణించుచు నొక్క వాక్యము వ్రాయుటకైనను వలనుపడనీక మాకలము ముందు కథకు బరుగిడుచున్నది. అదో, ఏమో అరిందమ్ ఉల్లాసమున నున్నాడు—'యేస్, ఎగ్జాట్లీ! సరిగా నేననుకొన్నట్లే అమరినదమ్మా ఆ గౌను—ఆ రంగు అంతాను; నేను ముందుగ పోలీసు స్టేషను తెస్తున్ననోయి, రాజకుమార్ సెట్టు హానూ

పడమటిదెస, మధ్యాంగదిలో నుండును. కార్ మరల గావేగమే బయలుదేరును. రామకృష్ణ నీ కంగరక్షకుడై రాగలడు'

* * * *

తరణికిరణవారము జల్లాడుచున్నది మహా రైదు గంటలు కావచ్చునది వీధి వేకార్ పోవుచున్నను, తనకొరకే వచ్చుచున్నదని బైలుకువచ్చి చూచుచు, మరల లోనికిబోవుచు కార్కొర కెదురుతెన్నులు చూచుచు, నాందోళనాపవన సంచలితమనస్కుడై, ఇటునటు దిరుగుచుండు గుల్సుమ్‌ను జూచి, మెల్లన, 'ఎందుకమ్మా, ఆతొందర?—కూర్చో—కార్ వచ్చునులే!' యని సరోజిని గేలిసేయుచుండ, 'నదిగో, రామకృష్ణో, కార్' యని పలుకుచు, పలుచని మేఘముల నందున దోబూచు లాడుచున్న చందురుని చందాన గుల్సుమ్, ఇలువీడి కార్నధిరోహింప, మోటారునడచుచుండెను.

---

రెండవ ప్రకరణము

---

'మోహముల వెర్రిది. స్వర్ణమయి నేల యులబడి నొందించుట' యని, నన్నడుగవుగునరును నోనాడను. ఇంతయును, స్త్రీలోకమునకు వ్యక్తిసంబంధముచే, జాలివొడముట సహజమే గాని, నా యుద్దేశమును, తత్సిద్ధికొరకు నేజేయు ప్రయత్న

ములును, తత్ప్రియత్నములు ప్రమాదరాహిత్యతయు నన్ని కావలయునా? పోనీ, దాని యబునున కేమిగాని, నా కెంత దిట్టరి! ఆతని సిరుల సాచితి, మఱియు నాతని నాఱడి బెట్టగ నైన వారి ప్రేరేచితి; పశంతికిం దనకు బొం దెడజేసితి. ప్రేచితి; లోచితి; వెతల గంద నలంచితి; అప్పుల మోపితి; నేచితి; పెన్నట్టుల పెట్టి, తడవుల వేచి, చూచి, నుల్ల మల్లల నాడ నూచితి; మాయురే! ఎన్నిట న్లొంగడు; ఎదం డలంకడు; బింక మూడడు; కట్టా! ఎట్టిదిట్టరి! ఐన నౌగాక గాని, ఈ యెత్తున, చిత్తమ్మున దిట్టతన మ్మూడక తప్పదు! త్రాహి త్రాహి యనక తప్పదు! అక్కఱలేని గోడవల కేగిన, పాప మిట్టియిక్కట్టులు దప్పవు. ఈ యెత్తున గుల్సుమ్, ఈవల నా వలం బడకతప్పదు; అతని పట్టుపుగక తప్పదు—తప్పదు'

'ఆఁ—ఎవరది? ఓహో, మీరా! వాః—సరిగా నమరినదే! ఇ దెవరిపని? యమోలూదా! నా దెక్కడ—జపాన్ సొగసు, జపాన్ చేసాప్పు, జపాన్ నేర్పును ప్రదర్శించినాడు. సరే—వదండి. మీ కది యమరిగా నా కేనా యిది యమర లేదు. మీ నౌఖరుగా నేనును లేనా? అన్నియు బాగున్నవి గాని, నభో పిరికితనమును, మీకు కావలసిన గుల్సుమ్‌తో మాట్లాడుటకై నను సిగ్గును, మీకు లేకున్న, మన ప్రయత్నమున నిస్సంశయముగ మనకు జయము కలుగక తప్పదు.'

'ఏదో యొకవంక నెంచవలెననే యుందునా యేమి?'

'ఉన్న మాట క్షమకేల? అది సహజమే యనుడు.'

'నే నేమియు ననను; ఏదో కార్యము ననివార్యముగ జయ మందజేసిన, మీ రనుకొనినదానికన్న నే నన్నదానికన్న, నేను మఱింగు లధికమూ తెరంగున సంతోషపెట్టెదను.'

'ఔనౌను; మీమాట నట్టిదే! కాని మన మెక్కడికి పోయినను, మీ రేమియు మాటాడవలదు. నా వెంటనంటి వచ్చుటదక్క మరేమియు చేయనక్కరలేదు తడవులం బట్టి అవసరమైన మాటల చెప్పుచుందును. మీ కవిత్వములును, మీ పాండిత్యములును గిట్టిపెట్టవలెను.'

వీ రిరువురును ప్రయాణమై పోవుచున్నారు.

* * * *

'ఈ పురసౌధములు నున్న కామినీజనముల జూచియే, కాళిదాసు చెప్పియుండునని దోషింప, నాహా! ఏమి యీముద్దు గుమ్మల యందము!

'శ్లో॥ గేహేగేహే జంగమా హేమవల్లీ—'

ఏకాగ్రనము పేతులై, వడివడి నడచుచున్నారు.

(తనలో) 'ఏదో; ఈవెర్రి అణగినతర్వాతనే ఆయను—'

'వల్యాం వల్యాం పార్వణ శ్చంద్రబింబః'

(తనలో) 'అన్నా, ఈశ్లోకమంతా పూర్తిగా చదువును గాబోలు వేళ యయిపోవుచున్నది. బోలెడుదూర మున్నదే!'

'బింబే బింబే కోకిలానాం విరావో,

'రావేబావే' మన్మథః పంచబాణః.

'దీని వ్యాఖ్యలో కూడా.........'

'ఆఁ—ఆఁ ఆగండి; ఆగండి. ఈ గొడవతో వేళ మించిపోవును. మనము పోవలసిన దూరము యెక్కువ; మీ మోహావు వెర్రియు నెక్కువ కాదు. అన్నా, చిక్కగా నున్నదే! ఇక్కడా శ్లోక మెవ రెరుగరు? కిక్కుమనక పదండు. పోదము—'

వారి గమ్యస్థానము జేర నెంతో బిరీన నరుగుచుండిరి.

* * * *

ఏమి! బండ్లు—మోటారులు—ట్రాములు—

* * * *

'గురూజీ, గురూజీ, చూడు డీ చెన మోటారు!'

'ఆఁ—చూచితిని, మరి వీవు గోకవలదు. గుర్తించితిని. మరి సంశయము లేదు. జయ మరచేత నున్నది. వక్కను ద్రొక్కివచ్చిరి. మరి యాందోళన వలదు.

(తనలో) 'ఔరా! ఇక జిక్కితివి!'

వడివడి నడచుచుండిరి.

| | | |
|---|---|---|
| సాయంకాలము<br>౫ గంటలు<br>ఇంకను కాలేదు | మోహా<br>రంగము | రైల్వే స్టేషను సమీపమున<br>రాజకుమార్ రెస్టుహౌస్ |

'వహావ్వా! వహావ్వా!'

ఉ. 'దాని ముఖప్రభాగరిమ, దాని కపోల కళా విశేషముల్
దాని బెడంగు చూపులును దాని.........'

'ఆఁ—ఆఁ—ఆగవయ్యా, పద్దుసుమా—కొంతముం చేటట్టున్నది మీ అల్లర — మాట్లాడకూడదు — అంతా స్వగతమే యని యెంతచెప్పినా యింతే!—మరి నావీపు గోక వద్దు—ఔను, చూచినాను — మీరిక్కడే ఉండండి; సంగతంతా మినిట్లమీద నున్నగి—వది అడుగుతే!—'

* * *

'జగద్విఖ్యాతి గలవాడ నని యనుకొనుచున్న ఓ అరిందమ్! ఇం కెందుబోగలవు! ఇక నీకు తెరువెయ్యది? నిన్ను జితోస్మి యనిపించుటకును, నేను కోటీశ్వరుడ నవిపి చుకొనుటకును, బద్ధకంకణుడనై మహానాటక మాడించుచున్న నన్నేమరతివో! కాక మరచితివో! నీ కుశాగ్రబుద్ధి యబద్ధమైనదే! నీ 'మేధ' వృథయైనదే! నీ నిరూపకము లెల్ల నిరూపకములైనవే! నీ ప్రతిసకు గతియేదీ! ఇక నా కోడితివని యనగును గదా! న న్నొకతూరి బంధించితి గదా యని యందువేమో! కపటమార్గమున కదా! అ ట్లయ్యెను మిమ్ముల నందర చిత్ర ప్రతిముల జేయు తెరంగున నెగిరిపోతినే! నను బట్టితి గదా యను నానందమున, నీయిలు జేరి, నీ యారాధదాని కొర కాడుదానింబలె, బంలోదనమునేసియు, సంగ్రించియుండలేదా! రేలుంబవళ్ళుల భేదముల మరచి, గంటల గమనించలేక, ఒకదాని కొకటి యనుకొని, ప్రవర్తింపలేదా! నా సమయములకెంట నొకటి నెగ్గినది కదా! ఇక నున్నది నేటితో నాకోటి బూర్తియగుటయు, తనస్మాలమున యోగిని మాత్మకు శాంతి

కలుగుటయునే కదా ! నీ సమయము లన్నియు నిక నీ సమయమున చూచెదగాక ! ఇక నేజేసెద నన్నను, జేయునది లేదు. ఇక నాచేతల నెన్నలేవు—ఇక నా కృత్యముల గాంచలేవు—మరియు, నావలు కాలింపలేవు ఇదియే నా కడసారిపని—'

* * *

'ఓరా ! ఏమి దీనియందము.

శా 'చెండ్లా గుబ్బలు, జాళువా తళుకులా చెక్కిళ్ళు, డా
ల్సింగిణీ తో, విండ్లా కన్బొమ, లింద్రనీల మణులా వేణీ
రుచుల్, తమ్మిలేం, దూండ్లా బాహువు లింత చక్కదన
మెందుంగాన, మిాజవ్వనిం, బెండ్లాడం గనువాడు చేసి
నది సుమ్మా భాగ్య మూహింపగన్'

ఆహా ! యీ మాణిక్యపు బొమ్మకై నా సర్వస్వముం గోలు పోయినను నాకేటిలోటు !

సీ 'దెలియ పెన్నెరి గుంపుం జే పట్ట గలిగెనా,
ఘన సంపదలు వేడ్క గాంచినట్లు;
కాంత మోమున మోము గదియింప గలిగెనా
యతులిత రాజత్వ మందినట్లు;

ఊరక పూర్వకవుల నిందింతుము గాని, భావము లన వారి సొమ్ము ! ఆహా ! భావ యన, వారిదే !

ముద్దియ కన్దోయి ముద్దాడం గల్గెనా,
యింపుమై గువలయం బేలినట్లు;

వనిత కంఠాశ్లేష మొనరింపఁ గల్గినా,
యరుదార పెన్నిధి యబ్బినట్లు;

తే. గీ. కలికి కెమ్మోవి చవిఁజూడ గలిగెనేని,
యురు సుధాహార వైభవం బొందినటుల;
నెలతతోఁ గూడి క్రీడింప గలిగెనేని,
యతను సామ్రాజ్య మంతయు నమరినట్లు'

ఆహా! ఆ నిలచిన యంచమున కేనే మిచ్చినను దనివి తీరని యీ జగన్మోహనాకార అదే,

ఉ. 'నాఁడెనఁ జూచుచున్నది, ఘనా ఘనబృందసమానకుంతలా
చ్ఛాదితనిష్కళంక ముఖ చంద్రకళల్ వికసిల్లఁగన్, శిలా
వేదికఁ గేలుమోపి వలపించెద ర మ్మను నట్లు, కాముపం
పాదిత మోహపాశముల వైఖరి రాజిలు దృక్పరంపరన్.'

ఆఁ—ఏమిది! గురూజీ ఇంకను రాలేల? బహుశః స్థానమందును, రసమును, బసరును, ఘన మణిమంత్రౌషధములును, గైకర్డిక కావును, గుళిక, మ్యాలెక్క, బూతియు, దవిలిచిదే నాలోచించు చుండునా? కాని నాఁడేల యింత యాలస్యము? గొంతెత్తి బిలచెదనా?—గురూజీ!—కాని మిన్నించుక వేచి నేనే స్వయముగ బోయెద—కాని,

క. 'కమలంబుల కమలంబుల,
గమలానన లోచనముల కాంతి జయించుం,'

* * *

'అన్నా! నేను జేయుచు న్నైకోలదిని వీని యుబలాట మధిక మగుచున్న ట్లున్నది—అబ్బా! పిలుచుచున్నాడే! అన్నా!—ఏమి చేయుదు; కొంప ముంచునటేమి! వాని నూరకుండ జేసొజ్ఞ చేసెదను'

'ఏమిటి?—అమ్మోయ్, స్వాధ్యాయము కాలేదు గాబోలు! మాటాడిన రసభంగి మగు నని, చేసొజ్ఞను రమ్మనుచున్నారా! ఇదో వచ్చుచున్నాను.'

* * *

సమీపించుచున్నాను.

* * *

'గురూజీ—తిపరే—పాపము—ఘోరము—

'దూతి త్వమాకృత మహో సఖిలం మనుక్తం
సత్వాద్దృశీ పరహిత ప్రపణాం ఉత్ప్రిలోకే.'

యనునంత పనిజేసితే! అబ్బా! నాకోర కేగి, స్పర్శ సుఖమైన బొందుమా గదా యని, ఏగా, యింత లోనర్ప మేరా నీకు?' కని దీర్ఘమున నాతని చేయి నొక మోరకుం ద్రోసి, తన రెండవచేతితో నామె కరమును బట్టబోయెను. సరి—యిరువురును—ఇంక నవ్వాలికథ నెవ్వరి వ్రాయుగలు గుట! వ్రాయక ఊరకుండు టెట్లు? ఇక నేమి వ్రాయుదు మన్నను కలము సాగదాయె; వ్రాయకున్న, మా చదువరు లూరకుండరాయెను; ఏమి సేతాము' అ—ఇంతకును మాకాధార

మక్కర లేకుండగనే, వారిరువురిలో నొక రేమోయనుచున్నా రుగదా; అటు వినుమా!

'అన్నా, అరిందమ్! ఇదిమావని! నీమగటిమకే దగని పని; ఘూటాకోరులకును, బద్మాషీలకును లక్షణమును, బహాద్దూరీయును నగు నిట్టికార్యము నీయట్టివానికి దగనిపని యని ముమ్మారు గొంతెత్తి చాటగలను. అబ్బా! మొండికత్తితో గొంతుక తెగనఱకుచున్నావే! ఒక్కసారిగ నీబేటరీకి ఫుల్ పవర్ నైన నిచ్చివేయుము. పశుబలమువంటి యీ విద్యుచ్ఛక్తి చేపట్టినందుల కెంతేని స్తుతనీయుడవేగాని, శారీరక మగు నిట్టి యాధిని హెచ్చింపక, మరియుమరియు, నీమేధను గనుపరుపుము, నీచేతలు బిన్నాతు కాలముచుండియు నెరింగియు, జనులను నిర్బంధించిన తెరంగనుభవైక వేద్యమయ్యె, మరల నీగోతిలో బడుట కెంత మందుడనై, యధమనైతిని! ఈ మాణిక్యపుబొమ్మను నిజముగా గుల్‌నుమ్‌యే యను భ్రమ గొలిపింపదగు తెరంగున నిలువబెట్టి, కనులాడజేసి, ఎలెక్ట్రిసిటీతో చార్జిజేసి—విద్యుచ్ఛక్తిని బూరించి, ఓహో! ఈక్రింద నెంత ఇన్‌సులేట్ (మానవకరముల దాకుడువలనను, భూమితో నంటియుండుటవలనను, విద్యుచ్ఛక్తిపోకుండ గాపాడు నుపకరణము బరచియుండ) చేసితివి! ఎంత మోసగించితివి;...... అబ్బా! అమితమౌ బాధగానున్నది......తగ్గింపుము...... తగ్గింపుము......'

'ఓహో! సిరాజ్ హీన్ గారే! దయచేయండి; లోపలికి దయచేయండి. గుల్సుమ్ లోపలనున్నది. ఇంకను భ్రమయేనా? అన్నా మరుశావము మతిభ్రమణమునకు గారణమయ్యెనే, పాపము!' అనె నరేందమ్

'గురూజీ! మీరును భ్రమపడిరే?'

'అయ్యో, మూర్ఖుడా! కార్‌లో పోవుచున్నదానిని, నీవు చూచి, నాకు చూపి, ఇటుల కొంపముంచితివి! కానిచో నీఫలితము నీకే అందజేసి యుందును' (తనలో) 'ఈతనికి మదపిచ్చయును, నాకు ధనకాంక్షయు నింతకు దెచ్చినవి' (ప్రకాశముగ) 'ఐన దైనది కాని, అటో, ఇటో, ఏదోయొకటి దేల్చివేసిన బాగుండును. నా కాముఖియైనది. మరి బాహో బాహి లేదు; గత్యంతరము లేని రాజీకాల మాసన్నమైనది. ఆఁ—తగ్గించితివే! నన్ను పట్టుట కిటుల విద్యుచ్ఛక్తి సహాయము గోరనేలయని, నిను నిందింపనులే; నా యట్టివానిని బంధింప నింతకన్న సులభమార్గము, నీకే కాదింకెంత మేధాశాలికైనను, లేదని నేనెరుగకపోలేదు.'

'నీ పేరును, నీచరిత్రయువిన గడుగుతూహలుడను.'

'అయ్యో, ఇంతకాలమైనది. ఇన్నియైనవి. మరి నీకును నాకును జిక్కులులేవు. అన్నియు ముగింపుతెరయే యిది; ఇక బ్రత్యక్షమున దాపరిక మేల;

'సర్వదాత్సృష్టి యగు నీ బ్రకృతి, నాచే నాడించు చున్న నాటకంబిది యని యెఱింగియు, బౌద్ధకులజుండ నౌట పరమనాస్తికుండనై, ఘనాంతస్వాధ్యాయినయ్యు, వేదాంత, మీమాంస శాస్త్రపరిజ్ఞాతనయ్యు పశుపశి, చార్వాకమత స్థుండ నౌట బ్రాహ్మణద్వేషినై, సర్వ మును బ్రకృతిధర్మంబ యని నమ్మి, కర్మస్వాతమే జగత్సృష్టి, స్థితి లయములకా లయు ననుచు షడ్దర్శనముల నధిగమించి, చతుష్షష్టికళల నల వరచికొని, పౌరుషేయములౌ వేదములు ప్రమాణంబులని గుర్తించి, నా ప్రతిభాగ్యంబునకును నాకు బాధ్యతలేదని, యెడనెడ నెదనమ్మియు, నా చిరుతప్రాయముననే మాతృ పితృవియోగమునను నా జన్మభూమియు, సర్వసంపదల కాల యమ్మును బిల్హణ, కల్హణ, పద్మగుప్త, రత్నాకరాది సంస్కృ తమహాపండిత జన్మభూమియు నౌ గాశ్మీరము వీడి, యా సేతుహిమాచలమేగాక, దేశాంతర ఖండాంతరము లౌ లాంతి విలాతుల నెల్ల గరిడీముచ్చులతో దిరిగి తిరిగి, పాశ్చాత్య శాస్త్రవిశేషము లశేషమ్ములుగ నెరిగి, పదునెనిమిది భాషల బాండితీ మహిమ నొంది, కవిత్వపటుత్వసంపద నలవరచికొని, యంత్రమంత్రతంత్రముల నేర్చి, వశీకరణవేదండ మానీదండ మండ నుండ, దిరుగుండ దని దరిచేరనమ్మి, ఎందరో శిష్యుల సేకరించి, మించి, నా ప్రేమకు బాత్రురాలును, రూపొం దిన యందమనదగినదియు, నిను ధిక్కరించు మేధస్సు గల

దియు నగు మారుల యును, మహారాష్ట్రాంగనను జాయగా జేరదీసికొని, గోటీశ్వరుండ నా దలంపున నేనాచరించిన పెక్కుకార్యముల కపుడపు డడ్డువచ్చుచుండిన నీవు, బహు మేధావంతుడ వని వినినిని, తొలి బిస్మార్క్ చే నాటక మాడించి, పదంపడి విమలమై, బ్రవిమల యా జానులచే నీకు బుద్ధులు గరుపనెంచి, నాకర్జనుల కెడనెడ నడ్డువాట్లువేయు చుండిన నీతో, నేనే న్యాయముగ జేయి గలుప నిశ్చితమన స్కుండనై, నిను బ్రతారింప నమకట్టియు, నీకు లాభకారి యూనుపనుల నెన్నెని వన్ని, తొలి జిగొహూర్ సంతకముతో లాల్ చందు నింట దోపిడిం గూర్చి, తగినంతవ్యవధి యుండ గనే, ముందుగ దెలియజేసి, మాయాప్రయాణస్తుల అబద్ధపు దోపిడి కేసునందగా ఫిర్యాదని బోల్చికొనజాలక విచారించుచు, సర్కిల్ ఇన్‌స్పెక్టరును నీవునుంగూడ తదాలోచనానిమగ్నులై యుండునటుల బన్నగించి, దీకార్ లో నేనే, నీకై పోయి, మీ యధికారవర్గమువారట జూచుచుండగనే, మీకంట నుమ్ము గొట్టి, నాకార్యమొనర్చుకొని, నెన్నెని వివరములతో మీపోలి సువారియజాగ్రత్తయు, నిరుపయోగత్వమును లోకమునకు వెల్లడి జేసి, మారువేషముల ననునధిగమింప లేవనియు, నను నను గానెన్నండును గాంచనీకు దుర్ఘటమనాట, నీచేతల నికనైన నుడుగుమని దెలియజేయుటకో యన, నేను, నూపరించెండెంటు నై, మీసర్కిల్ ఇన్‌స్పెక్టరుచేత నిను రిమాండున నుంప

నియమించి, అధికారుల లోనర్చు న్యాయాన్యాయ విచక్షణయు, దోషనిర్దోషజనవివక్షతయు నొకింత సూచించి, యనంతరము స్త్రీపురుషులై ప్రయాణీకుల వేసమున, నీ మాయావాగురం దగులజేయ నెంచి, మాగృహం జేరిన మిము, నొకింత శంకించియు హాని జెందగనీక, లాభలేశచింతతో లాల్ చందు నింట, నే నదివరకే వేసియుంచిన టైమ్ లాక్ (నిర్ణీత కాలముననే తెరువబడు బీగము) ను దీయు, నిను గొనిపోయి, తత్కార్యానంతర మట స్థితిగతులు మించి వచ్చుట జేసియు నిను నీవారి సామీప్యమున వీడు దలంపునను, లాల్ నింట నిను వీడి, నా చేసాపును జూపుచు, నీ సర్వస్వమును దోచుకొని, నిను నిస్వుం జేసియు, చంద్రమౌళినై, సిద్ధమైయుండిన నీ కూతు పెండ్లికై తంతిమూలమున రూ 3,000 లు నీ కందజేసి, నీ కెన్నండును ద్రోహ మెంచక, నీ సహచారిణి నగౌరవించక, తన తండ్రికడ సురక్షితముగ నయ్యామ నుండజేసి, మృతయా ప్రథమ కళత్రవియోగానల మెరింగిన నీకు, యౌవనాంతమున బునర్వివాహము గష్టపరంపరలకే గాని, సౌఖ్యములకు గాదను నీతిగరపుటకో యన, సజీవయా ద్వితీయజాయావియోగము గూడ కొం తొకతడవు నొకింత చవిజూపి, తుదకు, నీచే గుచ్ఛితపు పెత్తున బంధితుండ నయ్యు, ఒక్క యాడుదానికున్నపాటి తెలివితేటలు గూడ నీకు లేవుసుమా యనియు, వర్తమాన శాస్త్రపరిజ్ఞానవిద్యావైశద్యములలో, నీవు నేర్చుకొనవలసిన విషయము లింకను పెక్కులు గల వనియు దెలు

వుచు, పాశ్చాత్య విద్యాప్రభావ మొకింత రుచి చూపి, మింటి కెగసి, మి మ్మిందర జిత్తరువుల జేసి, నిం కిటు నెన్నియో నీ కుపకారము లొనర్చియు, నాపై గత్తిగట్టుచున్న వానితో జేయి గలుపక తప్పదుగా యని విచారించి, స్థిరీకృత మనస్కుం డనై, అవివాహితగా నున్నకాలము నుండియు గుల్‌సుమ్‌ను గాంక్షించుచు, నీ కాసందర్భమున జాగీరుగా రెండుగ్రామము లిచ్చెద ననినను, ఈ జమీందార్ పటేలునకు నీ యసామర్థ్యంబు కతంబునను, నీ ధీ రహితచిత్తంబునను, నీతని కామె నప్పగింప జాలమి, నా మేధాశక్తియు, నా ధీర హితచిత్తంబును వెల్లడి సేయుచు, గుల్‌సుమ్ నీతని కప్పగించియు, నీ రసాయనిక శాస్త్ర పరిజ్ఞానమున నీత డామెం గోలుపోవ, మగుడ నీసమయమున, నీ బుద్ధిచాతురీమహాత్త్వంబున 'మానవు నజ్ఞానచక్షువునకు గాన వచ్చున దెల్ల సత్యమ యని దలంపకూడ' దని లోకమున జాటు నీ హిందూచిత్రశిల్పకళాచాతురీమహిమమునను, ఎంత పగకీలోగాని, ఈమాణిక్యపు సాలభంజిక యగా గుల్‌సుమ్‌చే, నీ విద్యుచ్ఛక్తిప్రభావముచే, నేరికొరకు, చిరకాలమునుండియు, నేటివరకును, నీకు సింహాస్వప్నసన్నిభమై యుండి, నా నెం 94[illegible]7 రు మోటారు పన్నాగ మెరుంగరాకుండ జేసి, తుదకు, గ్రహచారంబుకతన నీవే—కాదు—కాదు. విద్యుచ్ఛక్తిచే దుస్సాధ్యుండనయ్యు, నీకు సుసాధ్యుండ నయిన కాలూరాయిని నేనే.

'నాకథ అంతా యింతే గాని—ఆఁ—ఏ మది వ్రాయుచున్నావు? మరియు వ్రాయించుచున్నావు? నేను తప్పించుకొని పోదు ననే, నీ స్మృతినైజము గనుపరచుకొంటివి గాని?—వీరందరును నను బట్టుటకే! పాప మెన్నివిధముల జాగ్రత్త పడితివి? నీ వేమి చేయించినను, వినశ్వరమా నీ చక్రభ్రమికే గదా! ఆత్మ అజేయమనుమా! మేధాశక్తి దుర్భేద్యమనుమా! శక్తుల యుద్దేశములును, నిర్దేశములును నవ్యయములనుమా!'

'ఇంతకాలమునను కాలూగాయని ప్రత్యక్షముగ జూడ గలిగినందుల కెంతేని మిగుల సంతసమందితి గాని, అంతిపాత పెట్టిదురంతము లోనర్చినందులకు మాత్ర మేనుమనంగున విచారించుచున్నాను. ఇప్పు డీ బేటరీపవర్ తగ్గించుట నీతో గొంత సన్మార్గముం గూర్చి ముచ్చటించవలెనంచి.........ఆఁ —ఆఁ—ఆగు మాగుము. తెంపరితనమా—ఇదా పని— ఆగుము' అనుచు నరీందమ్ పలుకుచుండగనే, నెంతవేగమున దీసెనో గాని, తన మొలను వల ఖాకారముననున్న పథ్యాణము వంటి కత్తిం, దొలుత పరేల్ శిరము దెగనేసి, యనంతరము —మే మిది వ్రాయుట కాలస్య మగుచున్నది గాని—

'తొలి నీవు కుచ్ఛితపు తెన్నున నను బట్టి, ఠాణాలో నుంచిన రేతిరికడ, '......ఈ పొక్కరాత్రికి ఏం పడిపో యుంది? ఒక్కనాటి భాగోతానికి మానం గోరిగించుకున్నట్టు!' అని యని యుంటిని. అది యాదిలేదా? మిం చివచ్చిన, నపుడు

జేయదలంచుకొనిన దిప్పుడే యాయెను. నా శిష్యులే నీచేత శిక్షితులు కాలేదే; ఇక నేనా? భ్రమపడకుము! నీ చేతులలో నీచపుచావుకన్న ........' అని యేమో యనబోవుచు నొక్కవేటున నరికికొని, నేల కొరగెను మొకట పతేలును జంప నెత్తిన కత్తిని బట్టి బ్రయత్నింప సమీపించిన రక్షకభటు లెల్లరును రక్తదర్శనమున భీతిలి, యావలకు బోయియు, మరికొందరి సాయమునకు నాతని సమీపింపబోయిరే గాని, ఇంకే మున్నది? ఏమియు వ్రాయుటకును, దుష్టజనరుధిరప్రవాహ నిమగ్నమై, దృక్పథము దాటి గొట్టుకొనిపోవుచున్న మల్లేఖిని రొల్లబోవుచున్నదే గాని, యేమియు వ్రాయుటకును నొల్లకున్నది.

* * * * *

ఆ రెండు మృతకళేబరములను గాపాడుటకు రక్షకభటు లాజ్ఞాపింపబడిరే గాని, ఆ సమీపమున నేదును గావలియుండ సాహసింపజాలక, సేవకావృత్తిధర్మమున కొకింత శిరములు వంచి, దవ్వుదవ్వుల నిలచి, ఎట్టెటులనో వేగించిరి.

---

## మూ డ వ ప్ర క ర ణ ము

---

“ఓహో! మామగారు, నమస్కారము; క్షేమముగ వచ్చినారా? ఈ సాయంకాలపు బండిలోనే వత్తురని యనుకొనలేదు. మంగళ్సేన్ తొందర పెట్టినా యేమి?’

'లేదుగాని, ఇక్కడికే యిన్నినాళ్లయినది?'

'సరేగాని, అత్తగారును క్షేమముగదా?'

'దైవకృపవలన నందరును క్షేమము.'

'మీరువచ్చిన బండిలోనే పండిత త్రివిక్రమరావును, చంద్రమౌళియు రావలసియుండె' ననుచు, దానును గుల్నుమ్ యును లోపలికి బోవుచుండ, 'ఏమోయి, బాబూ, నీముఖము మిక్కిలి వాడి, యాయాసము సూచించుచు, నీరసముగా నున్నది?' అని కిషన్‌చంద్రసేన్‌గా రల్లుం బ్రశ్నించిరి.

'ఏమీలేదు—'

'ఏమోగాని, నీరసముగా నాయాసము సూచించుచునే యున్నది. మేము రైలునుండి వచ్చుత్రోవలో రాజకుమార్ రెస్టుహౌసువద్ద నేమో అల్లరగానున్నది. జనులు గుమిగూడి యుండిరి. ఏమా గంద్రగోళము?'

'అయ్యో! అదంతా మనదే; అత్తగారికి జబ్బుగా నున్న దనిన్నీ, స్వర్ణమయిని తక్షణం రమ్మని మీరు కార్ పంపినా రనిన్నీ నేను ద్రోహులగుహకు పోయియున్నసమయమున, స్వర్ణమయిని దీసికొనిపోజేసి, ఏదో పెద్దమొత్తు మెత్తియుండ, దా నింతలో పట్టుబడుటచేత గాబోలు, ఏమిసేయుటకును దోపమినో యన, రైలులో మీవద్దకు స్వర్ణమయి నంపివేసిన కాలూరాయి, నేను పట్టుబడియు నాత్మహత్య గావించుకొనినాడు. అక్కడి గంద్రగోళము ఇది.'

'బ్రదికినాఁటు నాయనా; ఇక్కడికి లోకక్షోభ మణఁగి నది. ప్రజ లింక జల్లగ బ్రదుకఁగలరు.'

'అబ్బా! ఎంతమాట!! అంతవా డంతరించిపోయి నందుల కెంతేని విచారించుటకు మా కెంతమాట యనిరి!' అనుచు భార్యను చూడఁబోయి, 'ఇదిగో, వెనుక నేను నీతో నప్పుడప్పుడు ప్రసంగరీత్యా గుల్‌సుమ్‌ను గూర్చి చెప్పుచుండెడి వాఁడను. ఈమెయే ఆ గుల్‌సుమ్!' అని యామె నీ స్వర్ణ మయికి సందర్భపఱచి, ఆ రేయియెల్ల వారివారి గత కష్టతరంగ ములగూర్చి ప్రసంగించుకొనుచు కాలముఁబుచ్చిరి.

---

## నాలుగవ ప్రకరణము

---

వేగుఁజుక్క పొడమినది. అదే ఉషఃకాల మాసన్న మైనది. తూరుపుదిక్కాంత చీకటిముసుంగు నెడద్రోసి, సహజ కాంతివంత మగు తన మోముదమ్మి జూపుచున్నదో యనఁ, దోషవరంపర లెల్ల బటాపంచలై వీడుచున్నటుల, భల్లున తెల్లవారుచుండ, ఉజ్జయినినుండి సిరాజ్‌హీన్‌యును, నాగ్‌పూర్‌నుండి పండిత త్రివిక్రమరావును, జబ్బల్‌పూర్‌నుండి చంద్రమౌళియు ఒకబండివెనుక నొకబండితో వచ్చి, వీధితలుపు దట్టుచుండ, సదివరకే నిదురలేచి, ప్రాతఃకాలకృత్యములం దీర్చు కొని కెస్తుహకాసురు బోఁబ్రయత్నించుచున్న అరిందమ్‌యును

నాసవ్యాడి విని, వడివడి తలుపు తెరచి, వచ్చినవారి కాతిథ్య మొసంగి, క్షేమాదుల బ్రశ్నించుకొని, కొండొకసేపు వెనుకటి గాథల ముచ్చటించి, జరిగినవిధ మెల్ల నూతనాగతులకు నివేదించి, సిరాజ్‌హీన్‌ను లోపలికి దీసికొనిపోయి, 'అమ్మా, గుల్‌నుమ్, ఇదె సిరాజ్‌హీన్! నీ స్వప్నములు గట్టెక్కినన, జూడు మాదెన సూర్యభగవానుడును దూరపుకొండ నధిష్ఠించి నాడు. మీరును మీరును గలసికొంటిరిగదా! ఇక నా బాధ్యత తీరినది కాని అమ్మా; సిరాజ్‌హీన్ నీపేర వ్రాసిన యుత్తర మెప్పుడు వ్రాసిరో, ఏయూర పోస్టున వేసిరో, గొంచె మడిగి చూడు' మని అభినయమ్ సూచింప, నామెయు చిర్నగవున మిన్నకుండ, గుల్‌నుమ్ విలాసముతో వచ్చిన ఆకమ్మ నాతని కొసంగ నాత డద్దానిం జదువుకొని, తన వంతకమూ యని భ్రమగొలుపు నా తరుణలిఖాని నైపుణ్యమును చేసాఫును ప్రస్తుతించి, 'ప్రస్తుతరచనకు వీనిని మెచ్చుకొన వలసినదే; అన్నిరసములును గనపరచి నాడు; వీడన్నిటం జతురుడే, మనము నేర్చుకొనవలసినవి పెక్కులు గల' వని సిరాజ్‌హీన్ పన్మయానందముఖుడై నిలువ, 'మనము పోవల సినవేళ యైనది; రం' డని 'షుంగల్సేన్, నీవును శ్రమపడి స్వర్ణ ముయిని, మామగారిని దీసికొనివచ్చితివిగదా; ఇపుడు వీరి నందర దోడుకొని వేగ మా రెస్టు హౌసుకు రావలెను. మరియు, మన ఔట్‌హౌసులో, జాముల కాలము నుండియు నీతో బరిచయము గల గులాబ్‌సింగ్ పురోప్ కరీమ్, జామలచే

మాయామోహితుఁడై, వెఱ్రివాఁడై యున్నాఁ డాతనిఁగూడ దోడ్కొనిరమ్మని అరిందమ్ చెప్పి, వారికి కారులు సిద్ధపరచి తానును, సిరాజ్‌హీన్‌ను, పండిట్ త్రివిక్రమరావును, చంద్రమౌళియు నొక కార్‌లో, సర్కిల్ ఇన్‌స్పెక్టరుగారి యింటికి బోయి, యాయనను దోడ్కొని, ఠాణాకేఁగ బోయి, అక్కడ కొన్ని యేర్పాటులుచేసి, త్వరితగతి నా రెస్టు హౌసును జేరి, అక్కడి నిన్నటి సాయంకాలపు తమ గదితాళము దీయుచు, 'సిరాజ్‌హీన్, మీరు మఱి నాలుగు రోజు లుండవలెను; తొందరపడి పో నాలోచింపవల' దనుచు, వీరిరువురును లో ప్రవేశింప, 'ఆఁ—ఏమిది? గుల్‌సుమ్‌నేల నిటకు రప్పించిరి? ఈగది నేల నుంచిరి? ఛీ! రాణివాసపు తెన్నెఱుంగని వచ్చి బాపనయ్యలతో మర్యాదల గూర్చి ప్రసంగ మేల? నాదీ తప్పు.........'

అరిందమ్ అన్యాలోచనాపరుఁ బోలె వేఱుకైన జూచుచు నిలచియుండెను.

'ప్యారీ! మేము పోలీసు స్టేషనుకు బోయి వచ్చునంతలో నిం దేల వచ్చితివి? ఇంటిమర్యాద వీడి, దేశద్రిమ్మరివై, ఒరు నింట గాపురం బుండి, సిగ్గులజ్జల వీడి, విడివడి నిటకు రా దగునా? ఇది నీకు దగవా? ఏమి మాటాడ వేమి? ఊఁ—
ఇంతకును, నిన్నింతకుఁ దెచ్చి, మీఱబెట్టిన నరిందమ్ బాబు...

'బాబూ, అరిందమ్‌జీ! అన్ని బాగున్నవి గాని, రాణి

వానమును రో డ్డెక్కించుట మానితవుగునా ? ఏమివనియున్న దని యీామె నిటవు రమ్మంరి ?'

'ఈమె నెవరు రమ్మనిరి ? నే నెరుగను; మీారే యడిగి దెలిసికొనుడు'

'ఏ మడిగినను, బెల్లముగొట్టిన రాతిరీతి నూరకున్నది; దేశాలంబడి, రో డ్డెక్కి, పరిగృహావాసములు జేసినవా రా పిదప తమ భర్తలకే గా దా నురభర్త కైనను లొంగుదురా నరకు సేతురా? నే నెరుగనా?'

'ముదిరిసది. ఇక నూరకుండ రా' దనుకొని, 'అయ్యో రామాయణ మంతయు విని 'సీతకు రాము డేమగు?' నని ప్రశ్నించినటుల నున్నది ఇ తసేప్పుడు నేమి చెప్పియుంటిని? ఇది, మీా గుల్ నుమ్ కాదు; ద్రోహిని పట్టుటకు సృజించిన మా గుల్ నుమ్. ఇందు చిత్రకారుని ప్రజ్ఞావిశేష మశేషము.' అని అరింద మ్ చెప్పుచుండ విని, తన మిత్రవర్గము గూడ వచ్చి, చూచి, ఆశ్చర్యము నొందుచుండ, సిరాజ్ హీన్ తృప్తి నొందక, తాకిచూచి, నోట మాటలేని ప్రతిమయయ్యెను.

---

## ఐదవ ప్రకరణము

---

పిదప నాగదికి తాళమువేసి యీావలనున్న మృతకళేబరముల దెస నరిందమ్ సిరాజ్ హీనులు వచ్చుచుండ, 'అరిందమ్ నీ ధీచాతురియు, నీ మేధాదార్ఢ్యతయు ననుపమానసీయము'

మాయామోహితుడై, వెఱ్ఱివాడై యున్నా డాతనింగూడ దోడ్కొనిరమ్మని అరిందమ్ చెప్పి, వారికి కారులు సిద్ధపరచి తానును, సిరాజ్‌హీన్‌సు, పండిట్ త్రివిక్రమరావును, చంద్రమౌళియు నొక కారులో, సర్కిల్ ఇన్‌స్పెక్టరుగారి యింటికి బోయి, యాయనను దోడ్కొని, ఠాణాదెస బోయి, అక్కడ కొన్ని యేర్పాటులుచేసి, త్వరితగతి నా రెస్టు హౌసును జేరి, అక్కడి చిన్నటి సాయంకాలపు తమ గదితాళము దీయుచు, 'సిరాజ్‌హీన్, మీరు మరి నాలుగు రోజు లుండవలెను; తొందరపడి పో నాలోచింపవల దనుచు, వీ రిరువురును లో ప్రవేశింప, 'ఆఁ—ఏమిది? గుల్‌సుమ్! నేల నిటకు రప్పించిరి? ఈగది నేల నుంచిరి? ఛీ! రాణివాసపు తెన్నెరుంగని పచ్చి బాపనయ్యలతో మర్యాదల గూర్చి ప్రసంగ మేల? నాదీ తప్పు.........'

అరిందమ్ అన్యాలోచనాపరుం బోలె వేరుకడన జూచుచు నిలచియుండెను.

'ప్యారీ! మేము పోలీసు స్టేషనుకు బోయి వచ్చునంతలో నిందేల వచ్చితివి? ఇంటిమర్యాద వీడి, దేశద్రిమ్మరివై, ఒరు నింట గాపురం బుండి, సిగ్గులజ్జల వీడి, విడివడి నిటకు రా దగునా? ఇది నీకు దగవా? ఏమి మాటాడ వేమి? ఊఁ—
ఇంతకును, నిన్నింతకు దెచ్చి, మీరబెట్టిన నరిందమ్ బాబు...

'బాబూ, అరిందమ్‌జీ! అన్నీ బాగున్నవి గాని, రాణి

వానమును రోడ్డెక్కించుట మానితనుగునా? ఏమివనియున్న దని యీామె నిటకు రమ్మంటివి?'

'ఈమె నెవరు రమ్మనిరి? నే నెరుగను; మీరే యడిగి తెలిసికొనుడు'

'ఏ మడిగినను, బెల్లముగొట్టిన రాతిరీతి నూరకున్నది; దేశాలంబడి, రోడ్డెక్కి, పరిగృహావాసములు జేసినవారా పిదప తమ భర్తలకేగా దా నురభర్తకైనను లొంగుదురా వరకునేతురా? నే నెరుగనా?'

'ముదిరిపడి. ఇక నూరకుండ రా' దనుకొని, 'అయ్యో రామాయణ మంతయు విని 'సీతకు రాము డేమగు?' నని ప్రశ్నించినటుల నున్నది ఇంతసేపును నేమి చెప్పియుంటిని? ఇది, మీ గుల్‌నుమ్ కాదు; ద్రోహిని పట్టుటకు సృజించిన మా గుల్‌నుమ్. ఇందు చిత్రకారుని ప్రజ్ఞావిశేష మశేషము.' అని అరిందమ్ చెప్పుచుండ విని, తన మిత్రవర్గము గూడ వచ్చి, చూచి, ఆశ్చర్యము నొందుచుండ, సిరాజ్‌హీన్ తృప్తి నొందక, తాకిచూచి, నోట మాటలేని ప్రతిమయయ్యెను.

---

## ఐదవ ప్రకరణము

---

పిదప నాగదికి తాళమువేసి యీావలనున్న మృతకళేబరముల దెస నరిందమ్‌సిరాజ్‌హీనులు వచ్చుచుండ, 'అరిందమ్ నీ ధీచాతురియు, నీ మేధాదార్ఢ్యతయు ననుపమానసీయము'

లని తనమిత్రులు గొనియాడుచుండ, నేకడనుండియో, నేకొర కయియోగాని, నొక బాగ, భూపరాగం బెగురబర్వెత్తివచ్చి, 'ఛీ! ఎంతపనిచేసితివి? ఎంతో మేధావంతుడవని లోకముచే నెన్నబడుచున్నా నని గర్వమున నున్న నో యరిందమ్, ఎంత పనిచేసితివి! నీ యట్టి యాచితి నెరింగినవానికిని, గాంభీర్య, విశాలహృదయునకును, దగనిపని సుమా; నీ భార్యను సుర క్షితముగ దన తండ్రియింట జేరజేసి, నీకు స్నేహితుడౌ పండిట్ త్రివిక్రమరావునై, నీవిలాసమున కంపిన ఏరోప్లేన్ గల యినుప మందసపు రసజ్ఞతయుం దొక్క యాడుదానికి దీసిపోతివే! ఠాణాలో నీ యనుగతులును, నీ యనుచరులును, దక్కంగల పెరవారును తెల్లబోయి చూచుచుండ, మంగళ్సేన్, ఆయినుప మందసము నమన్వయించి, అందు దిగి, నీకు జూపుచుండ, నీ పంచభూతాధినాథుండు ఖేచరమార్గంబున విచ్చలవిడి న్విహరించు చుండ, వెల్లంబోయి, మందుడవై, యంధుడవై, విఫలీ కృతమనోరథుండవై, నీవు మింటిదెస నాశ్చర్యమున జూచు చుండ, మెకానిన్ వేసమున, నీప్రక్కనే నగుచు, నిలచియున్న నన్ను బోల్చుకొనజాలకుండిన నీవు, యింకను నె న్నేని విద్యా బుద్ధులు గరుపవలసియున్నదనియు, నీ కింకను ననుభవము చాల దనియును, నీకు దెలిపిన, మారులను నేను సుమా! ఈ పంచభూతాధినాథు నధీనను, పాపమనాశ, నను ననాథం జేసి, ఎంత కొల కొడిగట్టితివి! ఛీ!...........'

'మారులా, కాదు—కాదు; నా పన్నాగ మీతని పన్నాగముల వలెనే, తనను బట్టుటకే గాని, చంపుటకు కాదు; తా నాత్మహత్య గావించుకొనెనే గాని, నే నీతని జంపలేదు; నే నీతని యీ యమానుష కార్యమును వారింపకపోలేదు. నీ వెంతమాత్రమును పొరబాటు పడరాదు.'

'ఆహా! నాథా! ఆత్మగౌరవము దక్కించితివి!'

'అరిందమ్, మే ముండిన గుహ నీవు చూచియేయుం టివి గదా దానికి దక్షిణమున నాలుగు మైళ్ళ దూరమున నున్న గుహలో, నాభర్త మరణవార్త వినినదోడన, లెక్కలు చూచి, లాల్‌చంద్ తాలూకు రూ. 89,865-14-6 లును. బ్యాంకినుండి తీసుకొనిపోయిన రూ. 5,000 లును, ఒక్క చోటనే, పెద్దరాతిగుండువంటి యినుపమందసమున నుంచి, 'పరవిత్తము' అని దానిపై గుర్తించి పెట్టితిని. నీ వటకు పోయి, యుద్దానిం గైకొని, లాల్‌చంద్ యొక్క సొమ్మతని కిచ్చివేసి, నీది నీవుదీసికొని, 'మారుల' వలన మామాసొమ్ములు వాపసువచ్చెన' వని, నీ యభిమానపత్రిక యగు 'కేసరి' లో ప్రకటింపుము; మరచెదవేమో సుమా!'

మారుల నిజశిరస్థితాలంకార పద్మరాగమణులు భర్త పాదరాజీవములకు నీరాజనం బిడ, సమర్పించి.

'ఓ పంచభూతాధినాథా, నాథా, నిన్నెఱుంగక, నీ సామర్థ్యము దెలిసికొనజాలక, నీ మేధాశక్తిం దనివార గుర్తిం

పజాలక, ప్రతి పదమునను, ప్రతిమెత్తునను, ప్రతికార్యమునను ననుక్షణమునను, నీ వొనర్చిన మేలును, లాభమును గ్రహించి, కొనియాడంజాలక, ఇంత లొనర్చిన అరిందమ్‌ను గూర్చి నా మనం బొగులు కన్న, నను నొంటి జేసిపోతివే యని యంతగ విచారింపజాల.

'మన్మమనోనాథ గళ గళ ద్రక్త కాంతి విజిత హారిధను ష్కాళాజాలమా, ఓకరవాలమా, నీవెంత ధన్యురాలవు! సృష్టికి ప్రతిసృష్టిగల్పింపగల మన్నాథుని యాత్మకు శాంతిగలుగజేసి, మానవకరముల నీచబాధల దొలగించి, ఆత్మగౌరవము నిలువ బెట్టితివి నిను బహూకరింప సమర్థమగుమార్గము దోపకున్నది. ఏది యెట్లున్నను, నాయందును గూడ సంపూర్ణ కటాక్షముంచి, మన్నాథుం జేర్పు' మనుచు నట బడియున్న కాలూరాయి కరవాలముం దిసికొని, తన మొల నున్న నదే తరగతి కత్తి నెడమచేత బట్టుకొని, కదనసీమం బీన్గులనడుమ తాండవం బాడుచుండు రణరంగకాళింబోలె, విరియబోసినకురులతో—

'చలో—జాక్,

అమారా మరద్ కాలూరాయికా షాన్.'

అనుటయు దడవుగాని, తన వక్షోభాగమున బొడిచికొని నిజనాథు పాదములపై కొరగి యుసురులం దొరఁగుట కేమియు నాలస్యము కానేలేదు. అరిందమ్ మిగుల సాహసించి, మారుల నైనను నా పని మాన్ప ప్రయత్నించెనే గాని, రెప్పపాటుకాలమున జరిగిన నీ కార్యమున కేదీ వ్యవధి?

జరుగవలసిన విధు లన్నియు జరిగినవి. పద్ధతు లన్నియు అనుసరింపబడినవి. కంటకావృతంబగు మార్గము రాజమార్గంబాయినది. దుర్గమము లన్నియు సుగమములైనవి.

'కరీమ్, చూచితివా? కాలూరాయిని, మాయలను. ఒకప్పుడు నీకు గుర్తుండే కదా! అహాహో పడియున్న మీనాకేత్!'

'మంగళ్సేన్, ఈ కరీమ్ యెవడో పోల్చినావా?'

'బాగా పోల్చలేను గాని, ఒకప్పుడు వీడును ప్రోహిం కోటలోనివాడే యని తోచుచున్నది. జమీలియాకాలమున నామె విమర్శల స్మృతి దప్పించిన సందర్భమున నీతడే మైత్రీ సంబంధము గలుగజేసికొననేమో యని స్ఫురణకు వచ్చుచున్నదే గాని బాగా చూడలేదు'

'ఆ సందర్భమున సంబంధము కలుగజేసికొనుట మాత్రమే కాదు—నేను తెలివి తప్పియున్న సమయమున, నదివరకెంతకాలము నుండియో గాని జమీల మోహనదృష్టులకు లోనైన యీయామె యపాంగవీక్షణములకు దాసుడై, ఆమె ముందుముందు ననుకొని; నను రైలువచ్చుచున్న సమయములో రైలుపట్టాలమీద బారవేసి, పోయి, జమీలకు నివేదించ నామెచే గౌరవింపబడుటకు మారుగ దూషింపబడిన గులాబ్‌సింగ్ పుత్ర కరీమ్ యీతడే! పాపము! జమీలాక్రాంత మానసుండగు నీతడు, జమీలాన్వేషణుడై, దేశదేశాల దిరుగుచు, మృతి నొందిన జమీలా లగ్నమానసుడై, వెర్రివాడై దిరుగుచు,

మతిభ్రమణము నొందిన దైవోపహతుఁడు. ఈతనికి చక్కని కన్నె నిచ్చి వివాహ మొనర్పవలెను' అనుచు నరేందమ్మయును తన మిత్రబృందమును, మంగశ్సేనును మగుడి యిలుసేరిరి.

---

## ఆఱవ ప్రకరణము

---

మ. 'పరవిన్ వేఁడికి డస్సి శీతలజల ♦ స్నానంబుగా, నిర్మలాం
బరపాళిం దడియారఁజి, మంచుఁజెమరున్ ♦ మాఘ్యానిలం బార్పఁ
గా బురుసా, పట్టుజరీ, బుటాపరికిణీ ♦ ముస్తీబుతో, సాదరా
బురఖాతోడ, జవాహరీపటలితో' ♦ భూకాంత గూడెన్
మధున్.'

భీష్మగ్రీష్మతాపమున కోరువంజాలక, జల్లనిపీట జలక మాడి, నిర్మలాంబరమున దడియారఁజి, మంచు జెమ్మటలను మాఘమాసానిలమ్మున నార్చికొని, బురుసా, పట్టుజరీబుటా పరికిణీ ముస్తాబుతో, అపరంజి జవాహిరీ నమూనాముతో సాదా బురఖాతో, మాధవుం గూడ నెదురుతెన్నులు సూచుచు, సన్నాహ పడుచుండెను.

* * * * *

ఎంతోకాలము గడువలేదు.

బ్యాంకిలో తాను నిలువయుంచుకొనిన సొమ్మున కానాడు కాలూరాయి హస్తలాఘవమే సోకకున్నచో,

డైనను నీవే; నాకు గూతురైనను, గోమకైనను యీనరో జినిర్రే; నేసిక నీ యుద్యోగమునకు రాజీనామా దాఖలు చేయుచున్నాను. నాకును వయసు మీరినది. ఫూల్ సాహేబు చమత్కారములు నీ నెరుగకపోయినను, జూమల కాలమునకు బూర్వమునుండియు నాతోపా టెనోన్నపాట్లు వడి, నాకు కుడి భుజమువై యుంటివి ఇప్పుడు నేను, స్వర్ణమయియు పోయి బ్రహ్మ కపాలమున, సర్వజగన్నాటక సూత్రధారియగు నా శ్రీహరిం గూర్చి, తపము జేసికొనుచు వానప్రస్థమున గాలము పుచ్చుచుందును. ఈ నరోజిని నీ యధీనము—ఈ భవనము నీది—నా స్థిరచరాస్తులు నీవియు—లాల్ చంద్ సొమ్ము లాల్ చంద్ నకు ముట్టినది. నా సొత్తంతయు నీ యధీనము

'మిత్రులారా, చూచితిరా, దేవుని భావనా చమత్కృతి!

శ్రీలం గోరినభంగి నిచ్చి జనులన్ • జిత్రంబుగా రోసి, దు
ర్శీలుర్ ద్రోహని వానికార్యమునవే • శిక్షాయుతుం జేయుచుం
డాలోలుండయి బ్రోచు సుజనబృం• దమ్మున్ యశఃకాములన్
లీలం దేల్చెదు నీశుఁడిచ్చు శుభముల్ • నిత్యంబు నిష్పేటికిన్.

'ఎంత మేధాశాలి యైన నేమి; ఎంత ధనవంతుడైన నేమి; ఎంత బలాఢ్యుండైన నేమి; ఎంత ప్రాజ్ఞపుణి గలవాడైన నేమి; దురంతరకార్యములు జేయ యత్నించుచు కొంత దూరము జయమందె తుదకు, తన కార్యములవల్లనే, తన

కార్యముల గుత్సితమార్గములను యుక్తులచే పట్టుబడి యనంతర మంతమొందును. భగవంతుడు సిరి సంపదలను జనులు కోరిన రీతి నిచ్చి, తా నొసంగిన సంపదలను సద్వినియోగము సేసెనేని, యట్టివారలకు సద్గతులు గల్పించుచు, నటుగాక, తా నిచ్చు సంపదల దుర్వినియోగ మొనర్చుచో, వారి వారి కార్యముల పట్లనే, వారిని శిక్షార్హులుగ నొనరుచు నేర్పుగల భగవంతుని చర్యలు దుర్భేద్యములు గదా! ద్రోహచింతలు గలవారి పాట్లు దెలిసికొనుటకు, కాలూరాయి దుర్గతియే మనకు నుదాహరణమాయె గదా!

'కాని, జామెబినెట్లను మించిన అద్వితీయుడై, బహు మేధాశాలియైన వ్యక్తి గతించినందుల కెంతేని విచారించుచున్నాను.

'సిరాజ్ హీన్, మీ కష్టములు గడచినవి. ఇక మీరును గుల్సుమ్ యును, మీ యిచ్ఛవచ్చినప్పుడు బయలుదేరి, మీ రాజ్యమున సుఖ ముండుడు.

మిత్రులారా,

'నాతోపాటు మీరందరునుగూడ—గడచినవి గడచినవి గాని—యిపుడు సరోజిని వివాహమును కాజేయించినందుల కెంతేని కృతజ్ఞుడను.

'ఇన్నేళ్ళు గొలుపున నుండియు, నిన్నేళ్ళు జీవించియు, నిప్పటికే నొనర్చిన గార్య మొక్కటియు లేదు; ఇకముం దెవ్వరి

రక్షింపగలను. రక్షాశిక్షలే మానవ హస్తగతంబు లైననాడు, మరి సృష్టికర్త యేల? ఇం కెంతకాల మున్నను జీవికి ఐహిక కార్యముల పరమావధి గానరాదు. కావున భార్యాసహితమ్ముగ నేను బ్రహ్మకపాలమునకు బోయి వానప్రస్థమున నా శేషించిన గాలము పుచ్చుపో బోనున్నాను. నేనును తమకు కృతజ్ఞతాభివందనము లొనర్చి శలవు గైకొనుచున్నాను.'

## సింహావలోకనము

పాఠకులారా,

మీకు చాల యాయాస మైనది; కథయు నంత మైనది. తిప్పులతిమాపాలలో భ్రమపడి; న్యాయరక్తాపరాధమున విస్మయమొంది; ఎత్తుపైయెత్తుల కామోదమొంది; కథలో చిత్రకథంగల నాటకాంతర్నాటకమ్ములకు మనమ్ముల నక్కజమొందింది; మహాద్భుతశోకసక్కెమొనర్చి; భిన్నభిన్నములై, విచిత్రములౌ నెదురునాన్హాములకు గుతూహలులమై; పటేల్, కాలూరాయి, మారుతుల యాకస్మికమరణముల కెంతేని విషాదమొందితి; గుల్సుమ్ పీర్జాహానుల కొండొరులకు గలిగిన పునర్దర్శన లాభములకు సంతసమొంది, సరోజినీమంగళ్సేనుల వివాహముల నారసి; అక రాచీస్వామిద్రోహమును, పటేల్ పరస్త్రీవాంఛాలోలత్వమును, కాలూరాయి ధనకాంక్షయును, తల్లాభములను జూచినాము గదా!

ఇక నేమున్నది? అంతా యింతే!